ప్రథమ ముద్రణ:
2000 ప్రతులు.



## ముఖ్య గమనిక

ఈ పుస్తకములోని పాత్రలూ, ప్రదేశాలూ, సంఘటనలూ కేవలం కల్పితాలు. ఎవరినీ ఉద్దేశించినవి కావు.

—రచయిత.





ప్రతులకు:
రచయిత పేర,
C/o. "జాగృతి", విజయవాడ-2. కు
వ్రాయవలెను.

# సమర్పణ



తమదు బాధ్యతలను తప్పించుకొనజూచు
పతిత మానవులకు పథముజూపు
"గీత" నొసగినట్టి కేశవవిభునకి
చిన్ని పూవు కాన్క జేయువాడ !





# ఆశీస్సు.

—×—

రాజమహేంద్రవరం,
5—10—1956.

"వర్తమాన సాంఘిక పరిమేయాలు ముచ్చటించడంద్వారా, శాశ్వతమైన సానందబోధ ఆంధ్రులకు సిద్ధించాలని ఉద్దేశించే శ్రీ మన్నవ గిరిధరరావుగారి యత్నాంకురం పాదుకొని పెరిగి విరివిగా ఫలించాలని ఆశీర్వదిస్తున్నాను."

(సం.) భమిడిపాటి కామేశ్వరరావు.

# కృతజ్ఞత



ఏకలవ్యునికి ద్రోణాచార్యులు ఎలాంటివారో నాకు శ్రీ సుధాకర్ సి. రాజే అలాంటివారు !

శ్రీ సుధాకర్ చంద్రసేన్ రాజే బరోడాలో విద్యాభ్యాసం చేశారు. ఎం. ఏ., ఎల్. ఎల్. బి. డిగ్రీ పుచ్చుకున్నారు. నవనీతమైన హృదయమూ, సునిశితమైన మనస్సూ, చిరునవ్వు లొలికే వదనమూ కలవారు. విజ్ఞానమూ, దానిని మించిన నమ్రత కలిగిన వ్యక్తి. నిర్విరామంగా అనేకభాషల్లోని పుస్తకాలనూ, పత్రికలనూ చదివి మననం చేసుకుంటుంటారు. ఇదంతా వారినిగురించి నేను విన్న సంగతులు. ఇంతవరకు వారిని స్వయంగా కలుసుకునే భాగ్యం నాకు కలుగలేదు.

వారు ఢిల్లీనుండి వెలువడే "ఆర్గనైజర్" అనే ఆంగ్ల వారపత్రిక సహాయ సంపాదకులుగా వుంటున్నారు. వారా పత్రికలో అనేక హాస్యపూరితమైన రచనలను వ్రాస్తూవున్నారు. నాకు హాస్యంమీదా, వ్యంగ్యంమీదా అభిలాష జనించడానికి వారి రచనలే ముఖ్యకారణం. వారి రచనలను కొన్నిటిని తెనుగులోకి అనువదించాను. మరికొన్నిటిని అనుసరిస్తూ స్వయముగా హాస్య, వ్యంగ్య రచనావ్యాసంగం మొదలెట్టాను. నేను వ్రాసిన రాజకీయ వ్యాకరణానికి శ్రీ సుధాకర్ రాజే వ్రాసిన 'పొలిటికల్ గ్రామర్'అనే రచన ప్రాతిపదిక. ఇపుడు పాఠకులకు అందిస్తున్న ఈ "ఎం. ఎల్. ఏ. ఆత్మకథ"కు నేను వ్రాసిన

ఇతర 'ఆత్మకథల'కూ స్ఫూర్తి కేంద్రం శ్రీ సుధాకర్ రాజే వ్రాసిన ఇలాంటి రచనలే.

ఈసందర్భంలో శ్రీ సుధాకర్ చంద్రసేన్ రాజేగారికి నా హృదయపూర్వక నమస్కృతు లర్పిస్తున్నాను. వారి బాధ్యతలను వారు మరింత విజయవంతంగా నిర్వహించి దేశానికి కాంతినివ్వగల సామర్థ్యం వారి కొసంగవలసిందిగా సర్వేశ్వరుని ప్రార్థిస్తున్నాను.

శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారు హాస్య రచయితలుగా మనకు చిరపరిచితులు. వారు నన్ను ఆశీర్వదించటం నా మహాద్భాగ్యం. వారి వాత్సల్యానికి నేను కృతజ్ఞత తెలుపుతూ భక్తిపూర్వక ప్రణామము లర్పిస్తున్నాను.

పందిరి ఉంటేనేగాని లత అల్లుకోలేదు. నా రచనలను గత మూడుసంవత్సరాలనుంచి "జాగృతి" సంపాదకులు ప్రచురిస్తూ వచ్చారు. వారిచ్చిన ప్రోత్సాహమే నేటికొక పుస్తక రూపం దాల్చింది. వారికి నేను సదా కృతజ్ఞుడను.

భారత ముద్రణాలయంవారు నాయెడలచూపిన ఆదరముతోగూడిన ఉదారతయే ఈ పుస్తక సత్వర ప్రచురణకు ప్రధాన కారణం. వారికి కృతజ్ఞత తెలుపటం నా విధ్యుక్తధర్మం.

పాఠకుల రూపంలోనున్న సర్వేశ్వరునకు సమర్పిస్తున్న ప్రథమ పుష్పమిది. వారిలోని సహృదయతయే దీనికి పరిమళాన్ని చేకూరుస్తుంది!

గుంటూరు,
విజయదశమి,
దుర్ముఖి.

విధేయుడు,
గిరిధరరావు.

# ఎం. ఎల్. ఏ. ఆత్మకథ!!

## 1. ప్రస్తావన

ఎం. ఎల్. ఏ. ఆత్మకథ వ్రాస్తున్నాడనంగానే సాహితీ జీవులందరికీ తగని అసూయ! ఎం. ఎల్. ఏ. గూడ ఒకరచయితేనా అనీ; అతనికి ఆంధ్రభాషలో అక్షరాలెన్నున్నాయో తెలుసునా అనీ; అతను గనక ఆత్మకథ వ్రాసి లోకం మీదికి వదలితే తెలుగు సారస్వతం మంచం పట్టదా అనీ చెప్పుతున్నారు!

నాకు సారస్వతంలో ఓనమాలు రానిమాట నిజమే. ఒక ఖండకావ్యంగాని, ఒక అఖండకావ్యంగాని చదివినవాణ్ణిగూడ కాను. అంత మాత్రాన నేను ఆత్మకథవ్రాసినట్లయితే సారస్వతం నీరుకారిపోతుందని నేను అనుకోను. వచనాన్ని గేయాలుగా వ్రాసి అచ్చువేస్తుంటే కారని నీరు వచనాన్ని వచనంగా వ్రాస్తే కారుతుందని నేను భావించటం లేదు.

అదీగాక ఆధునికయుగాన్ని ఆత్మకథల యుగ మని చరిత్రకారులు స్పష్టంగా పేర్కొన్నారు. "చుట్టతాగని ఇంగ్లీషువాణ్ణిచూశావ్?" అని ఆనాడు గిరీశం వెంకటేశాన్ని ప్రశ్నించాడు. "ఆత్మకథవ్రాయని పెద్ద మనిషిని చూశావ్" అని ఈనాడు నేను ప్రశ్నిస్తున్నాను. సాహిత్యంలో గాని, విజ్ఞానంలోగాని, రాజకీయంగాగాని, ఆమాటకొస్తే ఏ కళారంగంలో నైనాసరే వేలుముడిచి చెప్పదగిన పెద్దమనిషి వున్నాడంటే ఒక ఆత్మ కథను స్వయంగావ్రాసి లోకానికి సమర్పిస్తున్నాడు.

పూర్వం ఈ బాధలేదు. శ్రీ రామకృష్ణపరమహంస, బాలగంగాధర తిలక్, రాజా రామమోహన్‌రాయి మొదలైనవాళ్లు వున్నారంటే వాళ్ళు కాలంచేసిన మరుక్షణంలో అనేకమంది అనేక భాషలలో వాళ్ళ జీవిత చరిత్రలను పద్యరూపంలోనూ, గద్యరూపంలోనూ పరిపరి విధాల వర్ణించి లోకానికి అందజేశారు. ఆ గ్రంథాలను గుట్టలు గుట్టలుగా జనం కొను

శొక్కాని చదివారు. ఆ మహాత్ములు బ్రతికున్నప్పుడుగూడ తెలియని అనేక సంగతులు గతించినతర్వాత లోకానికి తెలిసినయ్.

ఆ విధంగా ఉత్తరోత్తరా మనల్ని గురించి ఎవరో వ్రాసి ముద్రిస్తారని నమ్మలేకుండా వున్నాను. అలాంటి సూచనలు కనిపించటంలేదు. నన్ను గురించి ఎవరికి తెలుసు వ్రాయటానికి? ఒకవేళ తెలిసినా ఎందుకు వ్రాస్తారూ? అమాత్రం పరోపకారభావం మనుష్యుల్లో ఏదీ? లేదు. ఇవి కేవలం స్వయంకృషిమీద ఆధారపడవలసిన రోజులు. నన్ను గూర్చి నేనే వ్రాసుకోక గత్యంతరం లేదు.

"నిన్ను గురించి నీవు చెప్పుకోనకు. ఎందుకంటే మంచి చెప్పుకుంటే ఎవరూనమ్మరు; చెడుచెప్పుకుంటే ఇంకెంత వున్నదో ననుకుంటారు". అని ఎవరో అంటే విన్నాను. ఈ మాటగూడ ఆలోచించదగిన విషయమే. ఆత్మకథ వ్రాయబోయేముందు ఇది ఎంతవరకు సత్యమోననిగూడ విచారించాను. నన్ను గూర్చి నేను మంచీచెప్పగూడదు; చెడూ చెప్పగూడదు అని దీని తాత్పర్యం. ప్రతివిషయమూ మంచిదైనా అవుతుంది, చెడ్డదైనా అవుతుంది. రెండూ కాకుండా మూడవది అయ్యే అవకాశం లేదు. ఏతావాతా తేలిందేమంటే నన్ను గురించి నేను ఏమీ చెప్పుకో కూడదన్నమాట. సూక్ష్మంగా ఆలోచిస్తే ఇది లోకవిరుద్ధమైన విషయం. కరెంటు ఆగిపోతే లైట్లు ఆరిపోయినట్లు నేను అనే మాట లేకపోతే ప్రపంచంలోని కార్యకలాపమంతా స్తంభించిపోతుంది. ఈ 'నేను'తోనే మన జీవనమంతా ముడిపడివున్నది. కాబట్టి బహుశాఅహంకారం కూడదనిమాత్రమే పైమాటలోనిభావం అయివుంటుంది.

అహంకారంమీద నా కెలాంటి మమకారమూ లేదు. నన్ను గూర్చి నేను స్తోత్రం చేసుకోవటంకోసం ఈ ఆత్మకథను వ్రాయటంలేదు. కేవలం ప్రజానీకంయొక్క ప్రయోజనంకోసం నేనీశ్రమ పడుతున్నాను. గాంధీ మహాత్ముడంతటివాడు ఆత్మకథ వ్రాశాడు. అహంకారంతో వ్రాశాడా? లేదు లేదు. ఆయన తనలోని సుగుణాలనూ, అవగుణాలనూగూడ "మొహమాటం" పోకుండా పేర్కొన్నాడు. అందువలన కోట్లకొలది మానవ మాత్రులు దాన్ని చదివి గుణపాఠాలను గ్రహిస్తారని వారి సంకల్పం. అలాగే లోకం ఇపుడు ఎం. ఎల్. ఏ. అనే పదవిని, అందుకోవలసిన "ఉట్టి"గా గుర్తించింది. అందుచేత నేను శాసనసభ్యుణ్ణి కావటానికి ఎంత

దీక్షతో కృషిచేశానో, ఎన్నిమాటలు పడ్డానో, ఎన్ని బాధలు సహించానో, ఎంతమర్యాద పొందానో, ఎన్నిమజిలీలు చేయవలసివచ్చిందో స్వానుభవం ద్వారా తెలియజెప్పటం వలన రాబోయే తరాలవారికి మార్గదర్శకంగా వుంటుందని ఇందుకు పూనుకుంటున్నాను. సాహితీవేత్తగా "షై" నవుదా మనే అభిలాషమాత్రం లేదు.

## 2. పుట్టు పూర్వోత్తరాలు

నా జన్మదినం గురించి వ్రాయాలంటే నాకే 'ఇది'గా వుంది. ఫలానా తేదీన ఇన్నిగంటలకు నేను ఉద్భవించినట్లు మా నాన్నగారు ఎక్కడా వ్రాయించి వుంచలేదు. దాన్నిగూర్చి నేనూ అంతగా పట్టించుకో లేదు. మొన్న మొన్నటివరకు జన్మదినంతో ఆటే అవసరం లేకపోయింది. హైస్కూల్లో చేరినపుడు ఉజ్జాయింపుగా ఏదో ఒకతేదీ వేశారు. ఈమధ్య ఎం. ఎల్. ఏ. ను అయిన తర్వాత జన్మదినోత్సవమూ, అభినందనసభా జరి పించుకోవలసిన ఆవశ్యకత కనపడింది. ఇదమిత్థంగా తెలుసుకోటంకోసం మా అమ్మగారినే అడిగాను జన్మదినం యేదని. ఆమె క్రోధననామసంవత్సర మని ఖాయంగానే చెప్పింది. తిథిమాత్రం రోహిణీకార్తెలో వచ్చే అమా వాస్యనాటి మధ్యాహ్నం ఒంటిగంటకని ఉజ్జాయింపుగా చెప్పింది. క్రోధన అంటే 1925 వ సంవత్సరమని తెలిసినవాళ్లు చెప్పారు- బాగానేవున్నది. కాని రోహిణీకార్తెలో అమావాస్య అనంగానే నా గుండె గుభేలు మన్నది. అమావాశ్యనాడు జన్మించినవాడు జేబులు సర్దుతాడంటారు. అది వేరేసంగతి. రోహిణీకార్తెలో గనుక జన్మదినోత్సవం జరుపుకుంటే పక్షిగూడా ఆ ఛాయలకు రాదు. రోళ్లుపగిలే ఎండల్లో జన్మదినం ఏమిటి నా మొహం !

అందుచేత నా ఆప్తమిత్రుడైన సుశీలారావు సలహాప్రకారం దేశం లోని రాజకీయ నాయకుల జన్మదినాలన్నీ ఒక జాబితా వ్రాసి, ఆ పట్టిక లో అటు పదిహేనురోజులూ ఇటు పదిహేనురోజులూ ఎవరి జన్మదినమూ పోటీకి రాకుండా చూసి, జనవరి 18 వ తేదీ సాయంకాలము 6 గంటల 12 నిముషాలకు నేను జన్మించినట్లుగా నిర్ణయించాము. ప్రాక్టికల్‌గా

ఆలోచిస్తే ఇది సమంజసమైన నిర్ణయంగా తోచింది. ఊరేగింపూ అదీ పూర్తయి సభాస్థలి చేరేసరికి ఎట్లా లేదన్నా సాయంకాలం ఆరు కొడుతుంది. జన్మకాలం సరియైనదని ప్రజానీకం నమ్మటానికి వీలుగా 12 నిముషాలు అనికూడా చేర్చాం. అంతకన్న మరేం లేదు.

తిమ్మాపురం ఫిర్కా బోడిపాలెం గ్రామ మున్సబు మా నాన్నగారు. 50 ఎకరాల మాగాణీ, 50 ఎకరాల పసుపుతోట స్వంత వ్యవసాయం చేయిస్తూవుంటారు. ఐదు జతల ఎడ్లు, పది పదిహేను పశువులూ కొట్టాల్లోపడి నెమరవేస్తుంటాయి. ఆయన గుఱ్ఱంమీదఎక్కి స్వారీచేస్తూ బస్తీకి వెళ్ళుతుంటే పూర్వం రెడ్డిరాజులకాలంలో దండనాథులు గుర్తుకు వచ్చేవారు. ఆఖరికి రెవిన్యూ ఇన్‌స్పెక్టర్లు వచ్చినాసరే వాళ్లు మానాన్నగారికి నమస్కారం చేయవలసిందేగాని మా నాన్నగారు వాళ్ళకు తల వంచరు. మా అమ్మగారు సత్యకాలంమనిషి. చుట్టాలలో ఎవరిఅమ్మాయి గర్భిణీ అయినాసరే ఇంటికి తీసుకొచ్చి నాలుగునెలలు వుంచుకొని పురుడు పోయించి పంపించేది! విధీ విరామమూ లేకుండా రామాయణమూ, భారతమూ చదివించి వింటుండేది. ఆమెకు అవే అన్నపానీయాలు అనిఅంటే అతిశయోక్తికాదు. వచ్చేపోయే అతిథులతో మాయిల్లు నిండుగా వుండేది. మా అమ్మా నాన్నలకు కుమారుడైనా కుమార్తైనా నేనొక్కడినే. చిన్నతనంనుంచీ నేను కొండమీద కోతిని తెమ్మన్నా తెచ్చిపెట్టేవాళ్లు.

మానాన్నగారి తండ్రిపేరు అప్పయ్య. మా తల్లి తండ్రిపేరు వెంకయ్య. నాకు నామకరణం చేసేముందు ఎవరి తండ్రిపేరు వాళ్లు పెట్టాలని పట్టు బట్టారట. చివరకు ఇద్దరూ సమాధానపడి వెంకటప్పయ్య అని పేరుబెట్టారు. మా అమ్మ నన్ను ముద్దుగా వెంకూ అని పిలిచేది. మా నాన్నగారు అప్పడూ అనేవారు.

నా ఆరోమాసంలో అన్నప్రాసన చేశారట. ఆనాడు ఒక పీట మీద బంగారపుగొలుసు, రూపాయినాణెము, మామిడిపండు, కలము, పుస్తకము, హ్యాటు పెట్టి వుంచారట. మా అమ్మమాత్రం నేనా పుస్తకం పుచ్చుకుంటా నని ఆశతో నిలబడిందట. ఆ హ్యాటు పుచ్చుకుంటా నేమో నని మా నాన్నగారు చూస్తున్నారట. తీరా నేను పారాడుకుంటూ వెళ్ళి ఆరూపాయి బిళ్ళను గుప్పిడితో తీసుకొని నోట్లోకి పోనిచ్చానట. వెంటనే

అక్కడున్న మా వెంకటాద్రి మామయ్య అన్నాడట "అరిభడవా! వీడు డబ్బుకు డబ్బే తినేస్తాడేవ్" అని!

నాకు ఊహ తెలిసీ తెలియనప్పటినుంచి ఈనాటి వరకు కూడా ఆప్త మిత్రులైనవాళ్ళు ముగ్గురున్నారు. వీరిలో ముఖ్యుడు సుశీలారావు. అచ్చంగా బంగినపల్లి మామిడిపండులా వుంటాడు. అతనికళ్ళలో అవతలి మనిషిని బుట్టలో వేసుకోగల ఒకవిధమైన కాంతి నాకు గోచరమవుతుంటుంది. తెలివితేటల్లో అద్వితీయుడు. ఉన్నదానిని లేనట్లుగాను, లేని దానిని ఉన్నట్లుగాను నమ్మించగలడు. అతనంటే నాకు సహజమైన మమకారం వుండేది. మా వీధి మలుపు దగ్గర నిలబడి అతనొక ఈలవేస్తే అన్నం తినేతినేవాణ్ణిగూడ చెయికడుక్కొని గడపలు దాటుకుంటూపోయి అతన్ని కలిసేవాడిని. మావి ఒకటేహృదయంగల రెండు శరీరాలు.

సుశీలారావు తండ్రి మా వూళ్లో చెయితిరిగిన ప్రైవేటుదారు. చత్వారపు కళ్ళజోడు పెట్టుకొని సామాన్యులకు అర్థంకాని దస్తూరితో వ్రాయబడే దస్తావేజులను తదేకధ్యాసతో చదువుతుండేవాడు. ఆయన ఒక ధనవంతుణ్ణి బికారిగాను, ఒక నిర్భాగ్యుణ్ణి భాగ్యవంతునిగాను మార్చి వేయగల సమర్థుడు. ఎప్పుడూ మున్సబ్ కోర్టుతోనూ, జిల్లాకోర్టుతోను అతనికి లావాదేవీలుండేవి. ఆయనజీవితంలో ఒకసారిమాత్రం హైకోర్టుదాకా వెళ్లి కేసు గెల్చుకొని వచ్చాడు. ఆయనకు లోకంలో తెలియని సంగతులు లేవు. సాయంకాలంపూట రావిచెట్టుక్రింద కూర్చొని బిస్మార్కును గురించీ, కైజరునుగురించీ కాశీమజిలీ కథలలాంటి కథలను చెపుతుండేవాడు. ఆయనకు యెవరితోటీ విరోధం లేకపోయినా అందరూ ఆయనంటే హడలి చచ్చేవాళ్లు!

నా రెండవ మిత్రుడు కొండయ్య. పాకానికి వచ్చిన నేరేడు పండులాగ వుంటాడు. అసలా పళ్ళంటే అతనికి ఇష్టంగూడాను. అవి తినటం వల్లనో ఏమోగాని మాటలు స్పష్టంగా పలకలేడు. అక్షరాలు దిగమింగుతుంటాడు. అజానుబాహుడు; ఉక్కులాంటి శరీరం; నిప్పులాంటి మనిషి. అవతల వందమంది కత్తులు, కటార్లతో వచ్చినాసరే ఒంటరిగా ఒక బరిసె పుచ్చుకొని బయలుదేరి తరిమి కొట్టి రాగలవాడు. బుద్ధిమాత్రం మందకొడిగా వుండేది. అయినా అతను నమ్మినవాళ్ళకు ప్రాణమిచ్చే మనిషి.

నా మూడవమిత్రుడు మహాలింగం. ములక్కాడలాగ సన్నగా నిటారుగా వుంటాడు. కాఫీపొడరు రంగులో వుంటాడు. మితభాషి. పది మాటలు వింటే ఒక్కమాట మాట్లాడుతాడు. ఏమీ ఎరుగనట్లు కనపడుతాడు. ప్రమాదం వచ్చేటట్లుంటే చల్లగా తప్పుకోగలడు. అలంకార పురుషుడు. గుడ్డలు మాయనివ్వడు. చొక్కామీద కాకిరెట్ట పడితే గిలగిల్లాడుతాడు. డబ్బుదావాంగూడ బాగానే వున్నది. రావిచెట్టంత ఎత్తుగల మేడ కట్టాలని చిన్ననాటినుంచీ కలలు కంటుండేవాడు.

ఏళ్ళు వచ్చినకొద్దీ సుశీలారావు నిత్యాగ్నిహోత్రికుడు అయినాడు. కొండయ్య బహుపత్నీవ్రతస్తుడైనాడు. మహాలింగం రెండిటిలోనూ వేలు పెట్టినవాడేగాని లోతులు చూడలేదు. తామరాకుమీద నీటిబొట్టులాగ వర్తిస్తుంటాడు. నేను ప్రేక్షకుడుగా మాత్రం మిగిలిపోయాను. గిట్టనివాళ్ళు మా నలుగుర్నీ చతుష్టయం అని ఏడుపుగొట్టుతనంతో అనేవాళ్లు. మేమంతగా పట్టించుకోలేదు.

---

# 3. "అప్పెందుకు తెచ్చుకోవాలి?"

ఆరోయేడు రాగానే నన్ను మేళతాళాలతో తీసుకొనివెళ్ళి వీధి బడిలో దిగబెట్టి వచ్చారు. నేను అక్షరాలయినా నేర్చుకోకముందే రెండు సంవత్సరాలు చక్రం తిరిగినట్లు తిరిగి పోయినయ్. మున్సబుగారి కొడుకు నవటంవల్ల నేనంటే పంతులుగారికే భయముండేది గాని ఆయనంటే నాకేమీ భయముండేది కాదు. అసలు నాకు పుస్తకం పుచ్చుకోగానే నిద్రయినా వచ్చేది; తప్పితే తలనొప్పిఅయినా వచ్చేది. అందులోనూ లెక్కలంటేసరి చుక్కెదురు.

ఒకనాడు పంతులుగారు తీసివేతలు చెప్పుతున్నాడు. పైన నాలుగుంది, క్రింద ఆరుంది. నాలుగులో ఆరు పోదుగనుక ఒకటి అప్పుతెచ్చుకోమన్నాడు! నిక్షేపంలా వందెకరాల ఆసామికి కొడుకునైన నేను అప్పెందుకు తెచ్చుకోవాలో తెలియలేదు. పైగా ఒకటి అనగా పది అనుకోమంటాడు. ఒకటిని ఒకటి అనే అనుకోవాలిగాని ఒకటిని పదిఅనీ పాతికనీ ఎందుకనుకోవాలో బోధపడలేదు.

## 7

కొన్నాళ్లకు పంతులుగారు ఇంగ్లీషు చెప్పడ మారంభించారు. ఇంగ్లీషు ఓనమాలు దిద్దపెట్టమని అడిగితే ఏ బీ సీ డీలు దిద్దపెట్టాడు. అదేమి టంటే ఇంగ్లీషులో ఓనమా లుండవన్నాడు! ఇంగ్లీషులో ఓనమాలు లేనే లేవో, అవి ఆయనకు రానే రావోనని ఆరోజున అనుకున్నాను. ఇంగ్లీషులో వాక్యం వ్రాయవలసివస్తే నాకు ప్రాణాంతకంగా వుండేది. "పుస్తకం పెట్టెలోవున్నది" అనటానికి మాటలన్నిటికీ ఇంగ్లీషు తెలుసు కాని "Book the box in is" అని వ్రాసేవాడిని. పంతులుగారు అది తప్పు అన్నాడు. ఆయనమొహం నామొహం! నేను వ్రాసినదాంట్లో తప్పే మున్నది?

చిన్నతనంలోకల్లా మరపురాని విషయం తెల్లవారుజాముపండుగ. అది ఆశ్వయుజ మాసంలో పౌర్ణమివెళ్ళిన తదియనాడు వస్తుంది. ఆనాడు మా మిత్రచతుష్టయ మంటే వూళ్లో అందరికీ హడల్. ఒక ఏడు పండుగ రేపనంగా నేను వెళ్ళి ఎండుపల్లేరుకాయలు ఒక మానెడు ఏరుకొచ్చి భద్రంగా దాచివుంచాను. సుశీలారావు ఒక పెద్దతాళమూ, చెవీ తీసుకొచ్చాడు. మహాలింగం డబ్బాతో ఒకగ్యాలన్ కిరసనాయిలు తెచ్చాడు. కొండయ్య మాత్రం ఏమీ తేలేదు. పండుగనాటి నడిరేయి రెండుగంటలకు నిద్రలేచి మాసాధనపరికరాలతోసహా రావిచెట్టుకిందచేరాం. అక్కడనుంచి సుశీలారావు అజమాయిషీ క్రింద వూరినడుమ నున్న పెద్ద మఱ్ఱిచెట్టుకిందికి పోయాం. చీకటి దట్టంగా అలుముకొని వున్నది. ఆడపిల్లలు ఊగటంకోసం పదిపదిహేను ఉయ్యాలలు గతసాయంకాలమే ఆ చెట్టు కొమ్మలకు వేయబడి వున్నాయి. నేతెచ్చిన మానెడు పల్లేరుకాయలూ చెట్టుకింద దట్టంగా చల్లాం. ఇక బయలుదేరి మరునాటి ఉదయం పల్లేరుకాయలు నిర్వహించబోయే పాత్ర గురించీ, అవి గుచ్చుకుంటే జరుగబోయే నాట్యభంగిమలను గూర్చీ ఊహించుకుంటూ మా వీధిబడి పంతులుగారింటికి పోయాం.

ఇంట్లోనుంచి గండుపిల్లులు కొట్లాడుకున్నట్లు పంతులుగారియొక్క, ఆయన సతీమణియొక్క గురకలు ఉచ్ఛస్థాయిలో విన వస్తున్నాయి. మా సుశీలారావు తలుపు దగ్గరకు వెళ్ళి బయట గొళ్లెంపెట్టి తెచ్చిన తాళం కాస్తా దానికి వేశాడు. తాళం పడిందో లేదోనని బాగా లాగి చూచాడు

తాళం పడ్డట్లు బాగా నమ్మకం కుదిరినమీదట మరునాడు తలుపు తీయించు కోటానికి పంతులుగారు ఎంత తలక్రిందులు కావాలో తలుచుకుంటూ వస్తున్నాం. ఆయన ఇంటికి వేరే దొడ్డివాకిలి లేకపోవటం మా ప్రయత్నానికి దిగ్విజయం సమకూరుస్తుంది. బహుశా ఆయన బాదంచెట్టు ఎక్కి వీథిలో పోయేవాళ్ళను 'నాయనా నాయన' అని బతిమలాడి దగ్గరకు పిలిచి తాళం పగులగొట్టించుకుంటాడులెమ్మని మహాలింగం అన్నాడు.

సరే ననుకొని మావూరి పంచాయతీబోర్డు ప్రెసిడెంటుగారి దొడ్డి వాకిలిదగ్గరకు వచ్చాను. ఈ ప్రెసిడెంటుగారు గ్రామంమీద ఏడాదికి ఐదువేల రూపాయల ఐవేజు వస్తున్నా ఒక్క రోడ్డునైనా బాగుచేయించిన పాపాన పోలేదు. ఒక్కనుయ్యైనా పూడిక తీయించడు. బొజ్జ మాత్రం పున్నమినాటి చంద్రునిమోస్తరుగా ఊరుతోంది. సుశీలారావు ఇతనికి తగిన శాస్తి చేయదలచి మహాలింగాన్ని ప్రయోగించాడు. అతను హనుమంతునిమోస్తరుగా ఒక్క ఎగురు ఎగిరి దొడ్డిగోడను దాటి ప్రెసిడెంటుగారి దొడ్లోకి వెళ్ళి ఆ గ్యాలన్ కిరసనాయిలూ మంచినీటిబావిలో క్రుమ్మరించి మరుక్షణంలో వచ్చి మమ్మల్ని కలుసుకున్నాడు. సుశీలారావు మహాలింగాన్ని మెచ్చుకున్నాడు. మరునాటి ఉదయం ప్రెసిడెంటుగారు నలుగురు కూలివాళ్ళను పెట్టి బావిలోని నీరంతా తోడి పారపోయించటంవల్ల ఆ నలుగురికైనా కూలి గిట్టుబాటు అయిందనుకోండి.

ఇహ అక్కడనుంచి మేం నలుగురమూ ఎవరింటికి వాళ్ళం వెళ్ళి ఉదయం ఎనిమిది గంటలదాకా నిద్రపోయాం. మరునాడు ప్రతివాడూ మమ్మల్ని ఆడిపోయటం ఆరంభించారు. ఎంతమంది తిట్టారో చెప్పలేం. అలాంటివాళ్ళకు మా అందరిపక్షానా సుశీలారావే జవాబిచ్చాడు. "అయ్యో ! మేం నిద్రలేచిందే ఇప్పుడుగదండీ ! మేం ఎలా చేస్తాం ఈ పాడుపనులు. అయినా బావిలో కిరసనాయిలూ ఇంటికి తాళమూ వెయ్యటానికి మాకు ఎవరితోనూ విరోధం లేదే. తుంటరివెధవ లెవరో చేసి వుంటారు. నేను ఆరాతీసి బయటకు లాగుతాలెండి" అన్నాడు.



# 4. పరీక్షల నిధి!

మా వెంకటాద్రిమామయ్య మాకు దాపులోనున్న తిమ్మాపురం అనే వూళ్లో ఒక హైస్కూలు స్థాపించి ఆ కమిటీకి తానే అధ్యక్షుడుగా ఉంటున్నాడు. బోడిపాలానికి తిమ్మాపురం రైలుమీద ఎనిమిదణాల దూరం. కాని రైలుస్టేషను మాకు ఆమడ దూరంలో వున్నది. బస్సయితే ముప్పావలా దూరం. బస్సు దిగేచోటు మాకు ఆరుమైళ్లుంటుంది. నడిచిపోతే 30 మైళ్లు వుంటుంది. కాలువలూ డొంకలూ దాటుకుంటూ పోవాలి. తిమ్మాపురం పెద్ద గ్రామంగానూ, చిన్న బస్తీగానూ వుంటుంది. హైస్కూలు స్థాపించినప్పటినుంచి ఆవూరు కొత్త పరిగణనకు వచ్చింది. క్రమంగా ఒక సినిమాహాలు, రెండుమూడు కాఫీహోటళ్లు గూడ ఏర్పాటు అయినయ్. ఇపు డది ఖాయంగా బస్తీ అయింది.

మా మామయ్యగారిది సొంత హైస్కూలు కావడంవల్ల పరీక్షలతోటీ మార్కులతోటీ నిమిత్తం లేకుండా చదువు పూర్తిచేయవచ్చు ననే అభిప్రాయంతో నేనూ, నా మిత్రులమూ కలిసి తిమ్మాపురం వెళ్ళాము. ఫలానా బోడిపాలెం మున్సబుగారి తాలూకువాళ్ళమని తెలిసి హెడ్‌మాష్టరు మమ్మల్నే అడిగాడు ఏ క్లాసులో చేరుతారని. ఎద్దు నడిగి గంత కట్టినట్లుగా వున్నదీప్రశ్న. రెండోఫారంలో చేరుతామనిచెప్పాం. సరే క్లాసుకు పోయి కూర్చోమన్నాడాయన!

బోడిపాలెం వీధిబడిలో ఐదోతరగతి పూర్తి చేసిన మేము ఒకటోఫారం చదవకుండా రెండోఫారంలో చేరటం నామటుకునాకు రూపాయి వస్తువు పావలాకు కొన్నంత ఆనందం కలిగించింది. సుశీలారావు డబుల్ ప్రమోషన్ అయినట్లుగా సంతోషపడ్డాడు. మహాలింగానికీ వెంకటేశానికీగూడ బరువు తెలియని ఆనందం కలిగించి.

హైస్కూలులో ఓంప్రథంగా అడుగు పెట్టంగానే, హెడ్‌మాష్టరుగారి గదిముందు "ధర్మంచర – సత్యంవద" అని వ్రాసివున్నది. సుశీలారావు నడిగాను ఈ మాటల భావ మేమి టని. ధర్మం చెర పెట్టబడును, సత్యం వధింపబడును అని తకీమని అర్థంచెప్పాడు! చాల రోజుల వరకు ఆదే అర్థం నా మనసులో మెదలుతుంటేది.

హైస్కూల్లో చేరినకొత్తలో వేరుశెనక్కాయలతోటీ, ఐస్ ఫ్రూట్లుతోటీ, ముంతకింది పప్పుతోటీ సరిపెట్టుకొనేవాళ్ళం. మరమరాలు, సెనగపప్పు, నిమ్మకాయరసం, ఉల్లిముక్కలూ, పచ్చిమిరప తునకలూ కలిపిన మసాలాను ముంతకింది పప్పు అని అంటారు. దాన్ని తినని జన్మ ఒక జన్మ కాదని మేము నిర్ణయానికి వచ్చాం. నేను బడికైనా పోనిరోజు లున్నవిగాని ముంతకింది పప్పు తినని రోజులు లేనేలేవు. దాన్ని చూస్తుంటేనే నోరు పులిసేది. ఎప్పుడు ఒంటేలుబెల్లు కొడుతారా ఎప్పుడు దాన్ని నోట్లో వేసుకొని కారంపుడితే నీళ్ళు త్రాగుదామా అనిపించేది.

ఇట్లా ఒక ఏడాది గడిచేసరికి ఈతినుబండారాలన్నీ స్వల్పమైనవాళ్లు తినేటువంటివనీ, కాస్త ఆత్మగౌరవమూ అదీ ఉన్నవాళ్లు కాఫీక్లబ్బులో కుర్చీలమీద కూర్చొని తినవలసిందేగాని బటానీలూ మరమరాలూ తినటం మర్యాదకు భంగకర మని అనుకున్నాం. అందుచేత మూడోఫారంలో చేరినప్పటినుంచీ నేనూ సుశీలారావూ కలిసి కోమల విలాస్‌లో ఖాతా పెట్టాం. ఆ పాడు కాఫీ ఉప్పూ కారం లేకుండా, పులుపూతీపీ లేకుండా, ఒక వెధవ రుచితో వుంటుంది. పైగా నాలిక చుర్రుమనే వేడిగల కాఫీ తాగితేనే తాగినట్లుట. దీనికంటె ఆ ఐస్ ఫ్రూటూ, ముంతకిందిపప్పూ శతవిధాల నయంగా కనపడింది నా మనసుకు. సుశీలరావు కాదన్నాడు. కాఫీ తాగనివాణ్ణి మనిషిగా లెక్కకట్టరనీ, పల్లెటూరి ముఖం అని అంటారనీ చెప్పాడు. అందుచేత విధిలేక కాఫీ అలవాటు చేసుకున్నాను.

కొండయ్య మిరపకాయబజ్జీలను తప్ప మరి వేటినీ చస్తే ముట్టనని శపథం చేశాడు. మహాలింగం వేరుసెనక్కాయలను వదలిపెట్టలేదు. నేనూ సుశీలారావూ కాఫీ లేకుండా బతకటం దుర్లభమనే నిర్ణయానికి వచ్చాం. సుశీలారావు డబల్‌హాట్ డబల్‌స్ట్రాంగ్ కాఫీని గడగడ తాగటం ప్రాక్టీసుచేశాడు. కోమలవిలాస్ యజమాని నటేశమొదలియార్ మా ఆప్తకోటిలో చేరిపోయాడు. బడిలో జీతం కట్టటంకోసం తెచ్చిన డబ్బులు బడిదాకా చేరకపోవటం, ఏడాది చివరకు ఇంటికి కబురువెళ్ళటం జరుగుతుండేది.

తిమ్మాపురంలో చదివేకాలంలో మేము కొన్ని నాటకాలుగూడ వేశాం. వాటికి టిక్కెట్లూ అవీ లేవు గనుక వీధినాటకాలని చెప్పినా ఫరవాలేదు. సుశీలారావు డైరెక్టరుగానూ యాక్టరుగానూ వుండేవాడు. నాకు

ప్రేక్షకులముందు నిలబడటంఅంటే తగని భయం. కాళ్ళు వణకి, కళ్ళు తిరిగి కూలబడేవాణ్ణి. వందలాది జనంలో ఎవరిముఖం చూస్తూ మాట్లాడాలో తెలిసేదికాదు. అందుచేత నేను ప్రాంప్టరుగాను తెరలాగేపనిమీదను వుండేవాణ్ణి. ఒకసారి "శశిరేఖాపరిణయం" నాటకం వేశాం. కొండయ్య ఘటోత్కచునిపాత్ర అత్యద్భుతంగా నిర్వహించాడు. శశిరేఖ వేషంలో వున్న మహాలింగాన్ని అమాంతం ఎత్తుకొచ్చాడు. సుశీలారావు అభిమన్యుడిపాత్రలో వుండి శశిరేఖను వివాహమాడాడు. కొండయ్య ఈ నాటకంలో కలిగిన అనుభవాన్ని పెద్దవాడైనతరువాత చక్కగా వినియోగించుకొని గాంధర్వవివాహం చేసుకున్నాడు. సుశీలారావు ప్రేమించి పెళ్ళి చేసుకోవాలని వాదించట మారంభించి ఒక హైస్కూలు ఆడపిల్లతో ఉంగరాలు మార్చుకున్నాడు. నాకుమాత్రం ప్రజానీకంముందు నిలబడటానికి తెరలాగేపని మంచి తర్ఫీదు నిచ్చింది.

హైస్కూలులో ఉపాధ్యాయులనుంచి మేము నేర్చుకున్నవంటూ ఏమీ లేవు. కొంతమంది మేష్టర్లు మమ్మల్ని చూచివుండరుగూడా నేమో. మాకు ఆప్తమిత్రుడు మా డ్రిల్లుమేష్టరు ఒక్కడే.

హైస్కూలు చెడుగుడు టీములో మేము నలుగురం వుండేవాళ్ళం. సుశీలారావు నేర్పుగా పాయింటు తెచ్చేవాడు. ఇటు చూపించి అటు కొట్టి వచ్చేవాడు. మహాలింగం పొడుగాటి వాడవటంవల్ల నేలమీద అడ్డంగా పడి గీతను తాకేవాడు. కొండయ్య అవతలటీములో బాగా ఆడే వాళ్ళను పట్టుకొని కాలో చెయ్యో విరగ్గొట్టేవాడు. దాంతో అవతల టీము బలహీన మయ్యేది. నేనుమాత్రం పాయింటు తెచ్చేవాణ్ణికాను, ఇచ్చేవాణ్ణికాను. మేం చదువుతున్నంతకాలం జిల్లాలో మా టీము గెలుస్తూవుండేది.

ఇలాంటి మేము పరీక్షలు ఎలా ప్యాసవుతూ వచ్చామనేది సామాన్యులకు తోచే ప్రశ్న. వెంకటాద్రిమామయ్య కమిటీ అధ్యక్షుడవటంవల్ల మార్కులతో అవసరం లేకుండా పైతరగతిలోకి పంపబడేవాళ్ళం. స్కూలుఫైనలు మాకొక దుర్భేద్యమైన కోటగోడలాగ కనిపించింది. అయినా మేము నిరాశ చెందలేదు. ఔరంగజేబు గోల్కొండ కోటను జయించవలసివచ్చినపుడు కాపలావాడిని తృప్తిపరచి లోపల ప్రవేశించాడని పుస్తకాల్లో చదివాము. ఎలాగైతేనేమి గోల్కొండ జయించాడు...

మేము స్కూలు ఫైనలు పరీక్షలపుడు ఒక సహకారోద్యమం లేవదీశాము. పరీక్షలో నెగ్గటం సందేహాస్పదంగా వున్న ప్రతి విద్యార్థి దగ్గరనుంచీ తలా పందరూపాయలచొప్పున "పరీక్షలనిధి" వసూలుచేశాం. నేనుమాత్రం రెండువంద లిచ్చి అందరికీ మార్గదర్శకుడ నైనాను. మొత్తం మూడువేల రూపాయలు వసూ లయింది. పరీక్షలకు ఇతరవూళ్ళనుంచి పదిమంది వాచర్లు వచ్చారు. తలాఒక 300 రూపాయల చొప్పున ఎవరివంతు వాళ్ళకు న్యాయంగా ఇచ్చివేశాం. కోమల విలాస్‌లో ఏమిపుచ్చుకున్నా సరే ఉచితం అని చెప్పాం. పరీక్షహాలులో కూచొని చదువుకోటానికి తలా రెండు చక్కని నవలలూ కొనియిచ్చాం. ఇక పరీక్షలకు వచ్చేటపుడు ప్రతి విద్యార్థి బళ్ళోకి వస్తున్నట్లుగా టైమ్‌టేబిలుప్రకారం పుస్తకాలూ నోట్సులూ తీసికొని ఠీవిగా వచ్చి కూర్చొని పరీక్షలు వ్రాశాడు. పరీక్షల్లో మాహైస్కూలులో నూటికి 98 మంది ప్యాసైనారని అందరూ మా హెడ్‌మాష్టరును మెచ్చుకున్నారు. ఆ తప్పినవాళ్లు సుస్తీచేసి పరీక్షకు రాని రకమన్న మాట. ఏడాది పొడవునా దీపంబుడ్డిముందు కూర్చొని చదివినవాళ్లకూ మాకూ ఫలితంలోమాత్రం తేడాలేదు!

---

## 5. మంత్రోపదేశం.

ఒకనాటి సాయంకాలం వూరివెలుపల కాలవగట్టున మామిడిచెట్టు నీడలో నలుగురమూ కూర్చొనివున్నాం. కొండయ్య చెట్టెక్కి నాలుగు మామిడికాయలు తుంచుకొచ్చాడు. మహాలింగం జేబులోనుంచి మెల్లగా ఒక నూరిన ఉప్పుపొట్లం, ఒక ఎండుకారం పొట్లం తీసి బయటపెట్టాడు. సుశీలారావు చాకుతో మామిడికాయలను సన్నసన్నని ముక్కలుగా తరిగి నలుగురికీ అందేటట్లు మధ్యలో వుంచాడు. ఒకరినొకరు దిండుగాచేసుకుని నలుగురమూ నడుములు వాల్చి ఆ మామిడి ముక్కలను ఉప్పూకారంలో పొర్లించి నోట్లోజారవిడిచి చప్పరిస్తూ నములుతూ, రొస్తూ రొట్టలు వేస్తూ వున్నాం. నోటిలో నీళ్లు వూరుతునే వున్నాయి. పండ్లు పులుస్తూనే వున్నాయి. తినటం మాత్రం ఎవరూ ఆపలేదు. గాలి రంయి మని వస్తున్నది. సుశీలారావు కాలరు రెపరెప చెంపకు వచ్చికొట్టుకుంటున్నది. కొండయ్య

జొట్టు వచ్చి ముఖంమీద పడుతున్నది. నామనస్సు సముద్ర కెరటాలా లాగ తనలో తాను "డాషి"చ్చుకుంటున్నది.

సుశీలారావు ఉపక్రమించాడు. "అబ్బాయిలూ! మన తెలివివల్లనైతేనేం, మరొకళ్ల తెలివివల్లనైతేనేం మనం స్కూలుఫైనలు దాటివేశాం. ఇహ అందరిమాదిరిగా గొర్రెదాటు మోస్తరుగా ఏ కుంభకోణమో వెళ్లి ఎఫ్. ఏ. లో ప్రవేశించుతామంటారో లేక ఇంతటితో మంగళహారతి పాడుదామంటారో తెమల్చండి. ఐతే ఒక్కమాట. ఏ పనిచేసినా అందరం కలసికట్టుగా వుండాలిగాని ఒకడు చదవటం, మరొకడు నౌకరీ అఘోరించటం, ఇంకొకడు కుండల్లోకి గుర్రాలు తోలుతూ ఇంటిపట్టున కూచోటం— ఇలా చెట్టుకొకపిట్ట గావటంమాత్రం నాకు సుతరామూ ఇష్టంలేదు. మునిగినా తేలినా నలుగురమూ ఒక్కచోటనే తడవాలి. ఇది నాఉద్దేశం. ఇహ మీరు ఏం చెప్పదలచారో చెప్పండి" అని వూరుకున్నాడు.

కాసేపు నిశ్శబ్దం. తరువాత నువ్వు చెప్పమంటే నువ్వు చెప్పమనుకొని ఆఖరుకు కొండయ్య అంగుకున్నాడు; "అరేయ్! మనకు వంటపట్టే లక్షణాలుగనుక ఏడిస్తే చదివినా ఫలంపాటు. ఈ వెధవస్కూలుఫైనలుకే పితృదేవతలు దిగివచ్చారు. డబ్బు మనదికాదనుకున్నాం గనుక ఈతడవకు గట్టున పడ్డాం. వ్యవహారం కామెడీగా అంతమయింది. ఇదేగనుక ట్రాజడీ అయినట్లయితే తట్టా బుట్టా బుజానవేసుకొని కొంపకు చేరుకోవలసి వచ్చేది. ఏమోమరి. మీ ఉద్దేశం ఎలావున్నా నేనుమటుకు చదవదలచలేదు. ఆతరువాత మీఇష్టం" అన్నాడు. మహాలింగం 'తథాస్తు' అన్నాడు లేచికూచుని. నేను డిటో అన్నాను. అదీగాక ఇద్దరు చెప్పిన మాటను కాదనటం గూడా భావ్యం కాదనుకున్నాను.

సుశీలా రావుకు మనసులో చదవాలనే వుంది. ఒకవేళ చదివితే పరమపద సోపానపటంలో నిచ్చెన లందుకొని పాకిపోయినట్లు పరీక్షలు అల్లుకుంటూ ప్యాసై పోగలడు. కాని చదివి బావుకు తినే దేమిటి డబ్బు దండగ తప్ప! మహాత్ములంతా డిగ్రీలవల్లనే గొప్ప వాళ్లయినారా? కామరాజ నాడార్ గారి డిగ్రీ ఏమిటి? రవీంద్రనాథ టాగూరు డిగ్రీ ఏమిటి? సరుకు అనేది మనిషిలో వుండాలిగాని కాగితంముక్కలో ఏముంటుంది నల్ల గీతలు తప్ప! అదీగాక మేము ముగ్గురం మిత్రులమూ చదవం అని మూతి ముడుచుకొని కూచుంటే సుశీలారావు ఒక్కడే బుజా లెగరేసుకుంటూ

కాలేజీలో చేరితేమటుకు వాడికి ఒక్క క్షణం తోస్తుందీ? ఒడ్డున పడ్డ చేప లాగ గిలగిల కొట్టుకోదూ! ఏమోమరి. సుశీలారావు గూడ చదువుకు సామాలు దిద్ది మామిత్రమండలికి నాయకత్వం వహించటానికి సిద్ధమైనాడు.

ఇహ చదవకపోతే ఏంచెయ్యాలి? మళ్లీ మావూరు పోయి ఎడ్లను ఛోఛో అంటే పరువు కాస్తా దిబ్బ కొట్టుకుపోదూ? ఆరునెలలు సాము చేసి ముసలిముండను చావబాదినట్లు ఇంతచదువూ చదివింది పగ్గాలు పుచ్చు కోటానికా? బొందిలో ఊపిరుండగా అంత అవివేకపు పని చెయ్యకూడ దని నలుగురమూ ఏకగ్రీవంగా నిర్ణయించుకున్నాం.

మంత్రులకూ ప్లీడర్లకూ వుండవలసిన బుద్ధి మా సుశీలారావుకున్నది. వాడుగనుక పై చదువు చదివితే ఏ జడ్జియో, కలెక్టరో అయ్యేవాడు. అతను నాభవిష్యత్కార్యక్రమాన్ని ముక్తసరిగా ముందుపెట్టాడు. "ఇదుగో వెంకూ! నీకు తినటానికీ మరొకరికి పెట్టటానికీ చాలినంత వున్నది. ఇంకా రెండు తరాలవరకు నీ ఆస్తి పుష్కలంగా సరిపోతుంది. అలాంటివాడవు అందరు మనుషుల్లాగ చిన్నినా బొజ్జకు శ్రీరామ రక్ష అన్నట్లు తిని తిరగడమే వృత్తిగా పెట్టుకోక ప్రజలకు సేవ చేయాలని ఎందు కనుకోకూడదూ? పదిమందీ నీపేరు గుర్తుంచుకోనేటట్లు ఎందుకు యత్నించకూడదూ? ఓ అంటే నా రానివాళ్ళుగూడ అధికారంలో ప్రవేశించి స్వారి చేస్తున్నారుగదా! మనంమటుకు ప్రజల దగ్గరికి ఎందుకు పోగూడదూ? ఇది బుద్ధిమంతులు చేసే పనేగాని ఇదేమీ దుష్టకార్యం కాదు. అధికారం గనుక లభిస్తే నువ్వు మన వూళ్లో రోడ్లు వేయించవచ్చు. చెరువులు త్రవ్వించవచ్చు. వంతెనలు కట్టించవచ్చు. ఆసుపత్రులు లేవదీయవచ్చు. ఫలానా పెద్దమనిషి చేయించాడని ప్రజలు అనుకుంటారు. కనుక మేము ముగ్గురమూ లక్ష్మణ భరత శత్రు ఘ్నులలాగ నీకు చేతోడు వాదోడుగా వుంటాము. నీవుమాత్రం ప్రజా సేవచెయ్యటం కోసం నిర్ణయం చేసుకో"అన్నాడు.

అతని సలహా నా మనసుకు నచ్చింది. ధనసంపాదన కోసం ఎలాగూ తంటాలు పడ నవసరం లేదు గనుక పొరుగువాళ్లకు ఇంత ఉప కారం కలిగించటం కోసం నేను పాటుపడటమే సమంజసం అని నాకు తోచింది. నలుగురమూ లేచి నిలబడి గుడ్డలు దులుపుకొని ఇంటి ముఖం పట్టాం.

ఏమనుకున్నాడో ఏమోగాని సుశీలారావు తిమ్మాపురం నుంచి అడపా తడపా పత్రికలకు వార్తలు పంపుతూ 'పత్రికావిలేఖరి'అని చెక్క కొట్టించుకున్నాడు వాకిలిముందు. మహాలింగం ఒకమేడమీద జానెడు గదిని అద్దెకు తీసుకొని 'రాత్రింబవళ్లు ఫొటోలు తీయబడును' అని బోర్డు వేలాడగట్టాడు. కొండయ్య జరాసంధ వ్యాయామమండలి అనే దాన్ని స్థాపించి ఒక తాలింఖానా పెట్టి కుట్రవాళ్లను కండలు తిరిగేటట్లు తయారు చేస్తున్నాడు. వాళ్లు అప్పుడప్పుడు తమకంటె బలహీనమైన వాళ్లమీద చెయి చేసుకొని బలం పరీక్షించుకుంటూ వుంటారు. నేను మాత్రం 'తిమ్మాపురం సినిమా ప్రేక్షకుల సంఘం' అనేదాన్ని స్థాపించి అధ్యక్షుడుగా వుంటున్నాను.దాని కార్యదర్శి సుశీలారావే.

ఈవిధంగా ఒక ఏడెనిమిది నెలలపాటు మా కార్యకలాపాలు నడుపుకుంటూ వచ్చాం.

---

# 6. "గూడుపుఠాణీ" శతదినోత్సవం

ఊళ్లోకి "గూడుపుఠాణీ" సినిమా వచ్చింది. జనం వేలంవెర్రిగా వెళ్లి చూస్తున్నారు. రోజూ మ్యాట్నీ వేస్తున్నారు. మొదటి 10 రోజులూ రోజుకు నాలుగాటలు గూడ వేశారు. పల్లెటూళ్లనుంచి జనం బండికట్టుకొని గూడ వచ్చి చూసి పోతున్నారు. బొందిలో ప్రాణం వున్నంతవరకు సినిమాలు చూడనని ఒట్టుపెట్టుకున్నవాళ్లుగూడ వచ్చి చూశారట. అందులో కథ ఏమీ లేదు. మాటలకంటె పాటలూ, పాటలకంటె డాన్సులూ హృదయాలను లాక్కుంటున్నాయి. డాన్సుచేసిన ఆవిడపేరు విలాసిని. కథానాయకుడుగా యస్టీ రంగారావు అమోఘంగా నటించాడు. శంభులింగం కడుపుబ్బ నవ్వించాడు. తెరవెనుక పాటలు పర్ణశాల వారివి.

"గూడుపుఠాణీ" 100 రోజులు కష్టపడి ఆడింది. చిత్రం శతదినోత్సవం చేసుకో దలచిందని సుశీలారావు ముందుగా ఆఘ్రాణించాడు. సినిమా ప్రేక్షకసంఘం తరఫున అతను పైవాళ్లకు రాసి ముందు ఏర్పాట్లు చేశాడు. ఉత్సవం ముందు మేము జరిపేటట్లు, ఆ తరువాత డిస్ట్రిబ్యూటర్లు

మా ప్రత్యేక సంఘానికి 600 రూపాయల నిధి ఇచ్చేటట్లు ఒప్పందం కుదిరింది. మామటుకు మాకు రూపాయలసంచి దొరకినంత సంతోషం కలిగింది. క్షణం తీరిక లేకుండా శతదినోత్సవంకోసం భారీఎత్తున ఏర్పాట్లు ఆరంభించాం.

శత దినోత్సవ సభకు సుశీలారావు ప్రోద్బలంమీద నేను అధ్యక్షుడుగా వుండటానికి ఒప్పుకోక తప్పింది కాదు. నేనంతకుముందు పదిమంది ముందు నిలబడి మాట్లాడినవాణ్ణి కాను. అమాంతం ఒక్కసారిగా వేలాది ప్రజలయెదుట నిలబడటం నా కొక అగ్నిపరీక్షగా పరిణమించింది. పల్లెటూరిమనిషి ఇంజక్షన్ అంటే ఎలా కంగారు పడతాడో నేనంత గాబరా పడ్డాను. ఈ పని మరెవ్వరికైనా వప్పగించమని సుశీలారావును ప్రాధేయపడ్డాను. అతను నా మొర ఆలకించలేదు. సుగ్రీవాజ్ఞలాగ నన్ను దబాయించి ఒప్పించాడు. ఆ సమయానికి ఏ జ్వరమైనా వస్తే బాగుండు ననిపించింది. కాని లాభం లేకపోయింది. సుశీలారావు ఒక పావుతావు కాగితంమీద ఒకప్రక్కన నాలుగు వాక్యాలు చిన్నచిన్నవి వ్రాసి యిచ్చాడు. వాటిని నోటికి వచ్చేటట్లు చదివి అధ్యక్షోపన్యాసం క్రింద చెప్పమన్నాడు. ఆ సభలో ప్రజలందరివంకా చూస్తే గుండె దడ పుడుతుందనీ, అలా చేయక, వేదిక ముందరనే మన కొండయ్యా మహాలింగం కూర్చుంటారనీ, వారిద్దరి ముఖాలు చూస్తూ - సభలో వారు తప్ప మరెవ్వరూ లేరని అనుకొని మాట్లాడివేయమనీ బోధించాడు.

శతదినోత్సవం నాటి మధ్యాహ్నం యన్టి రంగారావు, విలాసిని, శంభులింగంగార్లు కుంభకోణంనుంచి చిన్నకారు వేసుకొని మా వూరు విచ్చేశారు. నేనూ సుశీలారావు ఇత్యాదివాళ్ళం ఎదురువెళ్ళి పూలమాలలతో సత్కరించి తీసుకొని వచ్చాం. సుశీలారావు నన్ను వాళ్ళకు పరిచయం చేశాడు. వాళ్లతో వ్యవహరిస్తుంటే నామటుకు నాకు భూమికి అడుగు ఎత్తున నడుస్తున్నట్లుగా వుంది. విలాసిని ముఖం సినిమాలో వున్నంత అందంగా లేదు. మిగతా ఇద్దరి ముఖాలలోనూ తెచ్చుకున్న అందం చాలా వున్నది. వాళ్ళు కారు దిగంగానే కొండయ్య ద్రాక్షరసం అందించాడు. శంభులింగం మాత్రం జంకు లేకుండా మరొక గ్లాసు తెప్పించమన్నాడు. మహాలింగం గబగబా వాళ్ళను ఫొటోలో దింపి వేశాడు. ఒక పాతిక ముప్పైమంది స్కూలుఫైనల్ విద్యార్థులు

నోటు బుక్కులు పుచ్చుకొని ఆటోగ్రాఫుల కోసం ఎగబడ్డారు. సుశీలారావు వాళ్లను దగ్గరకు పిలిచి సాయంకాలం మూడు గంటలకు రమ్మని సముదాయించి పంపివేశాడు. ఊళ్లో పురప్రముఖుల ఇళ్లలో వున్న బూరుగుదూది పరుపులను ప్రత్యేకంగా తెప్పించి అతిథులకు వప్పగించాం. అతిథులు విశ్రమించారు.

ఆరోజుకి హైస్కూలు గూడ మూసివేశారు. సినిమా హాలుకు నాలుగువైపులా ఫర్లాంగు మేర రంగుకాగితాలతో అలంకరించాం. రెండు మూడు వేలమంది పట్టే హైస్కూలు గ్రౌండ్స్‌లో పెద్ద వేదిక తయారు చేయించి బహిరంగసభ ఏర్పాటు చేశాం. సాయంకాలం ఐదుగంటలకు వూళ్లోవున్న రిక్షాలూ, గుఱ్ఱపుబళ్లు, ఎద్దుబళ్లూ అన్నీ హైస్కూలు ఆటస్థలానికే ఉరవడిగా పరువులు తీస్తున్నాయి. వెళ్లేబళ్లేగాని వచ్చే బళ్లు లేవు. ముసలీముతకా, పిన్నాపెద్దా ఇత్యాది యావన్మంది చేతులూపుకుంటూ వస్తున్నారు. జనం నడవటంకంటె ఎక్కువవేగంతోనూ పరుగెత్తటం కంటె తక్కువవేగంతోనూ "దొర్లుడు నడుక"తో పోతున్నారు ఊరిలోని పెద్దపెద్ద వాళ్లంతా అరగంట ముందుగా వచ్చి కుర్చీలను భర్తీ చేశారు. తాసిల్దారు, సర్కిల్ ఇన్‌స్పెక్టరు, పోస్టుమాష్టరు, స్టేషన్‌మాస్టరు, హైస్కూలు హెడ్‌మాష్టరు మొదలైన ప్రముఖులంతా ముస్తాబుచేసుకొని ముందుగానే వచ్చారు. వేదికమీద నుంచి లతామంగేష్కర్ రికార్డులు గగ్గోలుగా వినబడుతున్నాయి. అయిదున్నరకల్లా నటీనటులతో కలసి వేదికమీదకు వెళ్లాను. అందరూ గల్లంతుగా చప్పట్లు చరిచారు.

మొదట సినిమాహాలు యజమాని వచ్చి స్వాగత వాక్యాలు పలికాడు. అతని జన్మ కిదే శివరాత్రి అయివుంటుంది! హంసపాదులూ కొట్టివేతలూ చాలా వున్నాయి మాటల్లో. అతనికంటె నేను బాగానే మాట్లాడగలనని ధైర్యం చిక్కబట్టుకుంటున్నాను. అతని ఉపన్యాసం పూర్తికాకముందే సభికులలోనుంచి ఈలలు వినబడుతున్నాయి. ఇక దిగు అని వాటి అర్థం అయివుంటుంది. తరువాత సుశీలారావు వచ్చి నాలుగైదు నిముషాలు మాట్లాడుతూ సభికులకు నటీనటులను, నన్నూ పరిచయం చేశాడు. ప్రతి వాక్యంలోనూ హాశ్యం మిళితమై వుండటంవలన సభికులు చేతులు కందేటట్లు హర్షధ్వానాలు చేశారు. విలాసిని, యస్వీ రంగారావు గార్లు రాధాకృష్ణుల వలెను, రతీ మన్మథులవలెను మనోహరముగా నటించి

చిత్రాన్ని విజయవంతం చేశారని అతనన్నపుడు నటీనటులుగూడ చప్పట్లు కొట్టారు. నన్ను పరిచయం చేస్తూ ప్రజాసేవలో నూతనంగా అడుగుపెట్టిన యువకుడనీ, వయస్సు చిన్నదైనా బుద్ధి పెద్దదనీ అన్నాడు.

తర్వాత నటీనటులు ముచ్చటించారు. తాను చదివిన హైస్కూలులోనే తనకు సన్మానం జరగటం తల్లి పుట్టిల్లు మేనమామ దగ్గర పొగిడిన ట్లయిందని శంభులింగం అన్నాడు. విలాసిని కులుకుతూ మైకుదగ్గరకు వచ్చి అరవ తెలుగులో మాట్లాడుతూ "నాకు మీకందరికీ రొంబ కృతజ్ఞురాలను" అని చెప్పి కూచుంది. సభలో అంతా గొల్లుమన్నారు. యస్వీ రంగారావు వచ్చి ఆమె అన్న మాటలోని పొరబాటును సవరిస్తూ ఆమె చాలా కృతజ్ఞురాలని వివరించాడు. "గూడుపుఠానీ" చేసిన మేమంతా ఇక్కడే వున్నామనీ, మమ్మల్ని పిలిపించినందుకు అందరికీ వందనాలనీ అన్నాడు.

ఆఖరుకు నేను నిలబడి ఇట్లా ఉపన్యసించాను. "సోదరీ సోదరులారా! ఇక్కడ ఇంతమంది కళమీద అభిమానం గలవారు సమావేశం కావటం ఆనందకరమైన విషయం. మన గ్రామంలో ఇంతమంది కళావంతులుండటం చాల గర్వించదగ్గ సంగతి. (సభలో హర్ష చప్పట్లు) "గూడుపుఠానీ" సినిమా 100 రోజులు ఆడిందంటే దాని ప్రభావం ఎన్నివేలమంది ప్రజలమీద పడివుంటుందో మనం గమనించాలి. ఈ సభకు ఆహ్వానించగానే వారికి షూటింగు వగైరా ఎన్ని పనులున్నప్పటికీ సందుచేసుకొని మన గ్రామం దయచేసినటువంటి యస్వీ రంగారావు, విలాసిని, శంభులింగం గార్లకు మీ అందరితరఫునా కృతజ్ఞతాపూర్వక వందన సహస్రములర్పిస్తున్నాను.

సభ జయప్రదంగా ముగిసింది. వేదికమీద రాళ్ళు విసరాలని ఎవరికీ కుతూహలం కలుగలేదు. శరీరానికి ఎలాంటి మొప్పమూ లేకుండా విలాసినీదేవి వగైరాలు రిక్షాన కారులో కుంభకోణం దోవ పట్టారు. నా ఉపన్యాసం నాలుగు వాక్యాలే గనుక చెడగొట్టకుండా అనగలిగాను.

ఈ శతదినోత్సవంవల్ల కలిగిన ప్రయోజనం కాస్త వివరించవలసి వున్నది. గ్రామంలోని పెద్ద పెద్ద ఆఫీసర్లంతా కిందకుర్చీలలో కూచొని ఆలకిస్తుంటే నేను వేదిక ఎక్కి అధ్యక్షపీఠం అలంకరించే అవకాశం

కలిగింది. ఇందువల్ల నన్ను అనేకులు ఎరుగుండ గలిగారు. దోవన పోతుంటే సబ్ ఇన్‌స్పెక్టరు కనిపించి "గుడ్‌మార్నింగ్" అన్నాడు! రైలు స్టేషన్‌లో టిక్కెట్లుకొందామని వెళితే స్టేషన్ మాష్టరు తన గదిలోకి తీసికెళ్లి కాఫీ తెప్పించి మర్యాద చేశాడు! ఏదో పనిమీద తాసిల్‌దార్‌గారి దగ్గరకుపోతే తాను లేచి నిలబడి నాకు కుర్చీ చూపించి, నేను కూర్చున్న తర్వాత తాను కూర్చున్నాడు! ఈ విధంగా వూళ్ళో మనకు స్థానబలం ఏర్పడడం ఆరంభమయింది. వెధవ "గూడుపుఠానీ" శతదినోత్సవంలో ఇంత మహిమ వుంటుందని నేను కలలోనైనా అనుకోలేదు!

---

# 7. హితోపదేశం!

నన్ను నిలుచున్న పాళంగా పిలుచుకొనిరమ్మని ఒకరోజున మా అమ్మగారు మనిషిని పంపింది. ఆ వచ్చినవాడు నన్ను చిన్నప్పటినుంచీ ఎత్తుకు తిరిగిన గోపయ్య. నన్నుపిలిపించటంలో ఆంతర్య మేమిటని గోపయ్యను అడిగి తెలుసుకొన్నాను. నేను పరీక్ష అయినతర్వాత రికామీగా తిమ్మాపురంలో వుంటున్నానని మా అమ్మగారికి తెలిసింది. ఈ మధ్య సినిమా ప్రేక్షకులసంఘం తరఫున సినిమావాళ్ళను పిలిపించి ఉత్సవాలు చేస్తున్నానని గూడ విన్నదట. నేనేదో సావాసాలవల్ల చెడిపోతున్నాననుకొని కొంత దోవలో పెడుదామని నన్ను రమ్మని వుంటుందని చూచాయగా గోపయ్య చెప్పాడు.

సమయానికి సుశీలారావు వూళ్ళో లేకపోయినాడు. నాకు ఏమీ పాలుపోలేదు. సరే. అమ్మగారిని చూచి వచ్చినట్లూ అవుతుంది; ఆమెమాట మీద గౌరవం వుంచినట్లూ అవుతుం దనుకొని గోపయ్యతో కలసి బోడిపాలెం బయలుదేరి వెళ్ళాను.

చాలాకాలం తర్వాత మావూరు వెళ్ళటంవల్లనైతేనేమి, మా అమ్మగారికి నేను ఏకైకపుత్రుడ నవటంవల్లనైతేనేమి నాకు అన్ని మర్యాదలూ యథావిధిగాను, కొంత అధికంగాను గూడ జరిగాయి. ఆమె నాకు స్వయంగా వళ్ళు రుద్దుతూ ఉడుకునీటితో తలంటిపోసింది. గుత్తివంకాయ

కూరతోనూ, మీగడ పెరుగుతోనూ ఆప్యాయంగా భోజనం పెట్టింది. చెయి కడుక్కొని మూతి తుడుచుకుంటూ వచ్చి పడకకుర్చీలో కూర్చున్నాను. ఆమె నాకు దగ్గరగా పీట వేసుకొని కూచున్నది.

“నాయనా! ఒంట్లో సులువుగావున్నదా? భోజనమూ అదీ బస్తీలో సరిగా అమరుతున్నదా? మరీ మనవూరు రావటం మానివేశావేం? తిమ్మాపురంలో ఏమైనా పనులున్నాయా? నిన్ను చూడాలని కళ్లు కాయలు కాస్తున్నాయి. అందుకని ఒకసారి వచ్చిపొమ్మని కబురుచేశాను” అన్నది.

నేనేదో తప్పుచేసినవాడిలాగ గుటకలు మింగుతూ కూచున్నాను. పశ్చాత్తాపంవల్ల వచ్చే నీరు కంట్లో చేరకుండా నిగ్రహించుకుంటున్నాను. ఇది ఇలావుండగా నాకు ఆమె చేసిన మర్యాదలవల్లనైతేనేమి, నన్ను పడకకుర్చీలో కూచోపెట్టి తాను పీటమీద కూచోటంవల్లనైతేనేమి ఆమె నామీద నైతికంగా “అధికారం” చెలాయిస్తున్నదని తోచింది. ఏమి జవాబు చెప్పి ఆమె మనస్సు వికలం చేస్తానోనని నాకు భయం పుట్టింది. అయినా నన్ను ప్రేమించే తల్లేకాబట్టి మాట పొరబాటు మాట్లాడినా ప్రమాదం వుండదులెమ్మని ఇలా చెప్పాను— “అమ్మా! నా ఆరోగ్యానికి ఎలాంటిలోపమూ లేదు. ఏదో స్నేహితులంతా ఉండమంటే తిమ్మాపురంలోనే వుంటున్నాను. మా మిత్రులు ఏవో సమాజాలూ, సమితులూ స్థాపించి అపుడపుడు సభలూ, సమావేశాలూ జరుపుతున్నారు. వాటిద్వారా ప్రజలకు సేవచేయాలని మా అభిమతం. అందుచేత ఆపనులు చూచుకుంటూ నేనక్కడే ఉండిపోయాను. అంతకంటె మరేంలేదు.” అని జంకుతూ జంకుతూ చెప్పాను.

ఆమె నా మాటలు విని తల వంచి దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లు కనిపించింది. ఒక క్షణం ఆగి నావైపుకు మళ్ళి “నాయనా! నేనేమీ చదువుకున్నదాన్ని కాను. నాకీ సమాజాలనుగురించీ సభలనుగురించీ అంతగా తెలియదు. అయినా నీ క్షేమం కోరేదాన్నిగనుక నాలుగుమాటలు నీచెవున వేస్తాను... నీవు పైచదువుకు పోలేదని నేను ఏమీ విచారించటంలేదు. ఎందుకంటే మనకు భూమి పుష్కలంగావున్నది. ఎట్లా లేదన్నా ఏటా పాతికవేల ఆదాయం వస్తుంది. తిండికీ గుడ్డకూ ఇబ్బందిలేదు. మనఇల్లు నిలుపుకొని పదిమంది ఇళ్ళు నిలుపవచ్చు. అందుచేత ప్రజలకు సేవచేస్తావని నీవు తలపెట్టటం నాకు అత్యంత ఆనందకరమైన విషయం.

కాని నాయనా ! నీవు ప్రజాసేవకోసం సమాజాలూ సమితులూ స్థాపించాననని చెప్పావు. వాటితరఫున సభలు జరుపుతున్నాననికూడ చెప్పావు. ఆ విషయమే నాకర్థం కావటంలేదు. సభలు జరపడంవల్ల ప్రజలలో పలుకుబడి రావచ్చు. నిన్ను అందరూ కీర్తించవచ్చు. పదిమందికి నీవు ఎరుక కావచ్చు. అంతేకాని ప్రజలకు అందువల్ల సేవ ఎట్లా జరుగుతుందో నాకు తెలియటంలేదు, ఏప్రజలకు ఇందువల్ల వాళ్ళ బాధలనుంచి రక్షణ కలుగుతుందో అర్థమవటంలేదు.'' అని సున్నితంగాను సరళంగాను నన్ను ప్రశ్నించింది.

ఆమె వేసిన ప్రశ్న నాకూ ఒకప్రశ్నగానే తయారయింది. సమయానికి సుశీలారావు లేకపోయాడు గదా అని నాలిక కొరుక్కున్నాను. కించిత్తు బాధపడ్డాను. నాకు తోచిన జవాబు చెప్పటం నాధర్మం అనుకొని ధైర్యంచేసి ఇలా అన్నాను.

"అమ్మా ! నాకుకూడ నీవు అడిగిన ప్రశ్నకు సరియైన సమాధానం తోచడంలేదు. నా స్నేహితులందరూ కలిసి ఏవో ప్రయత్నాలు చేస్తున్నారు గనుక నేను వారికి చేదోడువాదోడుగా వుంటున్నాను. బహుశా ఈవిధంగా వేరువేరు సభలద్వారా ప్రజలలో పలుకుబడి గనుక సంపాదిస్తే తర్వాత సులభంగా పంచాయతీబోర్డు లాంటి వాటిల్లోకి ఎన్నుకోబడి అధికారంలోకి రావచ్చునని మా మిత్రుల ఉద్దేశం అయివుంటుంది. అలా అధికారంలోకి వచ్చిన తర్వాత ప్రజలకు ఉపయోగకరమైన అనేకపనులు చేయవచ్చునని వాళ్లభావం కావచ్చు'' అని చెప్పివేశాను.

మా అమ్మగారు మళ్ళీ కొద్దిక్షణాలు ఆలోచనలోపడింది. తరువాత నా వంకకు తిరిగి "వెంకూ! నీ ఆలోచనయే బహుశా నీ స్నేహితుల ఆలోచనకూడ ఆయివుంటుంది. ఇదంతా పంచాయతీబోర్డులో ప్రవేశించటానికే అనువుగావున్నది. ఆ విధంగా అధికారంలోకి పోవచ్చునని నేనుకూడా అనుకుంటున్నాను... కాని నాయనా! అధికారంలోకి పోవటం అనేది చాలా సంకటాలకు కారణ మవుతుంది. ఒకసారి అధికారంలోకి పోయినవాడు అపదవిని నిలుపుకోటంకోసమే తనశక్తియుక్తులను వ్యయం చేస్తాడు. అంతేగాని ప్రజాసేవ చేయ గలుగుతాడని నేననుకోను. ఒకవేళ ప్రజాసేవ చేయాలనేకోరిక వున్నప్పటికీ అతనికి అందుకు తగు సమయంగాని, అవకా

శంగాని లభించదు. అదీగాక అధికారం సజ్జనులనుగూడ కల్మషపరుస్తుం దని మా నాన్నగారు అంటుండేవారు......"

కొద్దిసేపు ఆగి మళ్ళీ ప్రశ్నించింది. "వెంకూ! ఇంతకూ నీ ఆశయం అధికారంలోకి పోవటమా లేక ప్రజాసేవచేయుటమాశ్ నిశ్చితంగా చెప్పు తెలుసుకుంటాను" అని అడిగింది.

నామీద పిడుగుపడ్డంతపని అయింది. ప్రశ్నించటం అయిపోయిం దేమో ననుకుంటే ఇంతకుముందు అడిగినదానికంటె క్లిష్టమైన సమస్యనే నామీద ప్రయోగించింది. అసలు రహస్యం మేమంటే- ఏదో సుశీలారావు నడవమంటే నడుస్తున్నానుగాని అధికారంగురించీ ప్రజాసేవ గురించీ నా కంతగా తెలియదు. ఇవిరెండూ వేర్వేరు విషయాలని అసలు నేననుకోవటం లేదు. అధికారం గలవారే ప్రజాసేవకులనీ, ప్రజాసేవకులే అధికారంలో వున్నారనీ నా అంచెనా. కాని మా అమ్మగారు వీరిద్దరినీ విడదీసి మాట్లా డటంవల్ల నాకేమి చెప్పటానికీ తోచలేదు.

నాకేమీ తెలియదనటంగూడ శ్రేయస్కరంగా కన్పించలేదు. ఏదో ఒకజవాబు చెప్పటమే ఉత్తమం అనిపించింది. ఐనా ఏం జవాబు చెప్పాలిశ్... కొస్త ఆలోచించిచూస్తే "అధికారం" అనేమాటకంటె "ప్రజాసేవ" అనేమాటే బాగున్నట్లు తోచింది. అందులోవున్న "కారం" నా మనస్సుకు ఎట్టగా కొట్టవచ్చినట్లు కనిపించింది! ఇందులోవున్న "సేవ" అనేమాట నాకేగాక మా అమ్మవంటి సజ్జనురాలికిగూడ నచ్చవచ్చు. అందుచేత ప్రజాసేవ చేయటమే నా పరమావధిగా ఆమెకు మనవి చేశాను.

ఆమె నాసమాధానానికి చాల ఆనందించినట్లుగా కన్పించింది. నుదుటిమీది చెమటను చీరచెరగుతో తుడుచుకొని, పీటను నాకు అభిము ఖంగా తిప్పి సావకాశంగా కూచొని మళ్ళీ ఉపక్రమించింది. "వెంకూ! నీవు చెప్పినమాట నాకు ముచ్చటగా వున్నది. నీవు బాగా ముందు వెను కలు ఆలోచించే ఆమాట అన్నట్లు నాకు అనిపించింది. చాల సంతోషం. కాని నాయనా! నేనేమీ చదువుకున్నదాన్నికాను. పదిమందిని ఎరిగున్న దాన్నికాను. అయినా నామనస్సుకు తోచిన నాలుగుసంగతులు నీచెవిన వేస్తాను. నా కడుపున గల్గినబిడ్డ ప్రజలకు సేవ చేస్తానంటుంటే నాకు పర మానందం కలిగింది. పుష్కలంగా మనకు ఆస్తిపాస్తులున్నాయిగనుక నీ

వింకా ధనం సంపాదించాలని నేను కలలోనైనా కోరను. తూర్పుపడమరలు తెలియక జీవితంలో అడుగడుగునా సంకటాలను ఎదుర్కొనే జనసామాన్యం నీవలన ఉపకారం పొందుతుంటే కన్నులపండువుగా చూచి సంతోషించాలనివున్నది. పిన్నలూ పెద్దలూ నీవలన ఉపకారం పొంది చిరునవ్వుతో తిరిగి వెళుతుంటే వాళ్ళ ఆనందాన్ని చూచి ఆనందించాలని వున్నది.

"కాని వెంకూ! ఈ ప్రజాసేవ చేయటం గూర్చి నేను మరొకరకమైన సౌధాలు కట్టుకుంటున్నాను. వాటిని నీముందుంచుతాను. నీకు నచ్చినట్లయితేనే నా అభిప్రాయాలను పరిశీలించు.

"మనతాలూకా ఆంధ్రప్రాంతంలోకల్లా వెనుకబడ్డ ప్రాంతమని మా నాన్నగారు చెబుతుండేవారు. ఇది వెనుకబడ్డప్రాంతమని నేనేమీ విచారపడను. ఎందుకంటే వెనుకబడ్డప్రాంతం గనుకనే ఇక్కడి ప్రజలకు సేవ జేయడానికి పుష్కలంగా అవకాశాలు దొరుకుతాయి. ఇక్కడిప్రజలు కృతజ్ఞత కలిగివుంటారు. చాలా నమ్మకస్తులుగా గూడా వుంటారు. అందుచేత ఇలాంటిచోట ప్రజలకు సేవ చేస్తున్నకొద్దీ ఇంకాఇంకా చేయాలనిపిస్తుంది. మనిషి స్వార్థాన్ని మరచిపోయి సేవలో మునిగిపోయి తనను తాను మరచిపోతాడు గూడాను.

"అయితే ప్రజాసేవ అంటే ఏమిటనేదే ఒకప్రశ్న. నాకుతోచిన విషయమేమంటే— ఏచర్యలవలన అమాయకప్రజల ముఖాల్లో చిరునవ్వూ కృతజ్ఞతా కలుగుతాయో అదే ప్రజాసేవ అనుకుంటాను. ఏ చర్యలవల్ల జనులలో హర్షధ్వానాలూ, అభినందనలూ ఆరంభమవుతాయో అది ప్రజాసేవ అనిపించుకోదు. ఇంకేవో అనిపించుకుంటుంది. బహుశా దాన్ని ప్రజా నాయకత్వం అనవచ్చునేమో. నా కోరిక ఏమంటే నీవు ప్రజా నాయకుడవుగాక ప్రజా సేవకుడవు కావాలని."

అప్రయత్నంగా నా కళ్ళల్లో నీరు చేరుతున్నాయి. ముఖం మరొకవైపు తిప్పుకున్నాను. మా అమ్మగారు నిప్పుల్లోవేసి బంగారంయొక్క కల్తీని కనిపెడుతున్నట్లనిపించింది! ప్రజానాయకుడూ, ప్రజాసేవకుడు అనే ఇద్దరు బలాఢ్యులు నా మెదడులో ప్రవేశించి సత్తువ చూచుకుంటున్నారు! వాళ్ల ప్రతిబింబాలు నా హృదయంలో చేరి మీసాలు దువ్వుకుంటున్నాయి!...నిజం చెప్పాలంటే నా హృదయంలో ప్రజాసేవకునిదే

పై చెయ్యిగా వుంది. నా మనస్సులోమాత్రం ప్రజానాయకుడే నెగ్గే ట్లున్నాడు. ఈ ఇద్దరినడుమ పడి నేను నలిగిపోతున్నాను !

మా అమ్మగారు చెప్పుకుపోతున్నది: "మొన్న మన చాకలి పీరాయపెండ్లాము సుబ్బులు ప్రసవించి గుణ్ణపువాతం కమ్మితే సమయానికి డాక్టరు లేకపోయాడు. తిమ్మాపురం తీసుకెళ్ళేలోగానే వాతం కమ్మి చచ్చిపోయింది. నేనెరిగున్నంతలో మన ఒక్క వూళ్లో ఏడెనిమిది ప్రాణాలు మందుల్లేక ఈలోకం వీడినయ్. ఇంత ఆస్తి మనకున్నదిగదా! ఒక్క ఏడాది ఆదాయంతో ఒక చక్కని ఆసుపత్రి కట్టించక పోతిమే అని అనుకున్నాను. నాయనా ! నీవు గనుక నూరు నూటపాతిక మంచాలు గలిగిన చక్కని ఆసుపత్రి గనుక కట్టిస్తే నేను ప్రతిరోజూ మధ్యాహ్నం పూట వెళ్లి పండ్లూ,ఫలాలు తెచ్చిపెడుతూ మనస్సుకు ఆనందకరమైన సంగతులు చెప్తూ ఉపచర్యలు చేస్తూ నాజన్మ తరింప చేసుకోవాలని వున్నది.

"పోనీ నీకది నచ్చకపోతే మనగ్రామంలో ఒక ఉన్నత పాఠశాలను, విద్యార్థులకోసం ఒక వసతిగృహాన్ని కట్టించు. ఈ రోజుల్లో పాఠశాలల్లో పరీక్షలకు అవసరమైన సంగతులు మాత్రమే చెప్తున్నారు. వివేకవంతుడైన పౌరుడుగా తయారుచేయగల పరిజ్ఞానాన్ని అందజేయటంలేదు. అలా కాక నీవుగూడ ఒక ఉపాధ్యాయుడుగా వుంటూ తగిన నీతిబోధనాతరగతులు ఏర్పాటు చేసి, చక్కని నడవడిగల మెరికల్లాంటి బాలురను తయారు చేయవచ్చు. వసతిగృహానికి అధిపతిగా వుంటూ వాళ్ళకు మంచి సంస్కారాలు కలిగించవచ్చు.

"పోనీ ఇదిగూడ నీకు నచ్చని పక్షంలో మరొక పని చెయ్యి. నాకు తెలిసినంతవరకు మన ప్రాంతంలో తల్లి దండ్రులు లేని బిడ్డలను పెంచే అనాథశరణాలయం ఒకటిగూడాలేదు. బిడ్డను కని తల్లి చనిపోతే ఆ బిడ్డను పెంచేవాళ్లు లేరు. అలాంటి పసిపాపలకోసం ఒక శరణాలయం గనుక నీవు ఏర్పరచి ముగ్గురు నలుగురు దాదులను నియమిస్తే నేను స్వయంగా నాకాలమంతా ఆశరణాలయంలో గడుపుతూ పిల్లలకు చక్కని ఆటపాటలతోటీ, కథలతోటీ, ఉత్సాహాన్ని వివేకాన్ని కలిగించాలని నానొక సరదా వున్నది. ఆ బాలబాలికలలోనుంచి ఉత్తమ పౌరులను తయారు చేయాలని నాకొక అభిలాష వున్నది. నీకు గనుక ఇష్టమైతే ఇలా చెయ్యి.

"ఆలోచించుకుంటూ పోతే ఇలాంటి అవసరాలు ఎన్నో వున్నాయి. ఉదాహరణకు పశువుల పెంపకం మీద శ్రద్ధ లేకపోవటం వలనా, మాంసంకోసం పాడిపశువులను చంపటంవలనా, మనవూళ్ళలో పాలకూ పెరుగుకూ కరువైపోతున్నది. మందులోకైనా ఆవుపాలు దొరకటంలేదు. పాలపిండి వాడవలసినగతి పడుతున్నది. కల్తీలేని నెయ్యి కలికానికైనా దొరకటంలేదు. అందుచేత మనం రెండు మూడు వందల గేదెలను, ఆవులను కొనితెచ్చి భారీఎత్తున పాలపరిశ్రమ ఆరంభించి, పచ్చిక కోసం కొంత పొలాన్ని కేటాయించి వుంచినట్లయితే చుట్టుపట్ల గ్రామ ప్రజలకైనా సమృద్ధిగా పాలు సరఫరాచేసి ఆరోగ్యం బాగుగా వుంచగలుగుతాం. అదీగాక నోరులేని జంతువుల్ని పెంచటంలో ఎంతో ఆనందం వున్నది."

ఆమె ఇలా చెప్పుకొని పోతుంటే ఏమి జవాబివ్వాలో నాకు తోచటంలేదు. మా అమ్మగారు చెప్పేవాటిలో ఏ ఒక్కటీ నాకు చెడ్డదిగా కన్పించలేదు. పైగా అవి నేటి ప్రజల అవసరాలను అద్దంలో చూపినట్లు కనిపింప చేస్తున్నాయి. ఆమెను నేను "కాద"నలేక పోతున్నాను. కాని నామిత్రులు నిర్మించుతున్న ఊహాసౌధాలతో పోల్చి చూస్తే మాఅమ్మగారు నాముక్కుకు తాడుగట్టి పెడదారికి తీసుకొని పోతున్నదని బెంగవేస్తున్నది. మాఅమ్మగారి మాటలన్నీ నన్ను "కార్నర్" చేస్తున్నవి. ఓరి భగవంతుడా అనుకున్నాను.

ఆమె నా మానసిక పరిస్థితిని ఇట్టే కనిపెట్టివేసింది. "నేనేదో తెలిసీతెలియని దాన్ని. నాకు తోచిన సంగతులు నేను చెప్పాను. నేను చెప్పినదే దేశసేవ అవుతుందనీ, మరొకటి కాదనీ నేను అనుకోటంలేదు. నీ స్నేహితులు అన్నిటినీ ఎరిగినవాళ్లు కావచ్చు. నీవు వాళ్లతో సంప్రదించు. నీ హృదయానికి ఏది సవ్యమనితోస్తే ఆపనిచెయ్యి. కాని ఇందాక నీవు నాకు వాగ్దానంచేసినట్లు అధికారంకోసం ప్రాకులాడకు. ప్రజాసేవ చేసేమార్గం యోచించు. ఇంతకంటె నేనేమీ కోరను. నీవలన సహాయం పొందిన వ్యక్తుల ముఖారవిందాలలో చిరునవ్వును చూసి నేను తరిస్తాను." అని చెప్పి తాను భోజనం చేయటంకోసం వంట ఇంట్లోకి మెల్లగా వెళ్లింది.

హాఁ!... అనుకున్నాను. ఒక్కసారి చేతులు పైకెత్తి ఆవులించాను. మా అమ్మగారే నన్ను రక్షించింది. నేను చెప్పబోయే జవాబు ఆమే చెప్పి, నాకు వున్నదని నే ననుకుంటున్న "పరువు"ను నిలబెట్టింది!

మరునాటి ఉదయం కాలకృత్యాలు తీర్చుకున్నాను. రెండు కాగుల వేడినీటితో తనివితీర స్నానంచేశాను. గేదె పెరుగుతో ఊరగాయ నంజుకుంటూ అన్నంతిని రెండెడ్లబండి ఎక్కాను. మా అమ్మగారు నాకోసమూ, నా మిత్రులకోసమూ కమ్మని నేతితో తయారుచేసిన పంచదార అడ్లనూ, నోట్లోవేసుకుంటే నానిపోయేటువంటి పకోడీలనూ స్వయంగా వచ్చి బండిలో కూచున్న నాచేతి కందించింది. మా నాన్నగారు వీధి గుమ్మంలో చుట్టకాలుస్తూ నిలబడి "అరే అప్పడూ! సంకురాత్రి పండక్కి నీ స్నేహితుల్ని గూడ వెంబడేసుకొని రారా! ఏంశి?" అన్నాడు. వినపడి వినపడకుండ 'అట్లాగే' నన్నాను.

బండి కదిలింది. ఒక ముత్తైదు ఎదురుగా వస్తోంది. ఆమె మా పిన్ని కూతురు. అది మా అమ్మగారు ముందుగానే చేసిన ఏర్పాటు అన్నమాట! "అరే వెంకూ! పుట్టినవూరు మర్చిపోకురోయ్" అని నవ్వుకుంటూ దాటిపోయింది. మా అమ్మమాత్రం వీధిగుమ్మంలో నిలబడి బండి మలుపు తిరిగేవరకు నావంక చూస్తూనే వున్నది. దూరంనుంచి కనిపించింది.— చీర చెరగుతో కన్నీరు తుడుచుకుంటూ!... నాకుగూడా అప్రయత్నంగా నీరు నిండినై... కన్నీరుకార్చే సమయాలు ఎంత మధురమైనవో గదా!

---

# 8. కత్తి లేని మంగలి!

"కొంప మునిగిందిరా బాబూ" అన్నాడట సుశీలారావు - నేను మావూరు వెళ్లానని విని. తరువాత మహాలింగం నాతోచెప్పాడు.

నేను తిమ్మాపురం చేరంగానే నామిత్రులు ముగ్గురూ నా దగ్గరికి వచ్చారు. ముగ్గురిలోనూ ఆతురత కనపడింది నే నెలాంటి "బాంబు" లాంటి కబురు మీద విసరుతానోనని. వాళ్లకు "ఆశాభంగం" కలిగించడంకోసం నేనెలాంటి కబురూ చెప్పక పోగా పెట్టెలోనుంచి గారడీవాడు

తీసినట్లు లడ్లపొట్లాన్నీ, పకోడీల పొట్లాన్నీ తీసి నడిమిలో పెట్టాను. కొండయ్యకు పరమానందం కలిగింది. ధోవతి వదులు చేస్తున్నాడు. మహాలింగం పొట్లాలు విప్పదీస్తున్నాడు. సుశీలారావు మటుకు స్వభావం ప్రకారం ఆలోచనలు చేస్తూనే మామూలుగా కనపడాలని ప్రయత్నిస్తున్నాడు. నలుగురమూ నాలుగు చేతులూ వేసి సునాయాసంగా పని పూర్తి చేశాం. కొండయ్య మాత్రం సంతుష్టి కనపరచలేదు. లడ్ల పొట్లంలో అడుగున మిగిలిన పొడినిగూడా నోట్లోకి దులుపుకుంటూ కాగితాన్ని అడుగున వేలితో రెండుదెబ్బలు వేశాడు. కాగితాన్ని మడిచి దూరంగా పారేశాడు. ఇక నీ పని అయిపోయింది పో అన్నట్లు !

సుశీలారావు ఉపక్రమించాడు; "సోదరా! మన కార్య కలాపాలను గురించి సి. ఐ. డి. రిపోర్టులు వెళ్లడంవల్ల మీఅమ్మగారు నిన్ను "వారంటు" పంపి పిలిపించిందని విన్నాను. నీవు వెళ్లిన తర్వాత జరిగిన సంగతులన్నీ సవిస్తరంగా చెప్పు. వినాలని కుతూహలంగావున్నది" అన్నాడు. మహాలింగం కొండయ్యలు డిటో అన్నట్లు కళ్ళు పెద్దవిచేసుకొని నావంక చూస్తున్నారు.

మా అమ్మగారు నన్నడిగిన యక్షప్రశ్నలూ, నేనుచెప్పిన సమయానుకూల సమాధానాలూ పూసగ్రుచ్చినట్లు చెప్పాను. నేను ప్రజాసేవ చేయటం ఆమెకిష్టమేననీ, కాని అధికారంకోసం పాకులాడటంమాత్రం ఆమెకు సుతరామూ గిట్టదనీ, నేను ప్రజాసేవ చేస్తానుగాని అధికారంకోసం ఆరాటపడనని ఆమెకు వాగ్దానం చేశాననీ చెప్పాను.

ఈమాట నేననేసరికి సుశీలారావు నాలిక కొరుక్కున్నాడు. చెవులు నిక్కపొడుచుకొని నా కళ్ళల్లోకి చూస్తున్నాడు. మా అమ్మగారు ప్రజాసేవకూ ప్రజానాయకత్వానికీ ఇచ్చిన నిర్వచనాలనుగూడ వాళ్ళకు అప్పచెప్పివేశాను. ప్రజాసేవ చేయటంకోసం ఆమె కొన్ని పద్ధతులు సూచించిందనీ, ఒక ఆసుపత్రిగాని, ఒక ఆదర్శవంతమైన పాఠశాలనుగాని, ఒక అనాథ శిశుసంరక్షణాలయాన్నిగాని స్థాపించమనీ లేదా కొన్నివందల పాడి పశువులను కొని భారీ ఎత్తున పాడిపరిశ్రమ ఆరంభించమనీగూడ చెప్పిందని వివరించాను.

సుశీలారావు విస్తుపోతున్నాడు. 'మీఅమ్మగారు ఏమైనా చదువుకున్నదా'అని అడిగాడు. మా అమ్మగారు ఏమీ చదువుకోలేదుగాని దయార్ద్రమైన హృదయమూ, తోటి మానవులమీద అనంతమైన ప్రేమ, అనుభవపూర్వకమైన వివేకమూ వుండటంవలన చల్లని మాటలతో అవతల మనిషిని తనవైపు మళ్ళించుకోగలదని "గర్వంగా" చెప్పాను.

సుశీలారావు మాట్లాడడం ఆరంభించాడు. చిన్నతనంనుంచీ అతన్ని నేను అంటిపెట్టుకొని వుండటంవల్లనైతేనేమి, అతనికి కళ్ళల్లోని వర్చస్సువల్లనైతేనేమి, అనేక క్లిష్టసమయాలలో అతను నా అండగా వుండటంవల్లనైతేనేమి సుశీలారావంటే నాకు అనురాగంతోగూడిన అభిమానం. అతని వాదంగూడ ఓపికతో విన దలిచాను.

"వెంకటప్పయ్యా! మీ అమ్మగారు సత్యకాలపుమనిషి. ఆమె చదువుకోనటువంటి జ్ఞాని. ఆమె మనస్సు బాణంకంటె నిశితంగా కనిపిస్తున్నది. ఆమె హృదయం అపుడు తీసిన వెన్నపూసలాంటిది. ఆమె చెప్పినవిషయాలు సామాన్యుల బుద్ధులకు తట్టనివి.

"కాని మిత్రమా! మనం ఇరవయ్యోశతాబ్దం మధ్యలో వున్నాం. మనం తేలి యాడుతున్న ఈ సముద్రంలో మైనులు నాటబడి వున్నాయి. మనం నడిచే వీథుల్లో గడ్డికప్పబడిన బావులున్నాయి. మనంనిద్రించే పడకగదిలో టైంబాంబులు పెట్టబడ్డాయి. మనంఆడుతున్న ఈజీవితనాటకంలో విలన్ పాత్రలే అధికంగా ఉన్నాయి. ప్రపంచంలో దొంగల్ని పట్టుకునే వినూతన పరికరాలు కనిపెడుతున్నారు. కాని దొంగలుకూడ దొంగిలించటానికి అధునాతన పరికరాలు ప్రయోగిస్తున్నారు ప్రపంచం నానాటికీ నూతన మార్గాలద్వారా చిన్నదై పోతున్నమాట నిజమేగాని ప్రజలబుద్ధులుగూడ ఇంకా ఇంకా చిన్నవవుతున్నాయి."

ఇలా చెప్పుకుపోతుంటే దిగ్భ్రాంతుడనై వింటున్నాను. సుశీలారావు మరింత ఉత్సాహంతో చెపుతున్నాడు. మహాలింగం. కొండయ్యలు తలలను అటునుంచి ఇటూ ఇటునుంచి అటూ ఊపుతున్నారు... "అందుకని మనం వాస్తవిక దృష్టితో ఆలోచించాలి. గాలిలో మేడలు కట్టకూడదు. వాస్తవికతకు దూరం కాకూడదు. లోకాన్ని అతిగా విశ్వసించకూడదు. శత్రువు వున్నా లేకపోయినా కవచం ధరించటం మంచిది.

కీడు ముందు ఎంచిన తర్వాతనే మేలెంచవలసి వుంటుంది. సత్యకాలం వచ్చిన తర్వాత మీ అమ్మగారి మాటలు వేద వాక్యా లవుతయ్. నీకంటె ముందుగా నేనే వాటి నాచరిస్తాను.

"కాని అంతవరకూ వున్నదే-ఆ సత్యకాలం వచ్చేవరకు - ప్రజలకు అర్థమయ్యే భాషలో మాట్లాడాలి. కరుణ, ప్రేమ, దయ అంటె ఇదేదో చేతకాని తనం అనుకొని నాలుగు గులకరాళ్లు గురిచేస్తారు గాని సరిగా అర్థం చేసుకోరు. పోలీసు ఉద్యోగి వచ్చి మనకు సలాం కొడుతున్న రోజున ప్రజలు గూడ మన మాట వింటారు. అంతేగాని మనం పద్మాసనంలో కూర్చొని ధర్మపన్నాలు వల్లిస్తుంటే ఒక కాసీ దిబ్బెనలో వేసి లెంపలేసుకొని పోతారేగాని ప్రయోజనముండదు.

"కనుక తీరా నేను చెప్పవచ్చిందేమంటే - కత్తిలేని మంగలి వలన ఏమి లాభం? ఏమీ లాభంలేదు. దమ్మిడీకి కొరగాడు. గోళ్లు గిల్లుకుంటూ చెట్టుకింద కూచోవాలి. ఉపకరణం లేనివాడు వ్యర్థుడు. అలాగే ప్రజాసేవ అనేది చేయాలంటే ఉపకరణం ఏమిటి ?

"నీదగ్గర తాతలు ఇచ్చిపోయిన ఆస్తి వున్నదిగదా అని అనుకుంటున్నావేమో!...ప్చ్... లాభంలేదు. దేశంలో జనసంఖ్య ఎంతవున్నది? నీడబ్బు ఎంతవున్నది? పోల్చిచూడు...సముద్రంలో కాకిరెట్ట! నీదగ్గర లక్షో రెండులక్షలో వున్నదనుకో. అది ఆరిపోవాలంటే ఆరునెలలు పట్టదు... అది పద్ధతికాదు. నేను చెపుతున్నానుగా, అది పద్ధతికాదు... గంగానదీ జలం మోస్తరుగా ఇంకనటువంటిదాన్ని మనం పట్టుకోవాలి. వ్యక్తి అల్పాయుష్కుడు. వ్యక్తి ఆస్తిగూడ ఎంతోకాలం వుండదు. నీటి బుడగమోస్తరు. నీవొకసారి భూప్రదక్షిణం చేసివస్తే నీఆస్తి దమ్మిడీల లోకి దిగుతుంది... సమాజం అలాంటిది కాదు. అన్ని కాలాలలోనూ సమాజం వుంటుంది. సమాజానికి నాశనంలేదు. సమాజపు డబ్బుగూడ ఎన్నటికీ ఇంకిపోయేదికాదు. ప్రజలు పన్నులిచ్చే సత్తువనుబట్టి ఆ ఆస్తి తరుగుతూ పెరుగుతూ వుంటుంది. ప్రజాసేవ చేయదలచినవారు ప్రజల డబ్బునే కర్చుచేయాలి. ఇది రూలు. అంతేగాని వ్యక్తిడబ్బు ప్రజలకోసంగాని, ప్రజలడబ్బు వ్యక్తికోసంగాని కర్చుచేయగూడదు. అది తప్పు.

ఐతే ఈ ప్రజలడబ్బు ప్రజాసేవకుల చేతుల్లోకి ఎలా వస్తుంది? దానికి ఒకటే రాజమార్గం - అధికారం. అధికారాన్ని హస్తగతం చేసుకోవాలి. అందుకోసం స్థానిక సంస్థలలోనూ, శాసనసభలలోనూ ప్రవేశించాలి. కాబట్టి ప్రజాసేవ చేయటంకోసమే అధికారంలోకి రావాలి. తప్పదు...అధికారం కత్తివంటిది. అధికారం లేకుండా ప్రజాసేవ చేస్తాననటం కత్తిలేని మంగలి బాపతు!"

కాస్త తమాయించి మళ్లీ అన్నాడు. "మనఉద్దేశం మీ అమ్మగారికి నీవు వాగ్దానంచేసినట్లు ప్రజాసేవ చెయ్యటమే. కాని అందుకు అధికారంలోకి పోయి ప్రజలడబ్బుతో ప్రజాసేవ చేయాలని మనమంటాం. సొంతడబ్బుతో ప్రజాసేవ చేయాలని మీఅమ్మగారంటారు. ఇంతే తేడా! అయినా మనం ఆలోచించాలి. నీ ఒక్క డబ్బుతో అయితే ఒక హైస్కూలో, ఒక ఆసుపత్రో కట్టించి వూరుకోవలసి వస్తుంది. అలా గాక నీవు జిల్లాబోర్డు అధ్యక్షుడవో మరేదైనానో గనుక అయితే జిల్లాలో పాతిక హైస్కూళ్లూ, పాతిక వంతెనలూ, పది పది పేను ఆసుపత్రులూ కట్టించవచ్చు. ఇంతకూ మూలసూత్రం ఎక్కడున్నదంటే కత్తిలేని మంగలి ఎంతటి నిరర్థకుడో, అధికారం లేని ప్రజాసేవకుడు అంతటి నిష్ప్రయోజకుడు."

అరటిపండు వలిచి చేతిలో పెట్టినట్లుగా వుంది సుశీలారావు చెప్పిన విషయం. ఇంతకు ముందు నాలో ప్రవేశించిన సందేహాలన్నీ మబ్బు విచ్చిపోయినట్లు నివృత్తి అయినయ్. మా మిత్రులు నిర్దేశించిన కార్యకలాపాలలో మరింత ఉత్సాహంతో కృషి చేయటానికి నేను నిశ్చయించుకున్నాను. ఆనాటి రాత్రి మేము నలుగురమూ కలిసి సినిమాకు వెళ్లాం.

---

# 9. శుభవార్త

"శుభవార్త తెచ్చాను. ఏమిస్తావ్" అన్నాడు సుశీలారావు. "ఏమిస్తాను నా మొహాం? నాకు నేనే ఇచ్చుకున్నానుగా! చీట్లపేకలో జోకరు లాగ వాడుకొంటుంటివి. ఇక నేనివ్వవలసిందేముందీ?" అన్నాను సరదాగా.

"మై డియర్ వెంకటప్పయ్యా! మా అమ్మమీద ఒట్టు పెట్టుకొని చెబుతున్నాను. నిన్ను నేను ఎన్నడూ వాడుకోను. నిజానికి మనవిరెండూ ఒకే ఆత్మగల రెండు శరీరాలని నే ననుకుంటున్నాను. మనలో కీడుగాని మేలుగాని ఎవరికి జరిగినా అది ఇద్దరికీ జరిగినట్లే నేను భావిస్తున్నాను." అన్నాడు దీనంగా. అతని మనస్సుకు నొప్పి కలిగించినందుకు నేను చాలా నొచ్చుకున్నాను.

"పోనీలే. ఏదో నోరుజారి అనేశాను... ఒక కంచంలోతిని ఒక మంచంమీద నిద్రించిన మనలోమనకు సందేహాలేమిటి... సరేగాని... ఆ శుభవార్త ఏమిటో చెప్పావుకావు" అన్నాను.

"ఆసంగతే నీ చెవున వేద్దామని వచ్చాను. ఇవ్వాళ 'మసాలా' దిన పత్రిక కార్యాలయంనుంచి ఒక అధికార పూర్వకమైన లేఖ వచ్చింది. అందులో నన్ను తిమ్మాపురం పట్టణంతరఫున విలేఖరిగా వుండవలసిందిగా వ్రాశారు. ప్రతినెలా నేను ఇక్కడనుంచి పంపే వార్తలనుబట్టి డబ్బు చెల్లిస్తూ వుంటారు" అన్నాడు.

నాకు అత్యంత ఆనందం కలిగింది. సుశీలారావు పత్రికా విలేఖరిగా నియమించబడిన శుభసమయంలో మామిత్రులు నలుగురమూ చేరి భోజనంతో తుల్యమైన అల్పాహార విందు ఆరగించాం. కొండయ్యను కూచోపెట్టి గులాబిజాముల పందెం ఏర్పాటుచేశాం. 26 గులాబిజాములను సునాయాసంగా తన చిరు బొజ్జలో ఇముడ్చివేశాడు. అంత కష్టంపడుతున్న సమయంలో మహాలింగం అతనిని విసనకర్రతో విసురుతూ ఆదుకున్నాడు. టీ పుచ్చుకొని పార్కులోకి బయలుదేరాం.

సుశీలారావు పత్రికా విలేఖరి అయినంతమాత్రాన ప్రత్యక్షంగా ప్రయోజనమేమిటో నాకు అర్థంకాలేదు. అతనినే అమాయకంగా అడిగాను చెప్పమని. అతను చాల ఓపికతో చెప్పాడు.

"ఈ ప్రపంచం ఇదివరలో గాలి, నీరు, భూమి, అగ్ని, ఆకాశము అనే పంచ భూతాలవలన నడిపించబడుతుండేది. ఇపుడు కాలం మారింది. భూతాలు పోయి దేవతలు వచ్చారు. దినపత్రిక, సినిమా, రేడియో అనే త్రిశక్తులు నేడు లోకాన్ని ఒక కొలికికి తీసుకొని వస్తున్నాయి. ఈ మూటిల్లో దేన్ని చేపట్టినా మనకు మహారాజయోగం ఖాయమే! ప్రస్తుతం దినపత్రికగూర్చి విచారిద్దాం. దేశంలో దినపత్రిక చేయలేనిపని ఏమున్నదిశ్ పడిపోయే ప్రభుత్వానికి ఆయుస్సు పోయగలదు. తనకిష్టంకాని రాజకీయ పార్టీని శిథిలం చేయగలదు. తలచుకుంటే ప్రజలలో ఉద్రేకాలను రెచ్చగొట్టనూ గలదు; లేదా మన్నుతిన్న పాముల్లాగ పడేసి ఉంచనూగలదు. లేనిదాన్ని స్పష్టంగా చూపించనూగలదు; వున్నదాన్ని లేదని ప్రమాణాలిచ్చి ఋజువుచేయనూగలదు. దినపత్రిక సంపాదకుడి చేతిలో దేశంయొక్క జాతకం వున్నది. అతనికలంలో మనుషుల ముక్కులకు తాళ్లుగట్టి ఈడ్చుకొనివెళ్లే మాంత్రిక శక్తివున్నది. అతని జేబులో సమస్యలను సృష్టించటానికీ, పరిష్కరించటానికీ గూడా ఉపకరించే తాళం చెవులున్నాయి.

ఆ దినపత్రికలకు దేశమంతటా అన్ని ముఖ్యనగరాలలోనూ విలేఖరులుంటారు - జిల్లాకలెక్టర్లకు ప్రతిగ్రామంలోనూ కరణాలున్నట్లు. కరణాలు శిస్తు వసూలుచేసి కలెక్టరుగారికి పంపినట్లుగానే విలేఖరులు వార్తలను సేకరించి సంపాదకునికి పంపుతుంటారు. మాంచి సార్వీసుగల విలేఖరి అయితే అడపాతడపా వార్తలను సృష్టించుతుంటాడుగూడాను! భర్తయొక్క మానసిక వైఖరులను గుర్తించి భార్య ఎలాగైతే తను చెప్పవలసిన సంగతులకు ఒకరూపమిస్తుందో, అలాగే సంపాదకుని ప్రియాప్రియాలను కనిపెట్టి విలేఖరి వార్తలను పొందుపరుస్తుంటాడు. ఇదీ సంగతి. నేను గూడ ఇంతవరకూ ఒకసామాన్య పత్రికారచయితగా వార్తలను పంపేవాడిని. ఇకనుంచి "మసాలా" దినపత్రికకు అధికారపూర్వకంగా ఒక విలేఖరినయాను."

మహాలింగం ఎదురుప్రశ్న వేశాడు. "నీవు చెప్పినదంతా బాగానే వున్నది. ఐతే నీవు విలేఖరివి కావటంవల్ల మనకుఒరిగే ప్రయోజనం ఏమిటీ అంటాను?"

"మంచిమాట అడిగావు. అదే చెప్పబోతున్నాను. ఈ రోజుల్లో మెడమీద తలగల ప్రతివాడికీ పబ్లిసిటీ కావాలి. చీమ చిటుక్కుమంటే పేరు పేపర్లో పడాలి. ఒక్కొక్క సభ జరిగితే ఉపన్యాసకు లున్నంత మంది ప్రేక్షకు లుండరు. బ్రహ్మాండంగా సభ జరిగిందని పేపర్లో మాత్రం పడుతుంది. ఒక్కొక్క సమాజంవాళ్లు ఫొటోలో దిగితే ఆఫొటో పేపర్లో పడేవరకు వాళ్లకు అన్నం సయించదు. రాజకీయ నాయకు లున్నారే- వాళ్లు అన్ని ఋతువుల్లోనూ పనిమీద వుండరు. ఎన్నికల కాలంలో వూళ్ల మీద కనిపిస్తారు గాని మిగతా రోజుల్లో గడ్డంకింద చేతులు పెట్టుకొని ఇంటిదగ్గరే వుంటారు. కాని వాళ్లు ప్రజలు తమను మర్చిపోకుండా వుండటంకోసం అయినదానికీ కానిదానికీ ఒక్కొక్క పత్రికా ప్రకటనను జారీ చేస్తుంటారు. ఈవిధంగా పట్టణంలో "పైకి రావా"లనే మహాదాకాంక్ష గలవాళ్ళంతా పత్రికా విలేఖరి ముందర ఐదు పది చేసి నిలబడుతారు. సర్వసాధారణంగా పురోహితుడికి ఎలాగైతే స్వంత ఇంట్లో భోజనం చేసే అగత్యం ఉండదో, అలాగే పత్రికా విలేఖరులకు స్వగృహంలో ఫలహారం చేసే అవసరం ఉండదు! ప్రజలు నేరుగా పంపే వార్తలను పత్రికల వాళ్లు సరిగా వెయ్యరు. విలేఖరులు పంపే ప్రతి అక్షరమూ పత్రికలో చోటు చేసుకుంటుంది. అందుచేత లోకంకోసం పాటుపడే ప్రతివాడూ మొదట విలేఖరికి దగ్గరగా వుంటాడు. నారదమహార్షి ఎంత నిర్విరామంగా పర్యటిస్తూ వుంటాడో విలేఖరి అంత "బిజీ"గా కనపడుతాడు. ఇపుడు ఇక్కడున్నవాడు మరుక్షణంలో ప్లాటుఫారంమీద పచార్లు చేస్తుంటాడు. కనపడ్డ వారందరికీ తాను ఆప్తుడిలాగ పలుకరిస్తాడు. కాని నిజానికి దినపత్రిక సంపాదకు డొక్కడికే అతను ఆప్తుడు. పట్టణానికి విలేఖరి ఒక రకమైన పురోహితుడు అనవచ్చు."

సుశీలారావు మాటల్ని బట్టి అతనికీ, అతనిద్వారా మాకందరికీ భేషైన జాతకం ముందున్నదని అనిపించింది. అతనికి విలేఖరిపదవి వచ్చినందుకు తోడుపెళ్ళికొడుకుల లాగ మేమంతా ఆనందించాం. పట్టణంలో ఎక్కడ ఏమి వింత జరిగినా ఆదరాబాదరాగా వెళ్ళి సంగతి తెలుసుకొని సుశీలారావు చెవున వేస్తుండేవాళ్లం. ఒకసారి స్కూలుఫైనలు పరీక్షలు జరుగుతుండగా పరీక్ష హాలులో ఆన్సరు చెప్పనందుకు ఒక విద్యార్థి ఒక వాచరును ముందుపళ్లు రాలేటట్లు కొడితే ఆ వార్తను సుశీలారావు టెలిగ్రాం

ద్వారా పంపించాడు. మరునాడు తెల్లవారేసరికి మావూరి హైస్కూలు ప్రతిభ మొదటి పేజీలో దర్శనమిచ్చింది !

ఒకసారి కల్లుతాగి బూతులు మాట్లాడుకుంటూ ఇద్దరు పోలీసులు యూనిఫారంతో వుండి సైడుకాలువమీదపడి పొర్లాడుతున్నారు. సుశీలా రావు ఈ అపూర్వ దృశ్యాన్ని చూచి పరమానందభరితుడై మహాలింగాన్ని పిలిపించి వాళ్ళ నెంబర్లుగూడ పడేటట్లు రెండు ఫొటోలు తీయించాడు. సుశీలారావు వాటి కాపీలను తీసికెళ్ళి పోలీసు సబ్ఇన్‌స్పెక్టరుకు చూపించి "ఇదుగో మీ పోలీసులు. యూనిఫారంలో వుండి కల్లుతాగి తందనాలు తొక్కుతున్నారు. ఈ ఫొటోను వార్తతోసహా పత్రికకు పంపితే నాకు మంచి ప్రమోషను వస్తుంది...వెళ్ళివస్తాను" అని వచ్చేశాడు.

అతను ఇంటికి వచ్చిన అరగంటకల్లా ఆ పోలీసులిద్దరూ సుశీలారావు దగ్గరకు వచ్చి అతనిచేతులు పుచ్చుకొని "బాబూ! ఇవి చేతులుకావు కాళ్ళనుకోండి. ఏదో బుద్ధి గడ్డితిని తప్పతాగాం. మద్యనిషేధం అమలులో వున్న ఈ సమయంలో మీరు గనుక ఆ ఫొటోలను పత్రికకు పంపించినట్లయితే మా నోటిదగ్గరి కూడు తీసివేసిన వారవుతారు. ఆలుబిడ్డలు అల్లాడిపోతారు. బాబ్బాబూ! ఈ బహుమతి పుచ్చుకొని మమ్మల్ని మీరు రక్షించాలి" అని చెరొక వందరూపాయలనోటూ చేతులో పెట్టి నమస్కారం చేశారు.

సుశీలారావు లాటరీలో గెలిచినవాడిలాగ ఒక్కవవ్వునవ్వి, "ఏమయ్యా! నేనెవరిననుకున్నారు లంచం పుచ్చుకోటానికి! తీసుకోండి. మీ డబ్బులు మీరు తీసుకొని ఇంటికి పోయి మీ పిల్లలకు కొత్తగుడ్డలు కొనివ్వండి. నేనుమాత్రం ఈ తడవకు పత్రికకు వార్తను పంపను. ఇక వళ్ళు దగ్గరుంచుకొని మెలగండి" అన్నాడు.

కాని వందరూపాయలూ పుచ్చుకోక పోవటంవల్ల పోలీసులకు భయంగా వున్నది సుశీలారావు ఎప్పటికైనా ఫొటో పంపవచ్చునని. అందుకని వాళ్లు బహుమానం పుచ్చుకోమని బతిమలాడారు. సుశీలారావుకు కోపం వచ్చి "ఇలాగైతే నాకు లంచం ఇవ్వటానికి గూడ ప్రయత్నించారని వార్త పంపిస్తాను సుమా" అన్నాడు. దాంతో పోలీసులకు శార్తి నోట్లు మడిచి జేబులో పెట్టుకొని "బాబ్బాబు! మన్నించండి. మీసహాయం

ఎన్నటికీ మరువం. వార్తను మాత్రం పంపకండి" అని ప్రాధేయపడి వెళ్లి పోయారు.

సుశీలారావు ఆ వార్తను పంపలేదు. పోలీసులు మాత్రం శాశ్వతంగా సుశీలారావు యొక్క శిష్యపరమాణువులై పోయినారు. ఇతను కన పడితే చాలు గార్డ్ ఆఫ్ ఆనర్ లాంటిది ఇస్తూవుంటారు. ఇతనంటే వాళ్ళకు భయముతో గూడిన గౌరవం వున్నది.

పత్రికా విలేఖరిగా సుశీలారావు బాగా రాణిస్తున్నాడు. మా తాలూకాకు మంత్రులుగనుక పర్యటనకు వస్తే సుశీలారావును అన్ని హంగులతోటీ వాళ్ళ వెంట తీసుకొని వెళుతారు. తిమ్మాపురంలోని పెద్ద పెద్ద ఆఫీసర్లంతా సుశీలారావును ఎరుగుదురు. దేవతలు నారదమహర్షిని గౌరవించినట్లుగా వాళ్లు సుశీలారావును మర్యాద చేస్తుంటారు. ఏదైనా వూరు పోవాలంటే బస్సులో ఫ్రంటుసీటును ఖాళీ చేయించి ఇప్పిస్తారు. సినిమాలకూ, నాటకాలకూ కాంప్లిమెంటరీలు పంపిస్తారు. బెల్లు, బ్రేకు, మడ్గార్డు, లేనటువంటి ఒకసైకిలు మీద సుశీలారావు వూళ్లో సంచారం చేస్తూవుంటాడు !

---

# 10. సంక్రాంతి

సంక్రాంతి పండగకు సుశీలారావు నెలరోజుల ముందరనుంచీ పథకం వేస్తున్నాడు. ఏదో చిత్ర విచిత్రంగా సంబరం జరపాలనీ, వూరంతటినీ గుప్పిట్లోకి తీసుకొని రావాలనీ అతని ఊహ. మాకొండయ్య జరాసంధ వ్యాయామమండలి అనే సంస్థను నడుపుతున్నాడని ఇదివరలో మనవి చేశాను. దాని ఆధ్వర్యాన సంక్రాంతి పండగకు ఆటల పోటీలు నిర్వహించబడ్డాయి. అందుకోసం అన్ని పోటీలలోనూ ప్రథమ, ద్వితీయ శ్రేణులలో గెలుపొందినవారికి భీమార్జున పతకాలు బహూకరిస్తామని వాడ వాడలా ప్రచారం జరిగింది. అనేక వూళ్లనుంచి ఆటగాళ్లు వచ్చారు. చెడుగుడు, కుస్తీపట్టు, 100 గజముల ముణుగీత, టెంకాయ విసరివేయుటం, చేతులు వదలిపెట్టి సైకిలు తొక్కటం, మనిషిమీద మనిషిచొప్పున ఎక్కి

తాటికాయ లందుకోటం, నిలువులోతు చెరువులో అక్కడక్కడ విరజిమ్మ బడిన గుండ్రాళ్లను వెదికి పట్టుకొనిరావటం – ఈ పోటీలు నిర్వహించ బడ్డాయి. చీట్లపేకలోనూ చదరంగంలోనూ పోటీలు పెట్టవలసిందిగా వూళ్లో ఆఫీసర్ క్లబ్బువారు వచ్చి ప్రాధేయపడ్డారు గాని అవి శారీరిక పోటీల క్రిందికి రావు గనుక వీల్లేదని చెప్పాం.

దాదాపు రెండువందలమంది ఆటగాళ్లు వీటిలో పాల్గొన్నారు. పొరుగూరునుంచి వచ్చినవారికోసం కన్యకా పరమేశ్వరీ ధర్మసత్రంలో విడిది ఏర్పాటుచేశాం. ఉదయమూ, సాయంకాలమూ నేనూ సుశీలారావూ కలిసి సత్రంలోకి వెళ్లి, వచ్చిన అతిథుల్ని పరామర్శచేసి వచ్చేవాళ్లం. ఆట లలో పక్షపాతం జరగకుండా వుండటంకోసం కుంభకోణంనుంచి బలాఢ్యుడైన డ్రిల్లు మేష్టరును పిలిపించాం. నూతనమూ, అపూర్వమూ అయినటువంటి పోటీలు నిర్వహించటం వల్ల వేలకొలది జనం సర్కసు చూడటంకోసం వచ్చినట్లు వచ్చారు ఈ జనాన్ని అదుపులో పెట్టడానికి పోలీసుసహాయంగూడ కోరవలసి వచ్చింది.

సంక్రాంతిపండుగ మూడవరోజున బహుమతులు పంచిపెట్టటంకోసం బ్రహ్మాండమైన బహిరంగసభ ఏర్పాటుచేశాం. దానికి తాసిల్దారుగారిని అధ్యక్షులుగా తీసుకొని వద్దామని నే నన్నాను. సుశీలారావు ముక్కుమీద వేలువేసుకున్నాడు. ఈనగాచి నక్కలపాలు చేస్తామా? అన్నాడు. "నే గీచిన గీతలో వుండు. నిన్ను అధ్యక్షుడుగా పెడుతున్నాను. ఇదుగో అధ్యక్ష ఉపన్యాసం. దీనిని నిదానంగా వల్లెవేసి సభకు రమ్మ"ంటూ కాగితం చేతికందించాడు!

సభకు జనం బాగానే వచ్చారు. మొదట కల నిజమాయెగా, కోతీబావకు పెళ్లంట, అదుగోద్వారక, బావా నాకేసి ఒక్కసారి మొద లైన రికార్డులు చెవులు గింగురుమనేటట్లు వినిపించారు. పాటలకోసం వచ్చిన జనం సభలో వుండటంగూడ మర్యాద అనుకొని వుండిపోయారు. సభలో మొదటి అర్ధగంటసేపూ తళతళ మెరిసే ఖడ్గం పుచ్చుకొని కొండయ్య కత్తిసాము ప్రదర్శించాడు. అసలే ఉగ్రనరసింహామూర్తివంటి ఆకారం. అలాంటివాడు కళ్లు చెదిరేటట్లు కత్తిసాము చేయటంవల్ల వచ్చిన జనం ముక్కుమీద వేలు వేసుకున్నారు. ఉండుండి హర్షధ్వానాలు చేశారు. ఊపిరి సలుపనివ్వకుండా కత్తిని చక్రం తిప్పినట్లు తిప్పటంతో

ప్రేక్షకులు విభ్రాంతులైనారు. మరునాటినుంచీ కొండయ్యా ప్రతిష్ఠ సందు సందునా పాకిపోయింది. అతను కనిపిస్తే ప్రతివాడూ కాస్త దూరంగా తొలగి పోయేవాడు - వూళ్లో అదివరకు పేరుమోసిన రౌడీలు గూడ కొండయ్యాతో మైత్రి చేసుకోవటంకోసం దగ్గరకు రావట మారంభించారు.

కొండయ్యా భుజబలంతో సంపాదించిన ప్రతిష్ఠ నాకుగూడ సోకించాడు. ఎలాగంటే, ఆసభలో జరాసంధ వ్యాయామమండలి కార్యదర్శిగా కొండయ్యా చిన్న ఉపన్యాసం ఇచ్చాడు. అతను తడుముకుంటూ నట్టునట్టుగాను, చెప్పినమాటే చెపుతూను మాట్లాడాడు. ఒక్కొక్క వాక్యం పూర్తికావటం బ్రహ్మప్రళయంగా వుండేది. అతను చెప్పిన పది నిముషాల ఉపన్యాసంలో ఇరవై "అన్నమాటలు" వున్నాయ్! అయినా జనం నోరు మెదపలేదు. బహుశా అది అతను ప్రదర్శించిన కత్తిసాము యొక్క మహత్మ్యం అయివుంటుంది. అతను మాట్లాడుతూ నన్ను ఆకాశానికెత్తాడు. ఈ కత్తిసాము నాదగ్గరే నేర్చుకున్నానని కోశాడు! నేను యువకలోకానికి చంద్రునివంటి వాడననీ, నా చల్లనికిరణాలవలన యువకుల తపనను ఆపగలననీ అన్నాడు. గెలుపొందిన వారినీ, పొరుగూళ్ళ నుంచి వచ్చినవారినీ అభినందించాడు.

నేను బహుమతులు పంచిపెట్టాను. అందరూ భీమార్జునులవలె దృఢకాయులుగాను, శక్తివంతులుగానూ వుండటమేగాక వారివలె అన్యోన్యంగా గూడ వుండాలని చెప్పాను. భీముడిలోని భుజబలమూ, అర్జునుడిలోని బుద్ధిబలమూ మనం అలవరుచుకోవా లంటూ నా ఉపన్యాసం ముగించాను.

ఈ సంక్రాంతి ఆటలపోటీలవలన జనసామాన్యంలో కొండయ్యా, అతనివెనుక నేనూ జోరపడగలిగాము. కొండయ్యా నాగా లేకుండా ప్రతి రోజూ తాలింఖానాలో కసరత్తు చేసేవాడు. కోడిగుడ్లను జామపళ్లమాదిరిగా సునాయాసంగా పుచ్చుకొనేవాడు. ఇదిగాక ఉదయమూ సాయంకాలమూ సోలెడు బాదంపాలు పుచ్చుకుంటాడు. అతను నడుస్తుంటే నేల గుంటలుపడేది. అతని శరీరం నిగనిగలాడుతూ తోమిన రాగిచెంబులాగ ప్రకాశిస్తున్నది. అతన్ని చూస్తే చాలు ఇహ మా వంటిమీద ఎవరూ చెయి వెయ్యలేరని ధీమాగా వుండేది.

---

# 11. మొదటి మజిలీ

బంగాళాఖాతంలో వాయు గుండం ఏర్పడితే గనుక చెట్లను విరిచే గాలితోటీ, ముంచుకు వచ్చే మబ్బులతోటీ, గుండెలు అవిసే ఉరుములతోటీ కుంభవృష్టి ఆరంభమైనట్లు ప్రభుత్వంవారు ఉండుండి జారీచేసిన తాఖీదు ప్రకారం కేవలం ఒక్కమాసం వ్యవధితో మావూరిమీద పంచాయతీ ఎన్నికలు వచ్చిపడ్డయ్. ఊళ్లో ఈ శుభవార్త యుద్ధవార్త మాదిరిగా పాక్కిపోయింది. మనుషుల ముఖాలు చేటంత అయినయ్. బుర్రలు వేడెక్కినయ్. ఇద్దరిద్దరు మనుషులు ఒకచోట చేరి గుసగుస లారంభించారు. అందరూ చెవుల్లో మాట్లాడటం, ఆదరాబాదరాగా నడవటం, తలకాయ లెగరవేయటం, గడ్డంకింద చెయిపెట్టుకొని ఆలోచించటం ఆరంభించారు. పిలిస్తే పలకటానికి గూడ ఎవరికీ తీరిక లేకుండా పోయింది.

ఈ సందర్భంలో నామటుకు నేను ప్రేక్షకుడుగా వుండి ఆనందించాలనుకున్నాను. సుశీలారావు మాత్రం అందుకు సుముఖంగా లేడు. వివాహ సమయంలో పురోహితుడి మోస్తరుగా నానా అవస్థ పడుతున్నాడు. వాళ్ళతో మాట్లాడి, వీళ్ళతో మాట్లాడి, మధ్యలో మహాలింగంతో మంత్రాలోచన చేస్తూ, నాలుగైదు రోజులు పథక నిర్మాణంలోనే నిమగ్నుడైనాడు. ఆఖరుకు ఆరవనాటి ఉదయం కొండయ్యనూ, మహాలింగాన్నీ వెంటబెట్టుకొని నాగదిలో ప్రత్యక్షమైనాడు.

"ఏమో చెప్పాననుకోబోకు వెంకటప్పయ్యా! ఈ పంచాయితీ ఎన్నికలనేవి వూరియొక్క ఐదేళ్ల జాతకాన్ని నిర్ణయిస్తాయి. నిన్నటిదాకా పదవిలోవున్న రామిరెడ్డి గనుక గెలిస్తే ఇక వాడికి పట్టపగ్గా లుండవు. ఊరిని ఒక కొలిక్కి తీసుకొస్తాడు. ఊళ్లో ఖూనీలు చేయించి మాఫు చేయించగలడు. ఇష్టం కాని వాళ్లమీద వారంట్లు పుట్టించగలడు. ఇక పోతే ఆగోపాలరావు మంచివాడే. ముక్కుకు నూటిగా పోయేమనిషి. కాని అతనికి ఓట్లు పడవు. అతని కులస్థులు వందగడపకంటె లేరు. అతను ఓడటం ఖాయం. ఈపరిస్థితిలో నీవు తప్ప ఇంకో గత్యంతరం కనిపించటం లేదు. నీవు గనుక ముందుకొస్తే రంగారావు తగ్గుతాడు. మనకు ప్రజల్లో మంచి స్థానం వున్నది. మనం గోదాలోకి దిగుతున్నామని తెలిస్తే రామిరెడ్డి గూడ లంగోటా బిగించటానికి జంకవచ్చు. ఈ సమయం గనుక మనం వదులు

కుంటే ప్రజలకు అపకారం చేసిన వాళ్ల మవుతాం. ఇక నీయిష్టం"
అన్నాడు.

ఊళ్లో ఏ వీధిలోకి వెళ్లినా ప్రజలు రామిరెడ్డిని అసహ్యించుకుంటు న్నారనీ, వెంకటప్పయ్యగారు నిలబడతాడా అని అడుగుతున్నారనీ, మహాలింగం అన్నాడు. కొండయ్య నేనేమి చెపుతానోనని నావంక ఆశగా చూస్తున్నాడు. నాకు ఏమి చెప్పటానికీ పాలుపోవటం లేదు.

"అనుభవం లేనివాణ్ణి దిగితే ఏమవుతుందో" అన్నాను.

"దిగకపోతే అనుభవం రాదుగా!" అన్నాడు సుశీలారావు.

"మనం కుఱ్ఱవాళ్లం. మనకు ఓట్లెవరిస్తారు?"

"రామిరెడ్డిమీద ప్రజల కున్న అసహ్యమే మనబలం. అతన్ని ద్వేషించే వాళ్ళంతా మనకు ఓట్లిస్తారు."

"అయినా మనకేమంత పలుకుబడి వున్నది?"

"మనకు కాకపోతే ఎవరికున్నది పలుకుబడి? శతదినోత్సవంవల్ల నైతేనేమి, ఆటలపోటీలవల్ల నైతేనేమి మన పేరు వీధివీధినా ప్రతిధ్వనిస్తు న్నది... ఇంతకూ అసలు సంగతి చెప్పవేం? డబ్బుదగ్గర వెనకాడు తున్నావా?"

సుశీలారావు కీలెరిగినమనిషి!

"డబ్బుదగ్గర ఎన్నడూ సంకోచించను. సరేగాని అన్నిటికీ తగిన వాడవు నీవే నిలబడరాదా సుశీలారావ్?"

"నేను నిలబడితే ఓట్లు పడవుగా! కారణం తరువాత చెపుతా" నన్నాడు.

స్నేహితులమాట కాదనలేక, ఫలితం ఎటుపోయి ఎటు వస్తుందో ననే బెంగతో - మొదటిసారిగా చెరువులో స్నానం చేయటంకోసం వచ్చినవాడు తలను నీటిలో ముంచటానికి సంకోచిస్తూ, తోటివాళ్లు ఏమనుకుంటారోనని నరాలు బిగబట్టి ఒక్క మునుగు మునిగినట్లు - నేను పంచాయతీబోర్డు అధ్యక్ష ఎన్నికలలో పోటీ చేయటానికి అంగీకరించాను!

నేను నిలబడుతానసే వార్త - ప్రపంచయుద్ధంలో జపాను ప్రవే శించిందన్న వార్త మాదిరిగా - ఒక్కగంటలో తిమ్మాపురమంతటా

అలుముకున్నది. కాఫీహోటళ్లలోనూ, రీడింగురూముదగ్గరా, పార్కులో చెట్లకింద, ప్రతిఇద్దరు మనుషులు కలిసినచోటా నన్నుగురించే అనుకుంటున్నారు. రైలులో ప్రయాణీకుడు రైలు చప్పున ఆగంగానే వెనక్కు తూలినట్లుగా, రామిరెడ్డి నేను నిలబడుతానని తెలియంగానే ఆఁ! అన్నాడట. చాలామందికి నేను నిలబడటం ఆశ్చర్యం కలిగించింది. ఇక రామిరెడ్డి వ్యవహారం నల్లేరుమీద బండి పోయినట్లుగా కాక, పల్లేరుమీది నడక అవుతుందని ఎవరో అన్నారట.

గోపాలరావుగారిని సుశీలారావు చక్కగా వశీకరణం చేసుకున్నాడు. అసలు నిలబడటానికి ఆయనదగ్గర విటమిన్ యమ్. లోపించింది. దీన్ని సుశీలారావు గ్రహించాడు. నేనుగనుక ఎన్నికైతే గోపాలరావుగారిని ఉపాధ్యక్షుణ్ణిగా చేస్తాను అనేషరతుమీద ఆయనను మావైపు తిప్పించాడు. ఆయన నావైపు తిరగడం రామిరెడ్డికి మరొక షాక్ ఇచ్చింది. కుఱ్ఱసన్నాసులు వీళ్ళేం గెలుస్తారులే అన్నవాళ్లు గూడ ఇకనుంచి కొస్త వళ్లు దగ్గరుంచుకొని మాట్లాడవలసిన ఆగత్యం కల్గింది.

ఎన్నికలు దగ్గర పడుతున్నకొద్దీ మనస్సుల్లో ఉద్రేకాలు ఇనుమడించుతున్నాయి. సుశీలారావు ఓటర్లలిస్టులు తెప్పించి వాటిని శల్యపరీక్ష చేస్తున్నాడు. బహిరంగసభలు జరిపించి వాటిలో ఉపన్యసించవలసి వస్తుందేమోనని మొదట చాలా బెంగపడ్డాను. అలాంటి ప్రమాదం సంభవించలేదు. ఎన్నికలముందు జరిగిన ఉద్రేకాల సమయంలోని ముఖ్యఘట్టాలను అక్కడక్కడ పేర్కొంటాను :

"మన ఓటు ఎవరికి ?" అనే శీర్షికలో ఒక కరపత్రం వేయించి అడుగున నలుగురు పెద్దమనుషుల పేర్లు వేశాం. రామిరెడ్డి అంత ఆలోచన గలవాడు కాదు. "మీ ఓటు నాకే" అనే శీర్షికతో రామిరెడ్డి స్వయంగా కరపత్రం వేసుకున్నాడు. చివరి రోజువరకూ కరపత్రాలు రెండుముఠాల తరఫునా అచ్చవుతూనే వున్నాయి. మేము ఒక కరపత్రం ఈ క్రింది విధంగా వేశాం.

కరపత్రం నెం 4.

కాలు విరిగింది !

"అయ్యో ! భీమయ్యా ! కాలికి కట్టుకట్టావేం ?"

"ఏం చెప్పేది సోమయ్యా ! కాలు విరిగిందిగా ! హ్హ హ్హ హ్హ !"

"ఏడువకు భీమయ్యా! అయ్యో పాపం! ఎట్లావిరిగింది?"

"ఆఁ ఏముంది సోమయ్యా! మొన్నరాత్రి పొలంనుంచి ప్రొద్దుపోయి వస్తుంటే- కటిక చీకటిగా! కళ్ళుపొడుచుకున్నా దోవ కనిపించటంలేదు. వీధిలో దీపాలు లేకనేపోయె. అడుగడుగునా గుంటలూ మిట్టలూను. నీకు తెలియనిదేముందీ- ఒకగుంటలో పోయి పడ్డాను. కాలు విరిగి కూలబడి బాబో అని కేకపెడితే మా పాలేరువచ్చి బుజానవేసుకొని ఇంటికి చేర్చాడు... ఇదీసంగతి... నాలుగురోజులనుంచి ముట్టుకుంటే కాలేటువంటి జ్వరం... మూసినకన్ను తెరవకుంటూ పడివున్నాను... ఆఁ... నా ఖర్మ!"

"అదేమిటి భీమయ్యా! వీధిలో దీపాలు లేకపోవడానికి గుంటమిట్టలకీ నీఖర్మ ఎలా కారణమవుతుంది వేమయ్యా! మనం ఓట్లిచ్చి గెలిపించిన ఆ రామిరెడ్డి కారణం. ఇకముందైనా మనం బుద్ధికలిగి ప్రవర్తిస్తే అదే మందు."

"అంతేలే సోమయ్యా! బాగాచెప్పావు. కుఱ్ఱవాడైనా పెద్దబుద్ధి గలవాడు ఆ వెంకటప్పయ్యకే వోట్లిచ్చి గెలిపించటం శ్రేయస్కరం. రెండోకాలన్నా విరగకుండా ఉంటుంది!!"

ఓట్లు పడటం తరువాత సంగతిగాని ఈ కథను చదవటంకోసం గుంపులు గుంపులుగా జనం వచ్చి కరపత్రాలకోసం ఎగబడి మరీ తీసుకొని వెళ్ళారు.

ఎన్నికలు ఇంకో పదిరోజుల్లోకి వచ్చినయ్ అనంగా రాత్రిరెండు గంటలప్పుడు అవతల ముఠావాళ్లు గోపాలరావుగారి గొడ్లసావిడికి నిప్పంటించారు. రెండువైపులనుంచి ముట్టించటంవల్ల కళ్లు మూసి కళ్లు తెరిచేలోగా పని అయిపోయింది. నలుగురూ పరుగెత్తుకుంటూ వచ్చి కాలిపోయిన వాటిని ఆర్పివేశారు. దీంతో వూళ్లో పెద్ద కలకలం బయలుదేరింది. ఎవరిఇల్లు ఎప్పుడు లేస్తుందో ఎవరూ చెప్పలేకుండా వున్నారు. జనం పగలు నిద్రపోయి రాత్రి కాపలాలు కాచుకోటం ఆరంభించారు. సాయంకాలం ఆరుగంటలకల్లా భోజనాలు గూడ పూర్తిచేస్తున్నారు. సరేనని కొండయ్య ఉన్నట్లుండి రామిరెడ్డి బావమరదిగారి 12 ఎకరాల గడ్డివామికి నాలుగువైపులా నాలుగు అగ్గిపుల్లలు గీచి నాలుగుసీసాల కిరసిన్ నూనె చిలకరించి వచ్చేడు. కుక్కకాటికి చెప్పుదెబ్బ కొట్టినట్లయింది. రామిరెడ్డి ఆట

కట్టింది. ఎవరూ ఎవరి గడ్డివామినీ తగులబెట్టగూడదని ఒక మధ్యవర్తి చేత "నిర్యుద్ధ ఒడంబడిక"ను పంపించాడు. సుశీలారావు అంగీకారం తెలిపి పంపివేశాడు. అంతటితో మనుషుల గుండెల్లో దడ కొస్త తగ్గింది.

ఎన్నికలు దగ్గరికొస్తునకొద్దీ కాళ్ళతిప్పట ఎక్కువయింది. సుశీలారావు నన్నుకూచోబెట్టి ధోవతి కట్టుకోవడమూ, ఉత్తరీయం వేసుకోవడమూ నేర్పాడు. ఇద్దరమూకలిసి పెద్దపెద్ద వాళ్ళ అందరిఇళ్ళకూ వెళ్లాము. నేను నమస్కారం చేసి నిలబడేవాణ్ణి. చెప్పవలసిందంతా సుశీలారావు చెప్పేవాడు. ఒక పది పదిహేను ఇళ్లకు పోయేసరికి నేను కట్టుకున్న ధోవతి అదే కొత్తకావటంచేత ముబ్బ విడిపోయినట్లు జారిపోయే ప్రమాదం తగలటం వలన గుట్టు చప్పిడి కాకుండా ఇంటికి చేరాను.

రైతులు, వ్యవసాయకూలీలు, చేనేతపనివారూ నివసించే పేటల్లో కొండయ్యా మహాలింగంలు మరి నలుగురిని వెంటతీసుకొని ప్రచారకార్యక్రమం ఆరంభించారు. వెంకటప్పయ్యగారికే మీవోటివ్వమని ఇంటింటికీ వెళ్ళి మహాలింగం చెప్పేవాడు. కొండయ్యా వెళ్ళివస్తామండీ అని చెపుతూ మీసం తిప్పుచూ వెలుపలికి వచ్చేవాడు! అసలు పైల్మాన్ కొండయ్యను చూడటంకోసమే వీధుల్లో జనం గుమిగూడేవాళ్లు.

సుశీలారావు బుద్ధి అందరికంటె అమోఘంగా పనిచేసింది. ఎల్లుండి ఎన్నికలు అనగా ఇవ్వాళ్టిరోజున బాగా ముసురు పట్టి జల్లు పడింది. దేశంలో చాలా వూళ్లలో వర్షం పడిందని రేడియోలో చెప్పారు. సుశీలారావునోట్లో నీళ్ళూరినయ్. సుశీలారావు స్వయంగా వెళ్ళి 50 టెలిగ్రాం కాగితాలు తెచ్చాడు ఇంట్లో దాచిపెట్టి వుంచినవి. మావూరి ఓటర్లలో వందా రెండొందలమంది నెల్లూరు, విజయవాడల్లాంటి దూరపు వూళ్ళలో ఉద్యోగాలూ అవీ చేస్తూవున్నారు. అలాంటి వాళ్ళలో నికరంగా రామిరెడ్డి ముఠాకు చెంది ఎన్నికలకు ఖాయంగా వచ్చేవాళ్ళలో ఒక యాభై మందికి "గాలివానలవల్ల ఎన్నికలు వాయిదాపడ్డయ్. రావద్దు." అని రామిరెడ్డి పేరుతో టెలిగ్రాము లిచ్చాడు. మావూళ్ళో టెలిగ్రాం ఆఫీసు లేదు. 10 మైళ్ళదూరంలో వున్న టెలిగ్రాం ఆఫీసుకు వెళ్ళి టెలిగ్రాములిచ్చి వచ్చాడు.

ఈ సంగతి నరమానవుడికి తెలియదు. ఎన్నికలనాడు పొరుగూళ్ల నుంచి రావలసిన జనం ఇంకారాలేదే, ఇంకారాలేదే అని రామిరెడ్డి దారులు

చూస్తూ నేవున్నాడు. చివరకు విసిగిపోయి రాని వాళ్ళందరికీ శాపనార్థాలు పెడుతూ ఎన్నికలు జరిగే సత్రం దగ్గరకు వచ్చాడు.

ఎన్నికల ఆఫీసరు వచ్చాడు. స్త్రీలనూ పురుషులనూ వేరు వేరుగా వరుసల్లో కూచోబెట్టాడు. వస్తూవస్తున్న ఓటర్ల వంక చూస్తూ కొండయ్య మీసాలు దువ్వుతూ కళ్లు తిప్పుతూ నిలబడ్డాడు. ఎన్నికల ఆఫీసరు అసలు మునసబుగారింట్లో బసచేశాడని తెలిసి సుశీలారావు పత్రికా విలేఖరి హోదాతో ఆనాడు తెల్లవారంగానే మున్సబుగారింటికి వెళ్ళి, ఆయనతో పాటు కాఫీపుచ్చుకొని, ఇంగ్లీషులో నాలుగు మంచిమాటలు మాట్లాడి వచ్చాడు. ఎన్నికల సమయంలో సుశీలారావు ఒక తోలుసంచి చంకలో పెట్టుకొని ఆఫీసరు వెంబడి పచార్లు చేస్తూ ఆయనకు అయాచిత సలహా లివ్వటం ఆరంభించాడు !

ఎన్నికలు చేతులెత్తటంద్వారా జరిగినయ్. రామిరెడ్డికి 610 ఓట్లు, నాకు 650 ఓట్లు వచ్చినయ్ ! రామిరెడ్డి ముఖం వాడిపోయి వాలి పోయింది; "ఛీ! కుట్ర కుంకలొచ్చి వోడించారు" అని అన్నాడట. నెత్తిన గుడ్డ కప్పుకొని ఎవరి కంటికీ కనబడనట్లుగా ఇంటికి చేరాడు.

కొండయ్య ఎగిరి గంతువేశాడు. ఉత్సాహం పట్టలేక అన్నివందల మంది జనం చూస్తూవుండగా రెండుచేతులతో తళతళ మెరసే రెండు ఖడ్గాలు పుచ్చుకొని అరగంటసేపు అపూర్వమైన కత్తిసాము చేసి వహ్వా అనిపించాడు.

మరొక చిత్రమైన సంగతి. రామిరెడ్డి తాను గెలుస్తానన్నే దృఢ విశ్వాసంతో ఒక బ్యాండు మేళాన్నీ, ఒక స్వారి గుఱ్ఱాన్నీ ముందుగానే ఆర్డరిచ్చి తెప్పించాడు. సగం డబ్బు అడ్వాన్సుగా కూడా ఇచ్చాడు. ఆ మేళగాళ్లు సుశీలారావును కలుసుకొని మిగతా సగం డబ్బు గనుక మేమిచ్చుకుంటే ఊరేగింపు చేస్తామని మనవిచేసు కున్నారు. అప్రయత్నంగా వచ్చిన గౌరవాన్ని జారవిడవకూడ దని భావించి సరే నన్నాము. నేను గుఱ్ఱం ఎక్కాను. నాకు ఒక ప్రక్కన సుశీలారావు గోపాలరావుగార్లు, మరొక ప్రక్క కొండయ్య, మహాలింగ ములు, రాజువెంట దండనాథులు వెడలినట్లు, సాగి వచ్చారు. ముందు బ్యాండుమేళం చెవులు చిల్లులుపడేటట్లుగా వాయిస్తున్నారు. ఒక్కొక్క

ఇంటిదగ్గరే పెద్ద మనుషులు వచ్చి నాకు కరచాలనం చేస్తున్నారు. కొందరు పూలదండలు వేస్తున్నారు. మోయటం కష్టంగావున్నది. వళ్లంతా చెమట కారిపోతున్నది. నాలుగు బజార్లూ తిరిగాం. రామిరెడ్డి ఇంటిముందు నిలబడి, ఆయన ఇంట్లో క్రిమికీటకాలకుగూడ వినబడేటట్లు తనివితీర బ్యాండు వాయించారు. మధ్యాహ్నం ఒంటిగంటకు ఇల్లుచేరాం.

నేను ఇంటికి చేరింతర్వాత పూలదండలన్నీ తీసి సుశీలారావు మెడలో వేయబోయాను. సుశీలారావు నా బుజంమీద చేయి వేస్తూ టెలిగ్రాము లివ్వకపోతే కథ అడ్డం తిరిగేది అని నవ్వుతూ అన్నాడు!

## 12. ప్రెసిండెంటు గిరి

అధ్యక్షపదవికి ఎన్నికైనప్పటికంటె నాఫొటో దినపత్రికలో ప్రచురించబడ్డనాడు నాకు మహదానందం కలిగింది. ఇహ నేను పెద్ద పెద్ద వాళ్లలో జమ కాబోలు ననుకున్నాను. ఇదే రోజున నాఫొటోను కొన్ని వేలమంది చూస్తారు కావాలి అనుకొని మురిసిపోయాను. నాఫొటోను నేను ఏడెనిమిదిసార్లు చూసుకున్నాను. మా ఆవిడకుగూడ చూపించాను. "ఫోటోలో మరింత బాగున్నారే" అన్నది. నాకూ అలాగే అనిపించింది. అద్దంలోకంటె ఫొటోలోనే బాగున్నాను. ఐదేళ్ల క్రిందటతీసిన ఫొటోలో బాగుండకేంచేస్తాను?

గోపాలరావుగారిని పంచాయతీబోర్డు ఉపాధ్యక్షుడుగా నియమించాను. ఆయన ఏనుగునెక్కినంత సంతోషపడ్డాడు. నాకు ముఖాముఖమూ తెలియదుగనుక సుశీలారావును కార్యదర్శిగా వుండి వ్యవహారం నడపమన్నాను. అతను మహాఋషి పోజులో కూచొని "నాకీపదవులూ పాడూ వద్దు. తామరాకుమీద నీటిబొట్టుమోస్తరుగా వుంటాను. అవసరమైతే సూచనలుమాత్రం చేస్తుంటాను. మన మహాలింగాన్ని కార్యదర్శిగా వేసుకో శేషుగ్గావుంటుంది" అన్నాడు. మహాలింగంకూడ కాస్త చెయితిరిగినవాడే. జుట్టు జుట్టు ముడివేయగలడు. అతన్నే నియమించాను.

రోజులు గడుస్తున్నయ్. కాగితాలమీద సంతకాలు పెడుతూనే వున్నాను. టీపార్టీలకు వెళుతూనే వున్నాను. సభలకూ, సమావేశాలకూ హాజరవుతూ వున్నాను. క్రొత్తలో న్యాయమూ, అన్యాయమూ అని ఆలోచించేవాడిని అంటే అర్థం చెఫుతాను. "నావాళ్ళు," "పరాయివాళ్ళు" అని రెండు లింగాలకింద జనం కనుపించేవారు. నావాళ్ళకే నేను ఏదీ ఒలికించకూడదనీ, జనబాహుళ్యంకోసం శ్రమించాలనీ మొదట్లో అనుకొనే వాడిని. "చాద స్తపు పోకడలు పోకు" అని సుశీలారావు అదిలిస్తుండేవాడు! "నిన్ను పెద్దనుచేసి, నీకోసం రాత్రింబవళ్ళు కాలికి బలపం కట్టుకొని తిరిగి, నీగెలుపుకోసం కృషిచేసినవాళ్ళను నీవు తృప్తిపరచకపోతే అది కృతఘ్నత అవుతుందా కాదా" అని సుశీలారావు నిలదీసి అడిగాడు. ఆలోచించినట్లు ఆలోచించి అవునన్నాను. "మరి వాళ్ళకోరికలు ఈడేర్చు" అన్నాడు.

"మరి అయితే నాకు వ్యతిరేకంగా ఓటుచేసినవాళ్లుమాత్రం పౌరులు కారా? వాళ్ళకోర్కెలు తీర్చవద్దా?" అన్నాను అమాయకంగా.

"వెంకటప్పయ్యా! ఇది ప్రజాస్వామ్యయుగం. ప్రజాస్వామ్య యుగంలో ప్రజాసేవ అంటే అధికసంఖ్యాకులకుచేసే సేవఅని అర్థం. ఇప్పుడు మనం ఎన్నికల్లో గెలిచాం. మనవాళ్లు అధికసంఖ్యాకులు. వారికి సేవచేయటమే ప్రజాసేవ అవుతుంది. పోనీ అవతలిపార్టీవాళ్ళకు సేవ చేస్తానంటావా? వాళ్లు అల్పసంఖ్యాకులుగదా! వాళ్ళకు సేవచేస్తే అధిక సంఖ్యాకులు అసంతృప్తి చెందుతారుగదా. అదితప్పు. అదిపద్ధతికాదు. కనుక అధిక సంఖ్యాకులైన నీవాళ్ళకు నీవు సేవచేయటమే ధర్మం" అన్నాడు.

సుశీలారావుచెప్పిన వ్యాఖ్యానం నాకు నచ్చేటట్లు చేసుకున్నాను. రోజులు గడచినకొద్దీ నా మనస్సు ఘనీభవిస్తున్నట్లు కనపడింది. ప్రజాసేవ అనేదానికి మా అమ్మగారుచెప్పినట్లు పదిమంది తోటిమనుషుల పెదిమలమీద చిరునవ్వు ఒలికించే చర్య అనే నిర్వచనం నా మనస్సులో మెదలుతూనే వున్నది. నా మెడలో పడిన పూలదండలూ అవ్వీ గుర్తుకు తెచ్చుకుంటే నేనుచేస్తున్న ప్రజాసేవ నా పెదిమిలమీధనే చిరునవ్వు చిందించే చర్య అయిపోయింది!...ఎటొచ్చీ సుశీలారావు! అన్నట్లు అధిక సంఖ్యాకులకోసం చేసే సేవను ప్రజాసేవ అని అందామని అనుకున్నాను!

పంచాయితీబోర్డుతరఫున వేలంపాటలు వేయవలసి వచ్చింది. కొండయ్య మేనమామకొడుకు పోలయ్య ఒకడున్నాడు. వాడిపేరుతో

చేపలు పట్టుకోడానికి, కాలవగట్టున గడ్డికోసుకోడానికీ చాకలో పాట కొట్టివేశాను. మహాలింగం పెదనాన్నగారి అల్లుడి తమ్ముడు ప్రసాదరావు ఒకడున్నాడు. అతను రెండుమూడుసార్లు స్కూలుఫైనలు పరీక్షకు పోయి తడవకు రెండుమూడు సబ్జక్టుల్లో ప్యాసయ్యేవాడు. అన్నీ ఒక్కసారే ప్యాసుకావటం కుదరదని ఊరుకున్నాడు. అతన్ని పంచాయతీ బోర్డులో గుమాస్తాగా నియమించి నెలకు 80 రూపాయ లిస్తున్నాను. అంతకంటే మరీ ఎక్కువగా ఇస్తే బాగుండదని వూరుకున్నారు. ఇతనుగాక ఇదివరకు ఎన్నికలప్పుడు మావైపున బాగా హైరానుపడి కొండయ్యకు కుడిభుజంగా వున్నటువంటి వీరయ్యను పంచాయతీబోర్డు జవానుగా నియమించి మెడలో ఒక డవాల్ వేశాం. మహాలింగం ఇంటి ముందరిగదిలో పంచాయతీఆఫీసు ఏర్పాటుచేసి వెలుపల ఒకబోర్డు చెక్కించిపెట్టాం. ఆఫీసుకు అద్దెక్రింద నెలకు పదిరూపాయలు మహాలింగానికి ముట్టచెబుతున్నాను. పదిరూపాయల అద్దె మరీ ఎక్కువ కాదు లెమ్మని అనిపించింది.

సుశీలారావు ప్రోత్సాహం వలన మహాలింగం కంట్రాక్టరుగా పని చేయటం ఆరంభించాడు. లాభాలుచెరిసగం అనేప్రాతిపదికమీద గోపాలరావుగారు పొలమమ్మి మూడువేలు తెచ్చి పెట్టుబడిపెట్టాడు. మహాలింగం భార్యమెడలో నగలు తాకట్టుపెట్టి స్వయంగా వెయ్యిరూపాయలు సమకూర్చుకున్నాడు. మావూరి పంచాయతీబోర్డు పనులన్నీ మహాలింగానికి వప్పగించాం.

మావూరిముందరి పంటకాలువకు వంతెన కట్టించవలసి వచ్చింది. కంట్రాక్టరు మహాలింగానికి పని వప్పగించాం. అతను సూపరింటెంగు ఇంజనీరుదగ్గరకుపోయి విదువందలు చేతులోపెట్టి ఆరువేలరూపాయలకు ఎస్టిమేషన్‌మీద సంతకాలు చేయించుకొనివచ్చాడు. వంతెన పూర్తి అయిన తర్వాత మహాలింగం నా చెవులో వూదాడు; వంతెనకు అయిన ఖర్చు మూడువేలు మాత్రమేననీ,అందుచేత నికరలాభం రు 2500 అనీ!......నాకు మహాలింగం ఒకచేతి గడియారం బహూకరించి నాపాతరిస్టువాచి తాను పుచ్చుకున్నాడు. ఇందులోకూడ అతను నికరంగాచేసిన కర్చు 40 రూపాయలుంటుందేమో! నాకు గడియారం బహూకరించాననే సంతృప్తి అతని కున్నది; తనచేతికి సరిగా నడుస్తున్న వాచీ వచ్చింది. భేష్ అనుకున్నాను.

ప్రాణంవున్న మనుషులు ఇవ్వాళవుండి రేపుపోతారుగాని ప్రాణం లేనిరాళ్లే ఎల్లకాలం వుంటయ్. అందుచేత ఒకచదునైన తెల్లని రాతిమీద మా పంచాయతీబోర్డు సభ్యుల అందరి పేర్లూ ఇంటిపేర్లతో సహా చెక్కించి ఆ వంతెన ముందర నాటించాం. ఇప్పటికీ మా సభ్యులు చాలామంది రోజూ చెంబుపుచ్చుకొని వూరివెలుపలికి పోయినపుడు వంతెనదాకా వెళ్లి ఎవరిపేర్లువాళ్లు చూచుకొనిరావటం దైనందిన కార్యక్రమంగా పెట్టుకున్నారు.

స్థానిక పరిపాలనా శాఖా మంత్రిగారు ఏవూరునుంచో వస్తూ మా వూరిమీదుగా ఏదో వూరు వెళుతున్నారుగనుక వారి భక్తకోటికిచెందినమేము వారిని సందర్శించి ఉచితమైన మర్యాదలు చేయవచ్చునని పంచాయతీల మీద అజ్మాయిషీ చేసే ఆఫీసరుగారి నుంచి ఒక లేఖ వచ్చింది. అయితే ఆనాడు వారికి పూలమాలలు వేసి పసందైన భోజనమూ, ఫలహారమూ ఏర్పాటుచేసి నమస్కారం చేద్దామని నేననుకున్నాను. సుశీలారావు నా మాటకు నవ్వి "మహానైవేద్యమూ అవసరనైవేద్యమూ సమర్పిస్తేచాలు ననుకుంటున్నావ్? ఈ మాత్రపు నైవేద్యం పట్నంలో దొరక్కనేనా ఆయన ఇటు వేంచెయ్యటం?" అని అడిగాడు.

నేను అడగటం కోసం ఆగకుండా సుశీలారావే చెప్పుకుపోతున్నాడు. "ప్రజలచేత ఎన్నుకోబడినవారు కావడంవల్ల ప్రజలదగ్గరకు అడపాతడపా వెళ్లుతారు. ప్రజలలో తమకు పలుకుబడి, చెలామణి వున్నట్లు తృప్తిచెందటంకోసం ఈ పర్యటనలు చేస్తారు. అందుకు అనుగుణ్యమైన కార్యకలాపాలు మనం ఏర్పాటుచేయవలసి వుంటుంది" అన్నాడు. సుశీలారావు సూచనలప్రకారం ఆనాటి సాయంకాలం తిమ్మాపురంలో బ్రహ్మాండమైన బహిరంగసభ ఏర్పాటు చేయబోతున్నామనీ, ఆ సభలో తాము ఉపన్యసించవలసిందనీ మంత్రిగారికి ఒక వినయ విధేయతలతో గూడిన లేఖ వ్రాసి పంపాము. మా మనవిని సంతోషంగా అంగీకరించామని శ్రీవారినుండి మూడోనాటికల్లా జవాబు వచ్చింది.

మంత్రిఅంతటివాడు రావటం మావూరిచరిత్రలో అదే మొదటిసారి. "మంత్రిగారికి ఊపిరిసలుపుకోటానికిగూడా తీరిక లేకపోయినప్పటికీ వెంకటప్పయ్యగారు ఘాటుగా వ్రాసి పిలిపించబట్టి ఆయన వస్తున్నారుసుమా" అని కొండయ్యప్రభృతులు కనపడ్డవారికల్లా చెప్పారు. రామి

రెడ్డి పదిసంవత్సరాలనుంచి ప్రెసిడెంటుగిరిలోవుంటే ఒక్క మంత్రిగాని వచ్చాడా అనికూడా అన్నారు. "అవునుబాబూ అవును. యన్టీ రంగారా వంతటివాణ్ణి రప్పించగలవాడు మంత్రిగార్ని మటుకు రప్పించలేకపోతాడా? వయస్సు చిన్నదైనా మనస్సు పెద్దదే" అని ముక్కుమీద వేలు వేసుకున్నారు మనుషులు.

హైస్కూలు ఆటస్థలంలో వారంరోజులు కూలీలనుపెట్టి పందిళ్ళు వేయించాం. పట్నంనుంచి మైకు తెప్పించాం. హైస్కూలునుంచి బెంచీలు తెప్పించి వేయించాం. మేం పిలిపించకుండానే పోలీసులువచ్చి కాపలా కాశారు. మా హైస్కూలు తెలుగుపండితుడుగారిచేత మంత్రిగారినిగూర్చి చక్కనిపద్యాలు వ్రాయించాం. సాయంకాలంపూట శివాలయంలో కూచొని ఆయన రమ్యంగా పురాణకాలక్షేపం చేస్తూవుంటారు. అదే ఫణితిలో ఆయన తాను రచించిన ప్రశంసాపద్యాలను సభలో రాగయుక్తంగా చదివి సభికులను ఆనందింపజేశాడు. ఆ పద్యాలలో ఒకదాన్ని ఇక్కడ పొందుపరుస్తున్నాను—

సీ. అలనాడు రఘురాము నడుగులస్పర్శచే
జడమైన శిలలోన జవముకలిగె!
ఈ రోజు ఓమంత్రి నీరాక చేతనే
తిమ్మాపురంబులో తేటకలిగె!
అలనాటి భోజుని యాననంబునుగాంచి
అజ్ఞాని సుజ్ఞాని ఆయెనయ్య
విమలాత్మ! తమ దర్శనము చేసినంతనే
మా ప్రజ కష్టాలు మరచిపోయె!
మాదు లోకలుబోర్డుల మంత్రివర్య!
భవ్యగుణ భూష వికసిత దివ్యవేష
అందుకొనుమోయి మేమిచ్చుస్వాగతంబు
కాచుగావుత మిము నీలకంఠుడెపుడు."

మా సుశీలారావుచేత ఒక స్వాగతపత్రం వ్రాయించి మా పంచాయతీబోర్డుతరఫున సమర్పించాం. దానిని మహాసభలో నేనే చదవవలసిన ప్రమాదం ఏర్పడుతుందేమోనని చాలా భయపడ్డాను. కాని ఆనాడు

గజేంద్రుణ్ణి శ్రీకృష్ణుడువచ్చి ఆదుకున్నట్లు ఈనాడు గోపాలరావుగారు సమయానికి వచ్చి సహాయపడ్డారు. అందులో మంత్రిగారు స్థానిక సంస్థలకు అపూర్వమైన సేవ చేస్తున్నారనీ, వారి వెనుక మావూరి ప్రజలంతా నిలబడి వున్నారనీ హామీ ఇచ్చాం. మావూరుగుండా ఒక కంకరరోడ్డు వేయించి దానిమీద టంగుటూరునుంచి మావూరిమీదుగా లాల్పురము వరకు బస్సు వేయించాలనీ, మావూరికి ఎలెక్ట్రిసిటీ ఇప్పించవలసిందనీ కోరాం. ఎలక్ట్రిసిటీగనుక వస్తే మావూళ్ళో పళ్ళతోటలూ అవీ వేయవచ్చుననిగూడ వ్రాశాం.

ముందుగా సుశీలారావు మంత్రిగారిచెవులో ఏదో వూదాడు. తరువాత మంత్రిగారు ముచ్చటిస్తూ మా కోరికలు చాలా న్యాయంగా కనిపిస్తున్నాయనీ, తనచేతులో వున్నంతవరకు చేస్తాననీ అన్నారు. కొండయ్య ఆధ్వర్యాన సభికులు మంత్రిగారి ఉపన్యాసంలో ప్రతివాక్యం చివరా హర్షధ్వానాలు చేశారు. సభ జయప్రదంగా ముగిసింది. మంత్రిగారు పూలదండలు చేత్తో పుచ్చుకొని కారులో వెళ్ళి పోయారు.

మరునాడు "ఐతే సుశీలారావ్! మనవూరికి కంకరరోడ్డు, ఎలెక్ట్రిసిటీ వస్తయ్యంటావా? అని అడిగాను.

"కంకరరోడ్డు వస్తుంది. ఎలెక్ట్రిసిటీ మాత్రం రాదు." అన్నాడు.

"మరి అయితే నీవు ఇంత హంగామా ఎందుకు చేయించావ్?" అన్నాను.

"ప్రజలు హంగామాతో తృప్తిపడతారు. పని జరక్కపోయినా అంతగా పట్టించుకోరు.... ఇకనుంచి ప్రజలు మంత్రిగారు ఏదో చేస్తారని ఆశపడుతూ వుంటారు గాని నిన్ను చెయ్యమని వేధించరు. ఇదీ లాభమేగదా" అన్నాడు.

లోకం పోకడ ఇట్లావుంటుంది కాబోలు ననుకున్నాను.



# 13. క్షేత్రగ్రహం

మా తిమ్మాపురం ఫిర్కాలో వెంగళాయపాలెం అనే ప్రఖ్యాతి చెందిన గ్రామం ఒకటి వున్నది. అక్కడ నిజంచెప్పాలంటే దమయంతి అనే ఒక నాజూకు తెలిసిన యువతివల్లన ఒక ఏకాంత సమరం జరిగింది. ఆవూరిలో ఇద్దరు పురప్రముఖులు ఒకరికి తెలియకుండా ఒకరు ఆమె యొక్క కటాక్ష వీక్షణాలకోసం తంటాలుపడుతున్నారు. సమయంకోసం వేచివున్నారు. ఒకనాటి అర్ధరాత్రి ఆమె భర్త గ్రామాంతరం వెళ్లినపుడు ఆయిద్దరు పెద్దమనుషులూ ఘుమఘుమలాడుకుంటూ ఆ యింట్లో ప్రవేశించారు. వస్తూవస్తూనే ఒక మోతాదు తాటిపానీయంగూడ పుచ్చుకొని మరీ వచ్చారు. ఇద్దరూ పంచ పాళీలో తారసిల్లారు. ఒకరిమీద ఒకరు అసూయచెందారు. ఒకరు దుడ్డుకర్రా, మరొకరు రోకలీ పుచ్చుకొని భీమ బకాసురుల మోస్తరుగా కలియబడ్డారు. దమయంతీదేవి మోహినీదేవి లాగ నిలబడి చూస్తున్నది.

ఇది ఇలాఉండగా ఇలా జరుగబోతుందని ముందుగా ఆఘ్రాణించిన ఆవూరిలోని ఒక సామాన్యుడు ఆయువతియొక్క భర్తఅయిన లింగయ్యపోయినవూరికి ఆనాటి సాయంకాలమే వెళ్లి జరుగనున్న ప్రమాదాన్ని చూచాయగా చెప్పి అతన్ని అర్ధరాత్రివేళ వెంగళాయపాలెం తీసుకొని వచ్చాడు. మన వీరు లిద్దరూ కలహించుకొనే సమయానికి అతను దొడ్డిగుమ్మంగుండా ఇంట్లో ప్రవేశించి ఒక బల్లెం పుచ్చుకొని వచ్చి ఆ యిద్దరిమీదకీ బలంకొద్దీ విసిరాడు. ఆకస్మికంగా ప్రవేశించిన ఈ మూడోవ్యక్తిని చూచి వాళ్లిద్దరూ కంగారుపడి ప్రక్కకు తప్పుకున్నారు. ఆ బల్లెంవెళ్లి అక్కడే నిలబడివున్న దమయంతీదేవి వక్షస్థలంలో దిగిపోయింది. ఆమె కెవ్వున కేకవేసి నేలకొరిగింది.

ఇంతలో చుట్టుపక్కలవాళ్ళంతా వచ్చారు. వూరిపీడ విరగడైంది అనుకున్నారు. మరునాడు లాఠీలు తిప్పుకుంటూ పోలీసులు వచ్చారు. ఒక ఖూనీ జరిగితే చాలు, పోలీసుల కడుపు నిండుతుంది. ఎంతమందిని కేసులో ఇరికించ వచ్చునో అంతమందినీ ఇరికించారు. దమయంతి కోసం వచ్చిన ఇద్దరు యువకులూ ఒకరిమీద ఒకరు ఈర్ష్యతో చివరకు ఆమె నే

చంపివేశారని ప్రాసిక్యూషన్‌లో వ్రాశారు. ఆమెభర్త ఆనాడు గ్రామంలో లేడనీ, ఆయన వచ్చే సరికి దమయంతి చంపబడి వున్నదనీ వ్రాశారు.

ఆయిద్దరిలో ఒకడైన పుల్లయ్య ఆవూరి మునసబు. పైగా గొట్టాల వ్యవసాయం వున్నది. అతనిచేతిలో చక్రంవున్నది. కొన్నివందల రూపాయలు గ్రామస్తులకు అప్పులిచ్చి అందరినీ తన చెప్పుక్రింద తేళ్ళు లాగ వుంచుకోగలిగాడు. ఇప్పుడు వచ్చిన ఖూనీ కేసు ఒక లెఖ్ఖలోది కాదు. ఒకవెయ్యిరూపాయలు తనవి కావనుకుంటే గాలికి కొట్టుకొని పోతుంది. ఐతే కథ వ్యతిరేకమయింది. దమయంతి భర్త అయిన లింగయ్య, ఖూనీచేసినది తానేగనుక, ముందుగానే జాగ్రత్త పడ్డాడు. ఒక 500 పోలీసులకు సమర్పించి నమస్కారం చేశాడు. ఆమెభర్త ఆమెను చంపటం అసంభవమనీ, చంపవలసిన అగత్యం లేదనీ,తర్కయుతంగా వ్రాసుకున్నారు. హత్యకు ఎవరో ఒక కర్తవుండాలి గనుక దాన్ని పుల్లయ్యమీద పెట్టే శారు.

తాను హత్య చేయకుండా నేరం తనమీదికి రావడం పుల్లయ్యకు చాల విషాదం కలిగించింది. చెయ్యని నేరంనుంచి తప్పుకోటానికి పోలీసులకు లంచమివ్వటంగూడ చాల కృత్రిమంగా తోచింది. సుశీలారావు పోలీసులయొక్క గురుస్థానంలో వున్నాడని ఆనోట ఆనోట విని పుల్లయ్య నాదగ్గరికి వచ్చాడు. జరిగినదంతా పూసగుచ్చినట్లు చెప్పి ఎలాగైనా శిక్ష పడకుండా చేయాలని ప్రాధేయపడ్డాడు. నేనతన్ని సుశీలారావు దగ్గరకు తీసుకొనివెళ్ళి వప్పగించాను.

సుశీలారావు ఎగిరి గంతువేశాడు. పుల్లయ్యగనుక మనవాడైతే ఇహ ఫిర్కాలో మనమాటకు ఎదురుండదని అతనినమ్మకం. నేనూ సుశీలారావూ కలిసి సర్కిల్ ఇన్‌స్పెక్టరు ఇంటికి పోయాం, అతను మాకు ఫలహారమూ కాఫీ ఇప్పించి "మళ్ళీ మా పోలీసులమీద ఏమైనా నేరాలు తీసుకొచ్చారా సుశీలారావుగారూ?" అన్నాడు నవ్వుతూ.

"అయ్యో! మనం మనం తోడుతోడుగా వుండవలసినవాళ్ళం తప్పులెన్నుకుంటామటండీ!" అని సుశీలారావు అన్నాడు. ముగ్గురమూ కాసేపు లోకాభిరామాయణం మాట్లాడుకున్నాము. అమెరికాదేశంలో జరిగే దొంగతనాలను గురించి సర్కిల్ ఇన్‌స్పెక్టరుగారు చిత్రవిచిత్రమైన సంగతులు చెప్పాడు.

సుశీలారావు నిదానంగా వెంగళాయపాలెం ఖూనీకేసు గురించి ప్రస్తావించాడు. జరిగిన కథంతా ఉన్నదున్నట్లు చెప్పివేశాడు. హాత్య చేసినవాడు పుల్లయ్య కాడు గనుక అతన్ని ఎలాగయినా సరే నేరం నుంచి తప్పించాలని మనవి చేశాడు. సర్కిల్ అంతా విని "మీరు చెప్పింది సమంజసంగానే వుంది. కాని ఆదమయంతి చచ్చిపోయింది గద. ఆ మరణానికి కారణం ఎవరిమీద మోపాలో చెప్పండి" అని అడిగాడు.

లాయరు తన వాదాన్ని సిద్ధం చేసుకొని వచ్చినట్లు సుశీలారావు దగ్గర ఈ ట్రాజెడీకి మరొక చక్కని కథ రెడీగావుంది.

"పుల్లయ్య ఒకనెలరోజుల్లో తన కొడుక్కి పెళ్లి చెయ్యబోతు న్నాడు. ఆపెళ్లికి లింగయ్యను ఆహ్వానిద్దామనీ, మనకు డబ్బు సహాయం చేస్తాడేమో అడుగుదామనీ వెంకయ్యను తోడు తీసుకొని రాత్రి భోజనా నంతరం సిగరెట్ కాల్చుకుంటూ లింగయ్యగారింటికి వచ్చాడు. అప్పుడే దమయంతి గేదెలకు గడ్డివేయాలని సావిడిలోకి వెళ్లింది. భర్త కోర్టు పని మీద టంగుటూరు వెళ్లాడని చెప్పింది. చీకట్లో మచ్చుమీదవున్న జనప కట్టెలను బలంగా కిందికి లాగింది గేదెకు వేద్దామని. ఆ జనపకట్టెల ప్రక్కనే పలుగు గూడా పెట్టబడి వుండటం వలన అది గూడ నిటారుగా కిందికి జారి దమయంతి గుండెల్లోకుండా దూసుకొని పోయింది. పుణ్యా నికి పోతే పాపమెదురయిందనుకొని పుల్లయ్య వెళ్లి ఇరుగుపొరుగువాళ్లను పిలుచుకొని వచ్చాడు. కోర్టు పనిమీద వెళ్లిన లింగయ్య బస్సుఎక్కి సగం దూరం పోయిన తర్వాత ఏవో దస్తావేజులు మర్చిపోయి నట్లు తెలుసుకొని ఎదురుబస్సులో తిరిగివచ్చి ఇంటికి రాత్రి 12 గంట లకు చేరాడు. వచ్చి జరిగిన దుస్సంఘటన చూసి నిర్ఘాంతపోయాడు." అని ప్రాసిక్యూషన్ కథను వ్రాయవచ్చునని సుశీలారావన్నాడు.

సర్కిల్ ఇన్‌స్పెక్టరు ఈ కథకు ముగ్ధుడైపోయినాడు. కాని పుల్ల య్యకూ లింగయ్యకూ అంతకు పూర్వం విరోధం లేదనీ, మిత్రులుగానే వున్నారనీ నిరూపించటం అవసరమని అన్నాడు. సరే నేను దానికి మార్గం తెలికి తెలియజేస్తానని సుశీలారావు చెప్పాడు. కృతజ్ఞత తెలిపి వచ్చేశాం.

లింగయ్య పుల్లయ్యలిద్దరూ చెరొకసారి వచ్చి మహాలింగందగ్గర గత సంవత్సరం ఫొటోలు తీయించుకున్నారు. ఆ ఫొటోల నెగటివ్‌లు ఇప్ప టికీ మహాలింగందగ్గర వున్నయ్. సుశీలారావు సూచనప్రకారం వాళ్ల

ఫొటోలు రెండిటినీ కలిపి ఒక్క ఫొటోగా తీసి ఇద్దరూ ఒకే ఫొటోలో కూర్చున్నట్లు తయారుచేశాడు. దాన్ని సుశీలారావు సర్కిల్ ఇన్‌స్పెక్టరుకు అందజేశాడు. "లింగయ్య, పుల్లయ్యలు స్నేహితులు కారని ఎవరన గలరు?" అని దాని వెనుక వ్రాసి పంపాడు.

ఏతావాతా వచ్చిన ఫలిత మేమిటంటే పుల్లయ్య అనే విశ్వాస పాత్రుడైన క్రొత్త మిత్రుని సంపాదించాం. అతని వ్యక్తిగత రహశ్యాలు మాకు తెలియటంవల్లనో ఎందువల్లనో గాని అతను మాకు శాశ్వత మిత్రుడయినాడు. అతని కొడుకు వివాహానికి మేమందరం స్పెషల్ బస్సు చేసుకొని ఒక యాభైమందిమి వెళ్లాం. పుల్లయ్యకు ఇంత అండ వున్నదా అని అందరూ విస్తుపోయారు. సుశీలారావు పెండ్లికొడుక్కి ఒక మిల్టరీ యూనిఫారం పట్నంనుంచి ఖరీదుచేసి తెప్పించి చదివించాడు. నేను వెండి పొన్నువేసిన చేతికఱ్ఱను పుల్లయ్యకు బహూకరించాను. మావాళ్లందరం మొలతాళ్లు తెగేటట్లు తిని, చాపలు చినిగేటట్లు నిద్రపోయి, రెండెడ్ల బళ్లను మోటారుబళ్ల మాదిరిగా తోలుతూ ఇళ్లకు చేరాము.

"మనం ఈనాడు ఒకరికి చేసే సహాయం మరొకనాడు మన పెట్టుబడి అవుతుంది" అని సుశీలారావు నాతో అన్నాడు!



# 14. యముడుచేసిన సహకారం

రాత్రి ఎనిమిది గంటలపుడు త్రాచుపాము కాటువేసింది. "ఒరే! నాయనా! చచ్చాన్రో" అంటూ రామసుబ్బయ్యగారు పంటకాలువ గట్టుమీద పడిపోయినారు. చేలల్లో పారపని చేసుకొనే వాళ్ళు ఇళ్ళకు బయలుదేరి వస్తూ ఈ కేక విని పరుగు పరుగున పోయి రామసుబ్బయ్యగారిని బుజాన వేసుకొని ఇంటికి చేర్చారు. ఆయనభార్య నెత్తీనోరూ బాదుకుంటూ శోకాలు పెడుతూ కూచున్నది. పసిపిల్లవాడు భయంతో తల్లిని చాటుచేసుకొని నిలబడి ఏడుస్తున్నాడు వైద్యుడు వచ్చాడు. కాటువేసిన చోట గాయం లోతుగానే పడింది. నాడి ఆడుతూనే వుంది గాని నోట మాటలేదు. నురుగులు కక్కుతున్నాడు.

నేనూ సుశీలారావూ చూడటానికి వెళ్ళాం. పాముకాటని నిర్ధారణ అయింది. వెంటనే ఒకమనిషికి సైకిలిచ్చి మంత్రం వేయించటం కోసం టెలిగ్రాఫ్ ఆఫీసుకు అర్ధరాత్రిపుడు పంపించాం. అతను తిరిగి రాకముందే ఇక్కడ రామసుబ్బయ్యగారు కాస్తా "హరీ" అన్నాడు.

వూళ్లో మిగిలివున్న సత్యకాలపు మనుషుల్లో ఆయన చివరివాడు. ఆయన అజాత శత్రువు. జీవించివున్నంతవరకు ఒకరిని ఇబ్బంది పెట్టి ఎరుగడు. చచ్చిపోయేటప్పుడు గూడ ఒకరిని ఇబ్బంది పెట్టలేదు. ఇనుప గుండు లాంటి మనిషి ఇంత సునాయాసంగా కాలం చేయటం అందరికీ విషాదమూ ఆశ్చర్యమూ కలిగించింది. ఆయన మావూరి కోఆపరేటివ్ సొసైటీకి అధ్యక్షుడు; నరసింహస్వామి దేవాలయానికి ధర్మకర్త.

మా మిత్రులం నలుగురమూ నాలుగు వీధుల్లోకిపోయి దుఃఖాన్ని వెళ్ళబోసి వచ్చాం. "మనగ్రామంనుంచి ఒకమహాఋషి అస్తమించాడు" అని సుశీలా రావన్నాడు... "రామసుబ్బయ్యగారు నాకు సాక్షాత్తూ గురువు" అని నేను చెప్పాను... "ఇంత మహనీయుడుగదా! ఒక్కఫొటో తీస్తాను. తీయనివ్వండి. నాకు దమ్మిడీ ఇవ్వనవసరంలేదు అని నేను అడిగితే- ఛీ! ఛీ! నాకెందుకురా ఈ ఫొటోలూ పాడూను, అన్నాడాయన! కీర్తికోరని కర్మయోగి రామసుబ్బయ్యగారు" అన్నాడు మహాలింగం ... "దీన్తస్సదియ్యా! ఈ పామెట్లాకరిచిందంట! ఆ కాటు ఆయనకుగాదు, ఈ గ్రామానికే వేసింది" అని కొండయ్య అన్నాడు.

ఆయన కాలం చేసినందుకు సంతాపసూచకంగా గ్రామంలో హైస్కూలు, ఎలిమెంటరీస్కూళ్లు మూసివేయించాం. బడిపిల్లలకు ముఖంలో విషాదం వెలిబుచ్చాలని తెలియక గుఱ్ఱపుగంతులు వేస్తూ వీధుల్లోకి వచ్చారు! వూళ్లో షాపులన్నీ మూయించాం. ఎవరైనా మేము అటు పోవటంచూసిగనుక మళ్ళీ తలుపుతెరిస్తే గల్లాపెట్టె చంకనపెట్టుకొనిపోతాం సుమా అని నిష్కర్షగా చెప్పాం. దేవాలయానికి ధర్మకర్త అయిన రామసుబ్బయ్యగారు దేహం చాలించారు గనుక నరశింహస్వామి దేవాలయాన్ని ఆనాడు మూసివేయమని కొండయ్య వెళ్ళి పూజారితో చెప్పాడు. పూజారి గూడ సంతోషంతోగూడిన విచారంతో ఆనాడు గుళ్లో దీపం వెలిగించలేదు.

రామసుబ్బయ్యగారు కాలంచేసిన మరునాటినుంచీ గ్రామంలోని ముగ్గురు పెద్దలు ప్రతిరోజూ దేవాలయానికి వెళ్ళి ప్రదక్షిణాలు చేయటం ప్రారంభించారు. వాళ్ళు ఇదివరకెన్నడూ దేవుడి గడప త్రొక్కిన పాపాన పోలేదు. ఎటునుంచి ఎటు ప్రదక్షిణం చేయాలో బహుశా ఎరిగుండరు. అలాంటివాళ్ళకు ఇంతటి భక్తి ఎలా కలిగిందా అని సామాన్యులకు సందేహంవేసింది. రామసుబ్బయ్యగారి మరణంవల్ల వీరిలో వైరాగ్య బీజాలు మొలకెత్తి ఆకులువేస్తున్నాయేమోనని నే ననుకున్నాను. కాని సుశీలా రావు మెల్లగా చెవిదగ్గరకు వచ్చి చెప్పాడు. "దేవాలయానికి ధర్మకర్తల మవుదామని ముగ్గురు మనుషులు ముచ్చటపడుతున్నారు. రోజూ దేవాలయంలో హాజరు చెప్పుకుంటూ పైవాళ్ళకు దరఖాస్తు పెట్టుకున్నారట" అన్నాడు.

నాకళ్ళు తెరిపిడిపడ్డయ్. వైరాగ్యమూ కాదు శృంగారమూ కాదు. వ్యవహారమన్నమాట! "సరేమరి. తురుపుదించావా? లేక ముక్కలు కింద పారేశావా?" అన్నాను.

"జోకర్లు చేతులో వున్నపుడు ముక్కలు పారేస్తానా?" అని ఒక్క నవ్వు నవ్వి జేబులోనుంచి ఆనాడే వచ్చిన ఒక కవరు తీసి చూపించాడు. దేవాలయ ధర్మాదాయ బోర్డువారినుంచి వచ్చిన ఆర్డరది. అందులో మా కంట్రాక్టర్ మహాలింగాన్ని నరసింహస్వామి దేవాలయానికి ధర్మకర్తగా ఐదేళ్ళపాటు నియమిస్తూ ఆజ్ఞ జారీచేయబడింది! ఈ ఆర్డరు ఎలాపుట్టించగలిగావు అని నేను అడగలేదు. మహా మహా పనులు చేయగల సుశీలారావు ఈ పని సాధించుకొని రావటంలో చిత్రమేమీ లేదు. ఆనాటి సాయంకాలం మొదటిసారిగా నలుగురమూ కలిసి దేవాలయానికి వెళ్ళాం. నూతన ధర్మకర్త అయిన మహాలింగం విచ్చేస్తున్నాడని తెలిసి పూజారి పులిహోర ప్రసాదంచేసి పలహారం పెట్టినట్లు పెట్టాడు. ఇంట్లో చేసే పులిహోర ఇట్లా వుండదేమని చాలాసేపు చర్చించి వచ్చివేశాం. తర్వాత కొన్నాళ్ళకు పూజారి చెప్పాడు: "కొత్త నీటి తాకిడి ఆగి పోయిందండోయ్" అని!

దమయంతీదేవి స్వయంవరానికి యువరాజులంతా ముస్తాబైవచ్చి నేనంటే నేనని పోటీపడినట్లు కోపరేటివ్ సొసైటీ అధ్యక్షపదవికి గూడా నేనంటే నేనని ఇద్దరు ముగ్గురు మనుషులు ఉబలాట పడుతున్నారు.

ఈ సొసైటీ తరఫున సన్నకారు రైతులకు కొద్ది వడ్డీలమీద సర్కారువారు అప్పులిస్తారు. రామసుబ్బయ్యగారు ఈ సొసైటీకి అధ్యక్షుడు కావటం వలన ప్రజలకంటికి ఆయన ఆపద్బాంధవుడుగానూ, కల్పవృక్షముగానూ కనిపించాడు. కాస్త చదవటమూ వ్రాయటమూ తెలిసి భోజనం చేయటం తప్ప వేరే చెప్పుకోదగ్గ పనిలేని ముగ్గురు పెద్దమనుషులు సొసైటీని జేబులో వేసుకోవాలని ఉవ్విళ్ళూరుతున్నారు. పదిమంది డబ్బు కక్కుర్తిగలవాళ్లు తన ఇంటిచుట్టూ తిరుగుతుంటే ఆదొక గౌరవం గూడాను. ఇవ్వటం సర్కారు డబ్బయినా తన తాత ముల్లె ఇస్తున్నంత ఠీవిగా మాట్లాడవచ్చు. ఇన్ని ఉద్దేశ్యాలతో వాళ్ళు ఆలోచించారు. చదరంగం ఆడేవాడిలాగ ఒకరికి తెలియకుండా ఒకరు ఎత్తులు వేస్తున్నారు ఒకడు కోపరేటివ్ ఇన్‌స్పెక్టరుకు ఒక బస్తాబియ్యం బహుమానం పంపించాడు. మరొకడు రామసుబ్బయ్యగారు చావకముందే తనను అధ్యక్షుడుగా వుండమని వీలునామా వ్రాశాడని అమాయకుల దగ్గరకు పోయి కోస్తున్నాడు. పాము కాటుతో చచ్చినవాడు విల్లు ఎపుడు వ్రాశాడో! మూడోవ్యక్తి సొసైటీకి తాను ఉపాధ్యక్షుడను గనుక అధ్యక్షుడు కాలం చేసిన తర్వాత లెఖ్ఖ ప్రకారం తానే అధ్యక్షుడనన్నాడు.

సుశీలారావు కర్మవీరుడు. అందరూ మాటలు ముందు చెప్పి పని తరువాత చేస్తారు. సుశీలారావు పని ముందు చేసి, తరువాత ఓపిగ్గా కబుర్లు చెపుతాడు... రామిరెడ్డికి ఒక దాయాదివున్నాడు. అతని పేరు కోటిరెడ్డి. ఇద్దరికీ పచ్చిగడ్డి వేస్తే భగ్గుమంటుంది. దాయాదివుంటే వేరే అగ్ని అవసరంలేదని చెప్పనే చెప్పారుగా! సుశీలారావు కోటిరెడ్డిమీద ఒక చిరునవ్వు పారేశాడు. కోటిరెడ్డి కుర్చీ చూపి కూర్చోమన్నాడు. సుశీలారావు ఇవ్వవలసిన మోతాదులో "ఇంజంక్షన్" ఇచ్చాడు. ఇద్దరూ సరేనంటే సరే ననుకున్నారు. సుశీలారావు తిరిగి వచ్చాడు. సుశీలారావు కోపరేటివ్ సొసైటీ సభ్యుల జాబితా ఒకటి తయారు చేశాడు. మొత్తం 60 పేర్లు చేతికి వచ్చినయ్. వాళ్ళలో మామాట నికరంగా వినేవాళ్లు 25 మంది వున్నారు. మిగతా వాళ్ళలో 20 మంది ఇళ్లకు పోయినవాళ్లను బుజ్జగించి చేతిమీద చెయ్యివేయించుకొని వచ్చాడు. కొలదిరోజులకు కోపరేటివ్ సొసైటీ ఇన్‌స్పెక్టరు వచ్చి అధ్యక్ష ఎన్నికలు జరిపాడు. ఆ ఎన్నికలో 10 వోట్ల మెజారిటీతో కోటిరెడ్డి అధ్యక్షుడుగా ఎన్నికైనాడు! చూచిన

వాళ్లు విస్తుపోయారు. విభీషణుడు రామునిపక్షంలో చేరినట్లు కోటిరెడ్డి మా తట్టు చేరటంతో సుశీలారావు పరమానందభరితుడైనాడు.

మహాలింగం దేవాలయాన్ని ఉద్ధరించటానికి ఒక పథకం తయారు చేశాడు. కార్మికచట్టం ప్రకారం అర్చకుడికిగూడ వారానికి కొక సెలవు రోజు మంజూరు చేసి, ప్రతి ఆదివారమూ దేవాలయం కట్టివేయాలన్నాడు. గర్భగుడికి మూడువైపులా మూడు కిటికీలు, మూడు వెంటిలేటర్లూ ఏర్పాటు చేయాలన్నాడు. దద్ధోజనం, చక్రపొంగలి, ఈరోజుల్లో ఎవరికీ రుచించటంలేదు గనుక దేవుడి ప్రసాదం కింద ఉప్మానుగాని ఇడ్డెన్లనుగాని చేయించాలన్నాడు. గుళ్లోకి ప్రజలను ఆకర్షించటంకోసం కళ్యాణ మంటపంలో ఒక రేడియోను పెట్టి రికార్డులు వినిపించాలనిగూడ అన్నాడు.

సుశీలారావు అంతావిని మొఖం ఒకవైపుకు తిప్పుకొని "సంతోషించాంలే. నోర్ముయ్. పిచ్చి వేషాలు వేయకు" అన్నాడు.

మహాలింగం చెప్పినవాటికి హేతుయుక్తంగా జవాబివ్వలేక సుశీలారావు తప్పుకున్నాడని నేనంటాను. మీరేమంటారు ?

---

# 15. రాజకీయ చైతన్యం

భూమిలో లంకెబిందెలు దొరికినట్లుగా సుశీలారావు మహదానంద పడుతూ మమ్మల్నందరినీ పడమంటున్నాడు. "పడతాను సరేగాని అసలీ ఆనందానికి హేతువేమిటి? ఎందుకీ సంతోషం? ఏదన్నా లాటరీలో గెల్చావా? ఏదైనా వుద్యోగం వూడి పడిందా? మామగారు పండక్కి రమ్మన్నారా? ఏదో చెవున వెయ్యి నవ్వుకుందాం" అన్నాను. "నీ మొహాం నా మొహాం! నీబుద్ధి లాటరీని దాటి ఒక్కడుగు పైకిపోదుగదా!...వ్చ్... మీరీలోకంలో లేర్రాబాబూ లేర్రా! ఇవ్వాళ్టిరోజున దినపత్రిక చూచిన మొహాం ఒక్కడైనా వున్నదీ మీలో?..." అన్నాడు.

"ఆ చూచాను... ఏముందీ అందులో... బొంబాయిలో వినతా లలితా డాన్సు జరుగుతుందట...విజయవాడలో వడగాలి కొట్టి ఒక సబ్ ఇన్‌స్పెక్టరు ప్రాణం పోయిందట... కుంభకోణంలో ఆహార మంత్రిగారి ఇంట్లో దొంగలు పడి పదివేల రూపాయలు అపహరించారట... హాలండులో మొగవాళ్లను ఆడవాళ్లుగా మార్చివేసే డాక్టర్లున్నారట": అన్నాడు మహాలింగం.

"లాభంలేదు మహాలింగం! లాభంలేదు. మనబుద్ధులు వినతా లలితాలకు వప్పగించాం. మన మనస్సులు లింగమార్పిడి మీదికి పోతున్నవి.. అంతేగాని దేశంలో ఏమి జరుగుతున్నదో ఒక్కడికీ పట్టదుగద"

"పోనీ నీవు చెప్పరాదూ? మనలో ఒక్కడివి వున్నావుగా చిచింద్రీ లాంటి వాడివి!" అన్నాడు కొండయ్య.

"అదే చెపుతున్నాను. మనపాలిట భాగ్యదేవత ఇవ్వాళ పత్రికలో అవతరించింది. మీ దృష్టి దానిమీదికి పోకనేపోయె! ప్రభుత్వంవారు దేశవ్యాప్తంగా వయోజన ఓటింగు హక్కును సమర్పించారు. ఇకనుంచి 21 సంవత్సరాలు దాటిన స్త్రీ పురుషులందరూ ఓట్లువేసి శాసనసభలకు ప్రతినిధుల్ని ఎన్నుకోవచ్చు. చదువూ గిదువూ అవసరంలేదు. ఆస్తిపాస్తులతో నిమిత్తం లేదు. 21 ఏళ్లు నిండితే చాలు. ఇహ దేశమంతా ప్రజాస్వామ్యం వెల్లివిరుస్తుంది. పచ్చతోరణం, నిత్యకళ్యాణం అవుతుంది." అన్నాడు సుశీలారావు.

అందరమూ అర్థమైనట్లుగానే కనిపించాం. తలకాయలు పైనించి కిందికి ఊపాం. అయినా ఒకసారి ఎన్నికలను కళ్ళారాచూస్తేగాని నాకు అంతుపట్టేటట్లు కనిపించలేదు. అందరికీ ఓటుహక్కు ఇచ్చినంతమాత్రాన దేశం నిత్యకళ్యాణం ఎలా అవుతుందో నాకు తెలియలేదు. మహాలింగం, కొండయ్యలు స్వయంగా అర్థం చేసుకుందామని దినపత్రికను మళ్ళీ మళ్ళీ చదివారు. నేను దినపత్రిక సంపాదకీయం చదివాను. ప్రజాస్వామ్యంలో అపూర్వమైన ప్రయోగం దేశంలో జరగబోతున్నదని అందులో వ్రాశారు.

రోజులు గుండ్రాయిదొర్లినట్లు దొర్లుకుంటూ పోతున్నయ్. నిజానికి మన ప్రయత్నంతో నిమిత్తం లేకుండా సహజంగా జరుగుతున్న పని రోజులు గడవడం ఒక్కటే! శాసనసభలకు కొత్తగా ఎన్నికలు జరుపుతారట. మా

ఫిర్కాలో ప్రతిపార్టీవాళ్లూ వచ్చి తమ అనుకూలురకోసం గాలిస్తున్నారు. క్రొత్తకొత్త జెండాలు ఎగురుతున్నయ్. వూళ్లోకి కొత్తకొత్త మనుషులు గూడ అడపాతడపా వచ్చిపోతున్నారు.

జనతాపార్టీ నాయకుడు ఒకాయన బొంబాయి నుంచి వచ్చి మా వూళ్ళో బహిరంగసభ పెట్టి గంటన్నరకు పైగా ఉపన్యాసం ఇచ్చాడు. ఆయన ఇంగ్లీషులో మాట్లాడితే ఒక హైస్కూలు మేష్టరు తెలుగులో తర్జుమాచేసి చెప్పాడు. ఐదారు నెల్లనుంచి వూళ్లో నాటకాలు గాని హరికథలుగాని లేకపోవటంవల్ల మనుషుల చెవులు తుప్పు పడుతున్నాయి. అయాచితంగా ఒక పెద్దమనిషివచ్చి సభ జరుపుతున్నాడని జనం మూకలు మూకలుగా వచ్చారు.

జనతాపార్టీ గురించి ఉపన్యసిస్తూ ఆయన జనతా రైళ్ల ప్రయోజనాలను గురించి చాలసేపు చెప్పాడు. ప్యాసింజరు బళ్ళల్లో జనం కడ్డీలు పట్టుకొని వేలాడుతూ ప్రయాణం చేసేవారనీ, అందుచేత అనేక ప్రమాదాలు జరిగాయనీ తేదీలతోసహా చెప్పాడు. గత జనవరి 13 వ తేదీన నెల్లూరుఅవతల కావలిదగ్గర ఒక ప్రయాణీకుడు పట్టుకొన్న కడ్డీకాస్తా పుటుక్కున విరిగిపోయి హటాత్తుగా కింద బడిపోతే తలకాయ రెండు ముక్కలై నడుందగ్గర ఎముకలు పిప్పిపిప్పి అయినవట! మే 17 వ తేదీన ఒక తల్లీ బిడ్డా పుట్ ఫాత్ మీద నిలబడి ప్రయాణంచేస్తుంటే బకింగ్ హామ్ కాలువమీదుగా రైలు పోతున్నపుడు ఆ బిడ్డ తల్లి చంకలోనుంచి జారి కాలువలో పడితే కాలువలో గేదెలను కడుగుతున్న పిల్లకాయలు ఆ బిడ్డ శవాన్ని ఒడ్డుకు చేర్చారట. క్రిందటి శ్రీరామనవమినాడు డోర్నకల్ భద్రాచలంమధ్య ప్రయాణీకులు చోటుచాలక రైలుపెట్టెలమీద ఎక్కి కూర్చున్నారట. అడవిలోకుండా రైలు పోతున్నపుడు సుడిగాలివీచి పైనున్న ప్రయాణీకులిద్దరు బంతులమాదిరిగా దొర్లుకుంటూ కింద పడ్డారట. "ఇలాంటి ప్రమాదాలకు ఆహుతికాకుండా వుండటంకోసం జనతారైళ్లు వేయబడ్డవి. వాటిల్లో హాయిగా కాళ్ళు జాపుకొని ప్రయాణం చెయ్యవచ్చు. అందులో అన్నీ మూడవతరగతి పెట్టెలే గాని ఒకటోతరగతీ రెండవతరగతీ వుండవు. ఇందువల్ల ప్రజల్లో సమానత్వం వస్తుంది. నీవు ఎక్కువ, నేను తక్కువ అంటూ వుండదు. అలాగే మా జనతాపార్టీగూడ ఈ జనతారైళ్ళను ఆదర్శంగా తీసుకొని పుట్టింది.

ప్రజలను ప్రమాదాలనుంచి రక్షించటానికీ, మిట్టపల్లాలను ఏకంచేయటానికీ జనతాపార్టీ నడుంకట్టింది'' అని ఉపన్యసించాడు. ఉదాహరణలతో సహా చెప్పటంవలన అందరికీ అర్థమైనట్లుగా కన్పడింది. భలే చెప్పాడురా అని అంతా అనుకున్నారు. మరునాడు మా కాఫీహోటలులో ఇడ్లీఇచ్చేవాడు జనతాపార్టీలో చేరమని రసీదుపుస్తకం పుచ్చుకొని తిరుగుతున్నాడు. ఒక నెలరోజులు గడిచేసరికి మా మంగలి జనతా హెయిర్ కటింగ్ సెలూన్ అని బోర్డు కట్టాడు.

ప్రజలు కొద్దికొద్దిగా రాజకీయాలనుగురించి మాట్లాడటం ఆరంభించారు. దినపత్రికను ఏడెనిమిదిమంది గుంపుగా కూచొని చదువుతున్నారు. కిళ్లీషాపులముందుండే బెంచీలమీద సూర్యోదయ సూర్యాస్తమయ సమయాల్లో కొస్త ఉష్ణాధిక్యతకలవాళ్ళు కూర్చొని మొదట మొదట్లో నిదానంగాను క్రమంగా బిగ్గరగాను మాట్లాడుతారు. మరికొంత సేపటికి లేచి నిలబడి మధ్యమధ్యలో ఛాలెంజిచేస్తూ మాట్లాడుతారు. చివరకు ఇంట్లోనుంచి పిల్లవాడు వచ్చి పిలిస్తే ఒకరితర్వాత ఒకరు గుడ్డలు దులుపుకొని వెళ్ళిపోతారు. గ్రంథాలయందగ్గర ముసలివాళ్ళు పొద్దుం కాయలతో సహా వచ్చి కూచొని రాజకీయాలలో భూత భవిష్యత్తులను గూర్చి శాస్త్రీయంగా చర్చిస్తూవున్నారు. ఎన్నికలు యింకా మూడు నెలలు వున్నాయనంగా తిమ్మాపురంలో బొడ్డూడిన ప్రతివాడూ ఒక పార్టీ వర్కర్‌గా కనిపిస్తున్నాడు. ఓనమాలుదిద్దుకొనే పిల్లవాడు పలక చేత్తో పుచ్చుకొని నోట్లో చాక్ పెట్టుకొని చీకుతూ "యన్టీ రంగారావుకీ జై"అంటూ పోతున్నాడు. "జనతాపార్టీగనుక వస్తే పరీక్షలు రద్దుచేస్తారుటగా" అవి సిగరెట్ వెలిగించుకుంటూ మెట్రిక్ పరీక్షకు అయిదోసారి వెళుతున్న మస్తాన్‌రావు అన్నాడు పిల్లను చంకనవేసుకొని సినిమా చూడబోతున్న ఆడంగులు అనుకొంటూ పోతున్నారు, "రష్యాలో ఆడోళ్ళు పిల్లల్ని కనర్టగా"అని. మా పోలీసు సబ్ఇన్స్పెక్టరుగూడ "మా పోలీసు లంటే మనుషులకు మరీ భయంలేకుండా పోయింది" అని దిగులుపడుతూ అన్నాడు!

రాజకీయ రంగంలోకి స్త్రీలుగూడ ఊపుగావచ్చి ప్రవేశిస్తున్నారు. అర్థాంగి అన్నమాటను అన్నిసందర్భాలలోనూ అన్వయంచేయాలని వాళ్ల వాదన. "ఫిఫ్టీ-ఫిఫ్టీ" అనేది వాళ్ల నినాదం. అయిపోయింది. ఉద్యోగా

ళలో గాని, పడవులలోగాని, రైలుపెట్టెలలోగాని, సినిమాహాల్సులో గాని ఆటస్థలాలలోగాని దేంట్లో పట్టినాసరే స్త్రీలకూ పురుషులకూ సరి సమానమైన స్థానాల్నీ హోదాలనూ ఇవ్వాలని వాళ్లవాదం. మంత్రివర్గం లోనూ, శాసన సభ్యులలోను సగంమంది ఆడవాళ్లు వుండితీరాలని అన్నారు. ఇది న్యాయమైన కోర్కెయేననీ, అత్యాశ ఏమీ లేదనీ వాదించటం ఆరంభించారు. ఇందుకోసం వాళ్లు మహిళాపార్టీ అని ఒక క్రొత్త రాజకీయ పక్షాన్ని స్థాపించారు. ఓటర్లలో ఎట్లాగూ సగంమంది స్త్రీలే గనుక సులభంగా సగంసీట్లు తమపార్టీకి దక్కుతాయని బల్లగుద్ది మాట్లాడుతున్నారు. కొంతమంది స్త్రీలు తమ భర్తలమాటల ప్రకారం నడుచుకొంటారు గనుక ఎలాగూ కొన్ని స్త్రీలవోట్లు తాము కోల్పోవలసి వస్తుందని వాళ్లు అంచెనా వేసుకున్నారు. కాని భార్యలమాటలప్రకారం నడుచుకొనే భర్తలుగూడ అసంఖ్యాకంగానే వున్నారు గనుక చాలమంది పురుషుల వోట్లుగూడ తమకువస్తాయని అనుకుంటూవున్నారు. ఎటు తిరిగీ మహిళా పార్టీ స్థాపన వలన చాలామంది పురుషులు పిల్లిమొగ్గలు వేయవలసిన అగత్యం కలిగింది.

ఒకనాడు మహాలింగం తన కుమారుడి అన్నప్రాసన సందర్భంలో మిత్రులందరినీ భోజనానికి ఆహ్వానించాడు. మిత్రులంటే పూర్వం మాదిరిగా నలుగురుకాదు. ఇపుడుసప్తమహర్షులం అయినాము. గోపాలరావుగారు, కోటిరెడ్డి, పుల్లయ్యగార్లనుగూడ క్యాబినెట్ లో చేర్చాము. భోజనాలు పూర్తిఅయినయ్. ఒక గంటసేపు చతుర్ముఖపారాయణం ప్రారంభించాం. పళ్లెంలోని వక్కలూ తమలపాకులూ అయిపోయేవరకు ఆట ఆడుతూనే వున్నాం. సుశీలారావుకూ జోకర్లకూ చెడ్డస్నేహం. చాలా ఆటలలో జోకర్ అతనిదే. చీట్లపేకలో అతను ఓటమిఎరుగడు. అతని తెలివితేటలన్నీ చీట్లపేక నుంచి పుట్టుకొచ్చినవే ననేవాడు. ఆతను పాడిముక్కతో తురుపుచెప్పి గెలుచుకొనేవాడు. గుండె నిబ్బరంగనుకవుంటే మనిషికి అపజయంవుండదనేవాడు.

"వచ్చే ఎన్నికల్లో మన కర్తవ్యం ఏమిటి ?" అని పుల్లయ్య సూటిగా అడిగాడు.

"ఎవరిని బలపరుద్దాం ?"అని గోపాలరావుగారు అడిగాడు. ఆయన ఎప్పుడూ మరొకరిని బలపరచటంగురించే ఆలోచిస్తుంటాడు.

"ఒకరిని బలపరిచే గతి మనకేంపట్టింది ?" అని కొండయ్య ఎద్దేవ చేశాడు.

"ముక్కూ ముఖమూ తెలియనివాళ్ళం బలపరచక ఏం చేస్తాం ?" అన్నాను నేను.

"బ్రాహ్మలంటే నాకు చెడ్డ అసహ్యం" అన్నాడు వ్యంగ్యంగా మహాలింగం. నాకు అర్థమయింది. ఏమి అనటానికీ నాకు తోచలేదు. క్రిందచూస్తూ వూరుకున్నాను.

సుశీలారావు ఒక్కమాట వదిలాడు- "మనమందరం కలిసికట్టుగా వుంటే మనమే నిలబడవచ్చు." అన్నాడు.

"అనుభవమో ?" అన్నాను నేను.

"మనకున్న అనుభవమూ పలుకుబడీ ఎల్లికొల్ల" అన్నాడతను.

సుశీలారావు గీచిన గీతమీద నడుచుకుంటామని అందరూ వాగ్దానం చేశారు. కాసేపు ఆలోచించినట్లు కనపడి సుశీలారావు తీర్పుచెప్పాడు- "వెంకటప్పయ్య నెమ్మదస్తుడు. ఫిర్కాలో వాళ్ళవిషయం పదిమందికీ తెలుసు. అతన్ని అభ్యర్థిగా నిలబెడుదాం. విజయం మనకు ఖాయం" అన్నాడు. అందరూ సరేనంటే సరేనన్నారు.

---

# 16. విషాదయోగము

నా కెటూ పాలుపోవడంలేదు. అన్నం సయించడంలేదు. నిద్ర పట్టటం లేదు. పసిపిల్లవానినీ నలుగురూ నాలుగువైపులా పట్టుకొని చెవులు కుట్టించినట్లు నన్ను వీళ్ళందరూ పట్టుకొని నిలబెడుతా మంటారు. తప్పించుకొనే ఉపాయం లేకుండా వచ్చింది. వదిలిపెట్టమంటే వదిలిపెట్టరు. చెపితే వినిపించుకోరు. నుదీపోటీ లంటారు. నీకెందుకు మేమున్నాంగా అంటారు!

ఇది ఇలావుండగా దీపస్తంభంలాంటి సన్నని పొడుగాటి మనిషి కళ్ళజోడు సవరించుకుంటూ మాయింటికివచ్చాడు. అతనివెంట క్లిష్టి

కొట్టు కుమారయ్య గూడ వచ్చాడు. కుర్చీలుచూపి కూచోమన్నాను. ఆ వచ్చిన పెద్దమనిషి మా జిల్లా లేబర్‌పార్టీ కార్యదర్శిట. మావూళ్ళో లేబర్‌పార్టీ స్థాపించటంకోసం వచ్చానన్నాడు. 'శుభం' అన్నాను. అతనికి కొంచెం హుషారు వచ్చినట్లున్నది. లేబర్‌పార్టీతరఫున ఎన్నికల్లో మా నియోజకవర్గంలో నిలబడటానికి నేను అంగీకరిస్తానేమో అడగాలని వచ్చానన్నాడు.

"లేబర్‌పార్టీ ఆశయాలూ ఉద్దేశ్యాలూ చూచాయగానైనా నాకు తెలియువుగదా! నన్ను నిలబెట్టి మీరు బావుకుతినేదేమిటి? ఎవరి నైనా తెలిసినవాణ్ణి పెట్టుకోండి దివ్యంగా వుంటుంది" అన్నాను.

అప్పుడాయన ఒక చిన్నసైజు ఉపన్యాసం ఆరంభించాడు. "మా పార్టీ ఆశయాలూ ఉద్దేశ్యాలూ చాలా సింపుల్. చెమట పట్టేవాడికే కూడు దొరకాలంటాము. ఉట్టవిడియంగా డబ్బుచేసుకోవటంగాని, వళ్లు వంచకుండా పరభాగ్యోపజీవిగా బతకటంగాని మా పార్టీ ఒప్పుకోదు. మేము చెప్పేదేమీ లోకానికి క్రొత్తగాదు. చెమటకార్చిన వాడే తీపితిన దగినవాడని ఐర్లండు మహాకవి జోసెఫ్‌వారెన్ చెప్పాడు. బరువుమోసిన గాడిదకే కూడుదొరుకుతుందని ఇటలీ కార్మికనాయకుడు మిస్టర్ స్టివెన్ సన్ చెప్పాడు. తాతలు సంపాదించిపెట్టిన ఆస్తిమీద బతికేవాడు, పెళ్ళాండబ్బుతో బతికేవాడూ సమానులేనని ఆచార్యకృపానిధి ఉద్ఘాటించాడు. అందుచేత మా పార్టీ కాయకష్టంగాని మానసిక కష్టంగాని చేసే వాడిదే రాజ్యమంటుంది. అలాచూచినట్లయితే హైకోర్టు జడ్జీమొదలు రిక్షావాలా వరకు అందరూ కార్మికులక్రిందికే వస్తారు. ఊరికే బొజ్జపెంచు కొనే వాళ్ళకు తిండిపెట్టకూడదని మా వాదం" అని ముగించాడు.

అతని మాటలలో నిజం చాలాభాగంవున్నదని అనిపించింది. కాయ కష్టం చెయ్యలేనటువంటి బాలురకూ వృద్ధులకూ స్త్రీలకూ గింజలు పుట్టకూడ దని అతని ఉద్దేశమాఅని అనుమానంవేసింది. కాని నేనామాట అడగలేదు.

"మరిఅయితే నేను తాతలు సంపాదించిన 100 ఎకరాల మీద బతుకుతున్నవాడినిగదా! నేను మీ పార్టీ అభ్యర్థిగాపనికివస్తానా?" అని అడిగాను.

"ఏం ఫరవాలేదు. మేమంత 'ఆర్థడాక్స్'గా వుండం. మా ఆశయాలు మీకు నచ్చితే సరి. మీరైతే గెలుపుఖాయం అని మీదగ్గరకు వచ్చాను." అన్నాడు.

నేను ఒక్క నిముషం ఆలోచించినట్లు కనపడి "ఊహూ......ఆలాగా...సరే అయితే...అసలు నేను స్వతంత్రుడుగా పోటీచేయాలని నిర్ణయించుకున్నానులెండి" అని చల్లగా చెప్పివేశాను.

అతను చకితుడైనాడు. "అలాగా... అయితే సరేలెండి...అయితే సరేలెండి..." అని అంటూ కండువా పైన వేసుకొని దారితప్పి వచ్చిన వాడిలాగ గుట్టు చప్పుడికాకుండా వెళ్ళిపోయినాడు !

ఏదో బెట్టుసరిగా అతనితో అన్నానుగాని నిలబడటానికి ధైర్యం చిక్కటంలేదు....అసలు ఈగొడవ నాకెందుకు ? కడుపులోచల్ల కదల కుండా నీడపట్టున కాళ్ళు ముడుచుకుని కూచుంటే వెళ్ళిపోదూ? ఊబిలో దిగబడటం దేనికి ? తర్వాత వేలు కొరుక్కోవడం దేనికి ?... ఏమిటో మరి ! ఆ లేబర్‌పార్టీ కార్యదర్శి చెప్పినదాన్నిబట్టిచూస్తే గెలుపు ఖాయం అంటాడే ! ఎందువల్లనో ? కారణ మేమిటో ? అలాగైతే సిరి దానంత టది వస్తానంటుంటే నేను కాలితో తన్నివేయటం బాగుంటుందా ? వివేక శూన్యత అవుతుందేమో ?...

వ్చ్... లాభంలేదు... అతను నన్నేదో ఉబకేయటానికి అట్లా అన్నాడుగాని నక్కెక్కడ నాగలోకమెక్కడ ? ఎం. ఎల్. ఏ. అంటే గుర్రపుస్వారి చేయడమా ? సినిమా శతదినోత్సవం జరపడమా? గ్రామ చావిడిలో కూచొని కోత, పైకోత అనడమా ? తలనెరిసినవాళ్ళంతా ఎన్నికల్లో నిలబడతారు. లండన్ వెళ్ళివచ్చినవాళ్ళూ, రిటైరయిన జిల్లాజడ్జీలు నుంచుంటారు. రాజకీయ పార్టీలలో కాకలు తీరిన వాళ్ళుగూడా పోటీచేస్తారు... మామిడిపండు పక్కనుంటే ఈతపండు ముఖం ఎవరు చూస్తారు ? పొన్నకాయలాంటివాళ్ళను కాదని నాకు ఓట్లు ఎవరిస్తారుగనక ? నేను నిలబడటం అనవసరం. ఊరుకుండడగ. డిపాజిట్ కాక ఏడెనిమిదివేలు కృష్ణార్పణమవుతయ్. ఆరు నూరయ్యేది, నూరు ఆరయ్యేది- నేనుమాత్రం నిలబడను." అనుకున్నాను.

ఈ చివరి మాటను మాత్రం కొస్తబిగ్గరగా అన్నాను. దాన్ని వింటూనే సుశీలారావు లోపలికి ప్రవేశిస్తూ "నిలబడవూ? ఏం? గుఱ్ఱం వెనక్కి నడుస్తున్నదేం?" అన్నాడు.

నాకు దానంతటదే నవ్వొచ్చింది. "రైళ్లూ, మోటార్లూ వచ్చిన తర్వాత గుఱ్ఱాలు వెనక్కి నడవక ముందుకు నడుస్తయ్యా" అన్నాను.

సుశీలారావు ముఖంలో భారం కనిపిస్తున్నది. పెదిమలు కొరుకుతున్నాడు. నిర్విరామంగా ఆలోచిస్తున్నట్లు బయటికిగూడ కనిపిస్తున్నాడు. నింపాదిగా వీపు దిండుకానించి గడ్డంకింద చెయిపెట్టుకొని సోఫాలో కూచున్నాడు.

"అయితే ఇంతకూ ఈ ఎన్నికల్లో మనం నిలబడగూడదంటావు" అన్నాడు సుశీలారావు.

కొస్త ఆగి నే నన్నాను—"మనం నిలబడవద్దని నేననటం లేదు. నేనుమాత్రం నిలబడటం దండగచేటు అనిమాత్రం చెబుతున్నాను."

"మరి ఎవరు నిలబడుతారు ?"

"అన్నీ కూలంకషంగా తెలిసిన వాడివి నీవే నిలబడటానికి తగిన వాడవు."

"నేను తగినవాడనని నీ వెట్లా అనుకొంటున్నావు ?"

నాకు కొస్త ఊపిరి పీల్చుకొనే ఛాన్సు దొరికింది. వడ్లబస్తాను నా మీదనుంచి అతని వీపుమీదకు మార్చే ఛాన్సు ఇచ్చాడు! "సుశీలరావ్! శాసనసభకు ఎన్నికలు అనంగానే నా కాళ్ళలో పట్టు తప్పుతున్నది. ప్రవాహంలోపడ్డ మత్తికతుమోస్తరుగా నా మనస్సు పల్టీలు కొడుతున్నది.... ఎందుకంటావా ?... దేశంలోవున్న గొప్పగొప్ప వక్తలు, రచయితలు, విద్యావేత్తలు ఎన్నికల్లో పాల్గొంటారు. వాళ్ళతో పోల్చితే సూర్యుని ముందు దీపంబుడ్డివంటివాడను నేను. ఇంగ్లీషులో నోరు మెదపలేను గదా! అధమం అరగంటసేపు మాట్లాడటానికి నాకు ఏవిషయాన్ని గురించీ కూలంకషంగా తెలియదుగదా! ఎన్నడూ మనజిల్లాను దాటి ఒక్క అడుగు అవతలికి వెయ్యలేదుగదా! ఇలాంటివాడిని నేనుగూడా ఎన్నికల్లో నిలబడటం నాకే హాస్యాస్పదంగా వున్నది. ఒక్కటేమాట సుశీలారావూ! యాపిల్ పండు అవతల కన్పడుతూవుంటే నేరేడుపండు చాయలకు ఎవరు

వస్తారూ ?...ప్చ్... నేను తగను. నీవు ఉజ్జీకి సరిపోయేవాడవు. నీవు నిలబడు నిక్షేపంగా వుంటుంది.” అన్నాను.

“నేను నిలబడితే నిక్షేపంగానే వుండవచ్చు గాని, ఓట్లు చస్తే పడవు వెంకటప్పయ్యా ! ” అన్నాడు సుశీలారావు.

“నేను ఒప్పుకోను. నీకు పడని ఓట్లు నాకు పడతయ్యా ?”అన్నాను. సుశీలారావు నా దగ్గరగా వచ్చి కూర్చొని నవ్వుతూ ఇలా అన్నాడు—“అయితే నీకు వయోజన వోటింగు అంటేనూ, ప్రజాస్వామ్యం అంటేనూ కించిత్తుగూడ అంతుపట్టలేదన్నమాట ? ”

“పోనీ నీవు చెప్పు వింటాను” అన్నాను అమాయకంగా.

“ఒకచెట్టు వున్నదనుకో. ఆ చెట్టుయొక్క వ్రేళ్లు గనుక తియ్యటివైతే కాసేకాయలు తియ్యగావుంటయ్. ఆ వ్రేళ్లు గనుక ఉప్పనివైతే కాయలూ ఉప్పగానేవుంటయ్. అట్లాగే ప్రజాస్వామ్యంలో ఓటర్లు ఎలాంటి వాళ్ళవుతే ఎన్నుకోబడే శాసనసభ్యులు గూడ అలాంటివాళ్లే అవుతారు. అంతేగాని క్రొత్తస్వభావంగలవాళ్లెవరూ ఎన్నుకోబడరు.”

“నీవు చెప్పేది నాకు బోధపడటంలేదు.”

“ప్రజాస్వామ్యంలో ఓటర్లు ఎలాంటి వాళ్ళవుతే వాళ్లు ఎన్నుకొనే ఎం. ఎల్. ఏ. లు గూడ అలాంటివాళ్లే అవుతారు. దేశంలో కులాలవారీగా మనుషులు ద్వేషించుకుంటున్నారు. అజ్ఞానం, అవివేకం ఆవరించి వున్నది. సంతకం పెట్టగలవాళ్లు నూటికి పదిహేనుమందికంటె లేరు. అలాంటివాళ్ళు ఇపుడు వయోజను లవుతేచాలు ఓటింగుహక్కు పొందుతున్నారు. ఇలాంటివాళ్ళు విజ్ఞానవంతుల్నీ మేధావుల్నీ ఎన్నుకోరు. తమలాంటివాళ్ళనే ఎన్నుకుంటారు. డిగ్రీలున్నవాళ్లు గనుక నుంచుంటే సోదిలోకిగూడ రాకుండా పోతారు. ఎం. ఏ. ప్యాసైనవాళ్లు డిపాజిట్టు దక్కక తలఎత్తుకోలేక పోవలసి వస్తుంది! అందువల్ల శాసనసభకు నిలబడేవారు తనలో ఓటర్ల గుణాలు ఉన్నాయా అని చూచుకోవాలిగాని ఓటర్ల ఊహకు అందని సద్గుణాలకోసం తాపత్రయపడకూడదు.”

అతను నాకుచెప్పిన సంగతులన్నీ కొత్తగాను వింతగాను వున్నాయి. “అయితే ఓటర్లు నన్ను ఎన్నుకోవచ్చునని ఎట్లాఅనుకుంటున్నావు?” అని అడిగాను.

"ఆదే చెప్పబోతున్నాను. మనప్రాంతంలో ప్రజలు ఒకరిని దూషించవలసివచ్చినా, భూషించవలసివచ్చినా కులాలనుబట్టి ఆలోచిస్తారు. హైస్కూలులో ఒక విద్యార్థికి బంగారుపతకం బహూకరించారని తెలిస్తే అతను మనకులంవాడేనా అని ఆరాతీస్తారు. ఒకడికి ఉద్యోగం ఇవ్వాలంటే అతనికులం ఏమిటని ప్రశ్నిస్తారుగాని యోగ్యత ఏమిటని ఆలోచించరు. అలాగే రేపు ఎన్నికలప్పుడు అభ్యర్థుల సిద్ధాంతాలను గురించి ఓట్లు లేని పిల్లకాయలు చర్చిస్తారు. ఓట్లున్న పెద్దవాళ్లు మాత్రం అభ్యర్థి మన కులస్థుడేనా అని ఆలోచిస్తారు."

ఇదంతా వింటుంటే ఇంతవరకూ నామనోనేత్రానికి దూరంగావున్న సత్యాలను భూతద్దంతో సుశీలారావు చూపిస్తున్నాడనిపించింది.

"దీన్నిబట్టి చూస్తే మన నియోజకవర్గంలో ఏ కులస్థులు అధిక సంఖ్యాకులుగా వున్నారో ఆ కులస్థుడైతే సులభంగా గెలుస్తాడు. నీ కులస్థులు మనఫిర్కాలో షుమారు నూటికి 60 మంది వున్నారు. ఇక నీకు భయమేమిటి? ఫిర్కాలో మాట చెలామణి అయ్యేటువంటి పుల్లయ్య మనవైపున వున్నాడు. పోతే రామిరెడ్డి తనబలంతో మనకు పోటీపెట్టించవచ్చు. కాని విభీషణుని లాంటి కోటిరెడ్డి మన పక్షాన వున్నాడుగా! ఇక దిగులెందుకు? మనం ఇప్పటికే ఉద్యోగస్థులనూ, కుఱ్ఱకారునూ మన గుప్పిట్లో వుంచుకుంటిమిగదా!"

సుశీలారావు - మాటలనుబట్టిచూస్తే ఆ లేబర్ పార్టీ కార్యదర్శి నాతో అన్నమాటలు గుర్తు వచ్చాయి. మీరైతే గెలుపు ఖాయం అని మీ దగ్గరకు వచ్చానని నాతో అన్నాడు. అతని ఉద్దేశ్యంగూడ ఇదే అయివుంటుంది!

ఎండిపోతున్న మొక్కకు సుశీలారావువచ్చి చెంబెడునీళ్లు పోశాడు. ఆశ అనేది మనుషుల్ని నడిపిస్తున్న జీవశక్తి. ప్రతివాడూ విజయం అనుమానాస్పదంగా వున్నపుడు నాకెందుకులే ఈ గొడవ అని వూరుకుంటాడు. కాని నలుసంత ఆశగనుక వుంటే కాలు ఝాడిస్తుంటాడు. గాలి దూరేసందువుంటే చాలు; పాకుకుంటూ పైకిపోదామని చూస్తుంటాడు. నేనుగూడ మొదట కొండను ఢీకొనే పొటేలు మాదిరిగా నిష్ప్రయోజన మనుకొన్నాను. కాని సుశీలారావు నాకు విజయం ఎందుకు రాక తప్పదో

అణాపైసలుతోసహా లెఖ్ఖవేసి చెప్పటంవల్ల కార్యరంగంలో దుముకటానికి సిద్ధపడ్డాను.

ఊదుకుంటూ నేరేడుపండు తినేవాళ్లు యాపిల్ పండ్లజోలికి పోగుతే అనిపించింది!!

# 17. శంఖారావం

రెండవ ప్రపంచయుద్ధం వచ్చి ఊడిపోయిన గుణ్ణపు నాడాలకు గూడా విలువ కలిగించినట్లు ఎన్నికల పుణ్యమా అని మా ఫిర్కాలో గోళ్లు గిల్లుకొనేవాళ్లందరికీ పనికలిగింది. "ఎల్లవేళలందును ఇడ్లీ దొరకును" అని కాఫీహోటళ్ళ ముందు బోర్డులు కట్టారు. కారు డ్రైవర్లకు తాకిడీ ఎక్కువైంది. పెట్రోలు బంకులు నీటి పంపుల్లాగ పనిచేస్తున్నయ్. కవులకూ, గాయకులకూ విలువ ఏర్పడింది. అందరి జేబులూ బరువుగా కనపడుతున్నయ్. ముసలమ్మల దగ్గరనుంచి బటానీలు అమ్మేవాడివరకు అందరూ రాజకీయాలను గురించే బలంకొద్దీ మాట్లాడుతున్నారు.

ఉన్న పార్టీలు చాలక పెరుమాళ్లుపార్టీ అని ఒకటి వెలసింది. చిరుతలు పుచ్చుకొని తెల్లవారుజామున వీధిల్లో తిరుగుతూ సంకీర్తన చేసే భక్తుడొకడున్నాడు. అతడు భక్తియోగంలోనుంచి ఉవాలున కర్మయోగంలోకి గంతువేశాడు. బహుశా ఒకటి జరిగుంటుంది. శివరాత్రినాడు రావిచెట్టంత ప్రభలు కట్టుకొని వీరంగం వేసుకుంటూ జనం కోటప్పకొండకు పోతారు. సముద్రంలాంటి ఆ జనాన్ని చూసి ప్రజలకు దేవుడంటే భలే ఇష్టమున్నదని కనిపెట్టాడు. ఈ భక్తిని దేవుడు ఎట్లాగూ వాడుకోలేకపోతున్నాడు గనుక తను వాడేద్దామని చూశాడు. కనపడ్డవాళ్ళకల్లా నమస్కారాలు చేసి చెప్పాడు. వాకిలిముందు పెరుమాళ్లుపార్టీ కార్యాలయం అని బల్ల చెక్కించి పెట్టాడు. ఆయన సతీమణి బిందె చంకనపెట్టుకొని చెరువుదగ్గరకు వెళ్ళివచ్చిన వాళ్ళందరికీ నిలబెట్టి నూరిపోస్తున్నది పెరుమాళ్లుపార్టీ అవసరాన్ని గురించి. కోటప్పకొండకు వెళ్ళినవాళ్ళంతా తలాఒక ఓటు వేయక పోతారా అనుకొని నామినేషన్ దాఖలుచేశాడు. తన ఏజంటుగామాత్రం

మానవమాత్రు లెవరూ తగరని సాక్ష్యోత్తూ ఏడుకొండల వెంకటరమ ణయ్యను నియమించాడు. రిటర్నింగు ఆఫీసరు నామినేషన్‌ను భద్రంగా రిటరన్ చేశాడు !

నామినేషన్లు దాఖలు చేయటం స్నాతకవ్రతంలాంటిది. సుశీలారావు ఉన్నట్లుండి రాష్ట్ర రాజధాని అయిన కుంభకోణం వెళ్ళి తిరిగివచ్చాడు. జనతాపార్టీ అగ్రనాయకులతో మాట్లాడాడు. జనతాపార్టీ తరఫున తిమ్మాపురం నియోజకవర్గానికి అభ్యర్థి దొరక్క సతమతమవుతున్నారట. వాళ్లు నాకు పార్టీ టిక్కెట్టు ఇస్తామన్నారట. సుశీలారావు వచ్చి నన్ను జనతాపార్టీ తరఫున నామినేషన్ వెయ్యమన్నాడు.

నాకు కోపంవచ్చింది. “మన డబ్బుతోటీ, మన పలుకుబడితోటీ మనం నిలబడుతూ వాళ్ళ ముద్ర దేనికీ? వాళ్ళవలన మనం గెలిచినట్లు పేరు దేనికీ?” అని అడిగాను.

“నిజమే. స్వయంగా నిలబడవచ్చు. కాని గెలవటంమాత్రమే మన ఉద్దేశ్యం కాదుగా. ఆతర్వాత ప్రజలకు సౌకర్యాలు చేయించాలి. అందు కోసం ఉత్తరోత్తరా శాసనసభలో మెజారిటీ వచ్చే లక్షణాలు ఏపార్టీకి వున్నాయో, ఆపార్టీ టిక్కట్టుమీద నిలబడటం శ్రేష్ఠమైనపని. మన సత్తువతో వాళ్ళ పేరుమీదగనుక ఇపుడు గెలిస్తే, ఆతర్వాత వాళ్ళ సత్తువను మన పేర వాడుకోవచ్చు” అని సుశీలారావన్నాడు. నేను నిజమే ననుకున్నాను. జనతాపార్టీ తరఫున జనరల్ సీటుకు నామినేషను దాఖలు చేశాను.

రిజర్వుసీటుకు మాతో స్కూలుఫైనలుదాకా వచ్చి బండి ఆపిన జకరయ్యను నిలబెట్టాం. అసలతను నుంచోనన్నాడు. గెలవలేనన్నాడు. డబ్బులేదన్నాడు. ఇంకా తప్పుకోటానికి పనికివచ్చేవన్నీ అన్నాడు. మేం నలుగురం వెళ్ళి పురి ఎక్కించి ఒప్పించాం. డిపాజిట్ మేమే కట్టాం. ప్రచారానికి డబ్బు మేమే ఇచ్చాం. నీ కెందుకు మేమున్నాంగా అన్నాం. ఇంతపనీ చేస్తే అతను రెండురోజుల కొకసారి కనపడి ఇంట్లో బియ్యం లేవం టాడు. పెళ్ళానికి మందు కొనాలంటాడు. నాకెందుకు? నేను తప్పుకుంటా నంటాడు. ఈ అపశకునసంపత్తి మనకెందుకు- నామినేషన్ ఉపసంహరిం చేద్దామన్నాను. సుశీలారావు ముక్కుమీద వేలువేసుకొని తప్పు

తప్పన్నాడు. అతని జాతకానికీ, మనజాతకానికీ లంకె వున్నదన్నాడు. సరేనని వూరుకున్నాను.

ఆఖరుక్షణంలో అడ్వకేటు సోమసుందరంగారు లేబర్‌పార్టీ తరఫున అభ్యర్థిగా నిలబడ్డాడు. నాకు పిడుగుపడ్డంతపనీ అయింది. ఆయన గ్రంథ రచయిత. లాలా లజపతిరాయ్ జీవితచరిత్రను ఉపన్యాసాలతోసహా తెలుగులో రచించాడు. విప్లవవీరుల చరిత్ర అని మరొక చక్కనిగ్రంథం అచ్చువేయబోతున్నాడు. సంస్కృతంలో ప్రావీణ్యం సంపాదించినవాడు. ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ గుక్కతిప్పుకోకుండా ఉపన్యసించగలడు. మావూళ్లో ఏసభ జరిగినా అధ్యక్షస్థానం ఆయనకు రిజర్వుచేసి వుంచుతారు. ఈమధ్య ఆయన జనతాపార్టీని మెచ్చుకుంటూ మాట్లాడటం ఆరంభించాడు. కొన్ని వ్యాసాలుగూడ వ్రాసి పత్రికల కిచ్చాడుగూడాను. జనతాపార్టీవాళ్ళు ఆయనకు టిక్కెట్టు ఇవ్వక శ్రేష్ఠుడననే ఉద్దేశ్యంతో నాకిచ్చారు. మరి ఆయన నిజాయితీగలవాడైతే నన్ను బలపరచాలిగాని తాను మరొక పార్టీతరఫున పోటీ నిస్తాడా ? తప్పుకాదూ ? ఐనా నిలబడ్డాడు. రామిరెడ్డి ఆయన్ను నిలబెట్టించాడు ! పైగా జనతాపార్టీ ఆశయాలు మంచివే గాని రాష్ట్రనాయకులకు బుద్ధి లేదన్నాడు! సోమసుందరంగారు నిలబడటంగూర్చి నీ వేమనుకుంటున్నావని సుశీలారావు నడిగాను. గుడ్డికన్ను, మూస్తేఎంత తెరిస్తే ఎంత అన్నాడు సుశీలారావు. ఏమో నాకు మాత్రం భయంగానే వున్నది.

ఆడవాళ్లుగూడా లంగోటాలు బిగించి గోదాలోకి దిగారు. మహిళా పార్టీ తరఫున జనరల్ సీటుకి లేడీడాక్టరు సుభద్రను నిలబెట్టారు. రిజర్వు సీటుకి పంతులమ్మ తాయారమ్మ నుంచున్నది. ఇద్దరూ రాజకీయాలకు క్రొత్తవాళ్ళే. సగంవోట్లు మనవేగదా అనే ధీమాతో నామినేషన్లు వేశారు. వాళ్ళదంతా లాటరీబేరంలాగ వున్నది.

నామినేషన్లు ఎవరూ ఉపసంహరించుకోలేదు. లేబర్‌పార్టీ రిజర్వు సీటుకు గూడ జోసెఫ్ అనే అనామకుణ్ణి నుంచోపెట్టింది. మొత్తం ఆరుగురు అభ్యర్థులు; రెండుసీట్లూను. జనరల్ సీటుకీ రిజర్వుసీటుకీ కూడా ముప్పేటపోటీలు ఏర్పడినయ్.

ఎన్నికలింకా 15 రోజులున్నయ్. పరీక్షలముందు విద్యార్థుల మాదిరిగా నిద్రాహారాలు లేకుండా సతమత మవుతున్నాం. మూడు రోజుల

కొక కరపత్రం చొప్పున వేస్తున్నాం. ఫిర్కాలో సన్యాసులు తిరిగే నట్లు తిరుగుతున్నాం. అగ్రనాయకుల్ని పిలిపించి సభలు జరుపుతున్నాం. ఎరగనివాళ్లతో ఎరిగినట్లు మాట్లాడుతున్నాం. ఓడటం గెలవటం తరువాత సంగతిగాని ప్రజల దగ్గరికి పోవటానికి మంచి అవకాశం కలిగింది.

# 18. ప్రచార సంరంభం—1.

మా పార్టీ నాయకుల్లో మంచి మేధావు లున్నారు. ప్రజల కోరికలన్నీ ఒక జాబితా వ్రాసి దాన్ని మా ఎన్నికల ప్రణాళికలో చేర్చారు. హైస్కూలు వున్న ప్రతి గ్రామములోనూ ఒక సినిమాహాలు ఏర్పాటు చేస్తామన్నారు. పురుషులకు స్త్రీలతో సమానబాధ్యతలూ, స్త్రీలకు పురుషులతో సమానహక్కులూ కలిగిస్తామన్నారు. అటు బంగాళాఖాతంలోకి రాయలసీమ నుంచి మట్టితోలించి ఒక లక్ష ఎకరాల మేర భూమిని విస్తరింప జేసి కొబ్బరితోటలు వేయించుతామనీ, ఇటు రాయలసీమలో గుంటలు పెట్టబడ్డచోట్ల ఏర్పడే చెరువులద్వారా వ్యవసాయాన్ని పెంపొందించుతామనీ వ్రాశారు. రాష్ట్రంలో ఒక పది గుడ్డల మిల్లులు కొత్తగా స్థాపించి చేనేత సమస్యను పటాపంచలు చేస్తామన్నారు. రైలుపెట్టెల్లోనుంచి టిక్కట్టులేని ప్రయాణీకులను నిర్మొహమాటంగా దించివేసి వాళ్ళకోసం ప్రతి గూడ్సుబండికీ ఒకొక్క ప్యాసింజరు పెట్టెను తగిలిస్తామన్నారు. ఎండుగడ్డిలోనుంచి ఆహారం తయారు చేయించటంకోసం పరిశోధనలు జరిపించి దానిద్వారా ఆహార కొరత తీరుస్తామనీ, ఇట్లాగే యూక్రైన్‌లోనూ మెక్సికోలోనూ చేస్తున్నారనీ వ్రాశారు ... అద్వితీయము, అమోఘము అయిన ప్రణాళిక అని చదివినవాళ్ళు అన్నారు. ఓర్వలేనివాళ్ళు దీన్ని చూచి వెకిలినవ్వు నవ్వారు. గడ్డి తినిపిస్తారుట అని ఎత్తిపొడిచారు. గుంటలు తవ్వుతారట అని ఎగతాళి చేశారు. పోనీ వాళ్ళ పాపాన వాళ్లే పోతారని నేననుకున్నాను. జర్మనీవాళ్లు బొగ్గులోనుంచి వెన్నపూస తయారుచేయగాలేంది, గడ్డిలోనుంచి రొట్టెలు తయారుచేస్తే తప్పా? పూర్వులు తింటున్న మెతుకులే మనంగూడ తింటే ఇక అభివృద్ధి ఎలా వస్తుంది? పాతకాలానికి పరువులు తియ్యటమంటే ఇదేగా?

కుంభకోణంనుంచి వచ్చే "మసాలా" దినపత్రిక సంపాదకునితో మా జనతాపార్టీవాళ్ళు మాట్లాడివచ్చారు. ఎన్నికల్లో మా పార్టీని అన్ని

'విధాలా బలపర్చటానికీ, మా పార్టీ ఎన్నికల సంగతులన్నీ ఫొటోలతో సహా ఎప్పటికప్పుడు ప్రచురించటానికీ ఆయన ఒప్పుకున్నాడు. త్వరలో ఆ సంపాదకునికి జరుగబోయే షష్ఠిపూర్తి ఉత్సవసందర్భంలో మా జనతా పార్టీ అభ్యర్థులందరూ తల 200 రూపాయలువంతున నిధి సమర్పించడానికి గూడా ఒప్పందం చేసుకున్నారు.

సుశీలారావుకు చేతినిండా పని తగిలింది. "మసాలా" దినపత్రికకు మా వూరి తరపున విలేఖరి సుశీలారావేనని ఇంతకుముందు మనవిచేశాను. అతను ప్రతిరోజూ నన్నుగురించిన ఏదో ఒక వార్త పత్రికలో పడేటట్లు శ్రద్ధ వహించాడు. కొన్ని కృష్ణలీలలుగూడ అతను చెయ్యకపోలేదు. నరసింహస్వామి తిరణాల సందర్భంలో రథయాత్రలో పాల్గొన్న సాగరం లాంటి ప్రజాసమూహాన్ని ఫొటోతీసి దానిక్రింద "జనతాపార్టీవారు తిమ్మాపురంలో ఊరేగింపు జరుపుచున్న దృశ్యం" అని వ్రాసి పత్రిక్కు పంపాడు!... ద్వారం వెంకటస్వామినాయుడుగారి పాటకచ్చేరి వింటున్న మహాజనులను ఫొటోలోదింపి జనతాపార్టీ అభ్యర్థి శ్రీ వెంకటప్పయ్యగారి మహోపన్యాసాన్ని ఆలకిస్తున్న ప్రజావాహిని అని వ్రాసిపంపాడు!... ప్రచారంగురించి జరిగిన సభలకంటె పత్రికలో వచ్చిన రిపోర్టులే ఎన్నోరెట్లు బాగున్నాయిని రెంటినీ పరిశీలించిన వాళ్లు అన్నారు.

ప్రజలకు లక్షపనులుంటయ్. ఉద్యోగాలు చేసుకోవాలి. వంట చేసుకోవాలి. పిల్లల్ని ఆడించుకోవాలి. మందులు తెచ్చుకోవాలి. నిద్ర పోవాలిగదా. అలాంటివాళ్లు మనం చీటికీమాటికీ పెట్టే ప్రతిసభకూ వచ్చి వినమంటే ఎలావస్తారూ? రావటం కష్టం. అయినా సభలు జయప్రదమయ్యే మార్గం వెతకాలి. ఇదివరలో యన్టీ రంగారావు, విలాసిని, శంభులింగంగార్లు శతదినోత్సవం చేస్తామంటే వచ్చారు. ఇపుడుగూడ వీలుచేసుకొని వస్తే బాగుంటుంది. సుశీలారావుతో ఈమాట చెప్పాను. అతను వుత్తరంరాసి కనుక్కున్నాడు. ప్రస్తుతం వాళ్లు రికామీగావున్నారట. ఏదో కొస్త ముట్టచెపితే వచ్చి వాలుతామన్నారట. సరేనని ఒక 15 రోజుల పాటు వాళ్ళను వచ్చి మాఫిర్కాలో మకాం పెట్టమన్నాం. ఆరువేలకు చెక్కురాసి ఇస్తామన్నాం. సరే వచ్చారు.

బహిరంగసభల్లో దినం విడిచి దినం వాళ్ళచేత నాటికఒకటి వేయిద్దామనుకున్నాం. ఏంనాటిక వేయిస్తే బాగుంటుంది? సాంఘికనాటికలు

వేయిస్తే జనం అర్థంచేసుకొనే స్టేజీలో లేరు. బకాసురుడూ, ఘటోత్కచుడూ అయితేగాని వాళ్ళకు అంతుపట్టరు. ఆలోచించిచూస్తే ద్రౌపదీ వస్త్రాపహరణంమీద ప్రజలకు బాగా మోజున్నట్లు అనిపించింది ఆ నాటకం మొత్తాన్ని వేసే ఓపిక నటకులకుగాని, చూచేఓపిక ప్రేక్షకులకుగాని లేదు. అందుచేత 15 నిముషాల్లో అయిపోయేటట్లు ద్రౌపదీ వస్త్రాపహరణదృశ్యంమాత్రం విడిగా వేయించాం. విలాసిని ద్రౌపది వేసింది. దుశ్శాసనుడు ఎవరు వేయాలని పేచీవచ్చింది. యస్వీ రంగారావు తనకే ఆ అధికారం ఉన్నదంటాడు శంభులింగం తాను అర్హుడనంటాడు. రెండూ నిజమే! చెరొకసారి దుశ్శాసన వేషం వెయ్యటానికీ, రెండోవాడు శ్రీకృష్ణ పాత్ర వేయటానికీ సమాధానపడ్డారు. జనం విరగబడి వచ్చేవాళ్లు. మా సభలన్నీ దాదాపు జయప్రదంగానే జరిగాయి.

'దాదాపు' అని ఎందుకనవలసి వచ్చిందంటే, ఒక్కసభలోమాత్రం ప్రమాదం జరిగింది. నాటిక వుంటుందిగదాఅని జనం మందలు మందలుగా వచ్చారు. ఆనాడు జనతాపార్టీ ఆలిండియా నాయకులొకరు ఉపన్యాసం ఇస్తున్నారు. జనాన్నిచూస్తే ఆయనకు పరమానందంకలిగింది. జనం మధ్యలో లేవకుండా వుండటం చూచి ఆయనకు మంచి హుషారు వచ్చింది. ఉపన్యాసం ఉపక్రమించాడు. గంట అయింది; రెండుగంటలయింది; మూడో గంటలో 30 నిముషాలు దాటింది. ప్రజల్లో మాట లారంభమైనయ్. "హాం" అని ఒకమూలనుంచి అంటున్నారు. "విలాసిన్ని తీసుకురండి" అని కేకలువేశారు. పాపం ఆయన వేదిక దిగారు. ఇక నాటిక ఆరంభం కావాలి.

కాని నటకులు రాలేదు. ఇంటిదగ్గర భీష్మించుక్కూచున్నారట సంగతి ఏమిటని మహాలింగాన్ని అడిగాను. "మనం ఇచ్చిన చెక్కు డిజానరయిందట" అన్నాడు! నాకు కొండకూలి మీదపడ్డంత పని అయింది. ఇక మార్గ మేమిటన్నాను. నా కంఠంగూడ రుద్ధమైపోయింది. ఇన్ని వేల మంది జనమూ ఏం చేస్తారో ననుకున్నాను. కొండయ్య నాతో కంగారు పడవద్దన్నాడు. స్టేజి ఎక్కి పదినిముషాల్లో నాటిక ఆరంభమవుతుంది ఎక్కడివాళ్ళక్కడ కూర్చోండన్నాడు. ఈలోగా కారులో మేమంతా ఇళ్ళదారి పట్టాం. మొసలినోటినుంచి బయటపడ్డట్లుగా వున్నది నాకు. తర్వాత కొండయ్య జనాన్ని సర్ది పంపించాడుట!

---

# 19. ప్రచార సంరంభం (2)

మా పార్టీయొక్క జండాను నిర్ణయించటంలోనే అగ్రనాయకుల యొక్క తెలివితేటలన్నీ పొదుగబడి ఉన్నాయని ఎవరైనాసరే అంగీకరించక తప్పదు. లేత నీలిరంగు గుడ్డమీద తెల్లరంగుతో మూడు మామిడి కాయలగుర్తి వేయబడివుంటే అది మా జనతాపార్టీ జెండా అన్నమాట. పార్టీ ఆశయాలూ, సిద్ధాంతాలూ ఇందులో గర్భితమై వున్నాయి. ఈ విశ్వమంతా నీలిరంగులోనుంచే ఉద్భవించింది. సముద్ర మధ్యలోకి పోతే నీరు నీలంగా వుంటాయి. యమునానది నీలంగానే వుంటుందిగదా! శ్రీకృష్ణపరమాత్ముడు నీలిరంగులోతప్ప దర్శన మివ్వడుగదా! అసలు ఆకాశమే నీలంగా వుంటుంది. ఈ పాడు బతుకుమీద ఋణం తీరినవారంతా ఆ అనంతాకాశంలోనే లీనమవుతారట! వీటన్నిటినీ ఆలోచించి మా జెండారంగును లేత నీలిరంగుగా నిర్ణయించారు.

ఇక పోతే మూడు మామిడికాయలసంగతి—— అగ్ని లేకుండా మనకు క్షణం గడువదుగదా! వంటచేసుకోటానికీ, నీరు కాగబెట్టుకోటానికీ అవసరమయే నిప్పుసంగతికాదు నేనుచెప్పటం. పురుషులలో అధిక సంఖ్యాకులు, స్త్రీలలో అల్పసంఖ్యాకులూ ఉండుండి పక్కనున్నవాళ్ళను "అగ్గెపెట్టి వున్నదాఅండీ" అని అడుగుతూ వున్నారు. దీన్నిబట్టే గ్రహించవచ్చు ప్రజలు ఎంతగా అగ్నిపూజ చేస్తున్నారో. ఈవిషయాన్ని గ్రహించే పార్టీజెండామీద మూడు మామిటికాయల గుర్తువేశారు. ప్రజల అభిమతాలను జనతాపార్టీ మన్నించుతుందనటానికి ఇది ప్రబల నిదర్శనం. మా ఎన్నికల చిహ్నంగా గూడ మూడు మామిడికాయలే గుర్తుగా తీసుకోబడింది.

మహిళాపార్టీవారి జెండా ఆకుపచ్చరంగులో వుంటుంది. ఆ జెండామీద చంద్రహారం పసుపుపచ్చరంగులో ముద్రించబడివుంటుంది. స్త్రీల కనీసపుకోర్కె చంద్రహారం అని దాని అర్థమట! "సైకిలుతొక్కుచున్న స్త్రీ" మహిళాపార్టీ తన ఎన్నికలగుర్తుగా స్వీకరించింది!

లేబర్‌పార్టీ నల్లరంగు గుడ్డమీద తెల్లని పలుగు, పార గుర్తువేసి దాన్ని తమజెండా అని చెప్పుకుంటున్నారు. నల్లజెండా తాము స్వీకరించటంవలన అదేమీ శోకచిహ్నముగాని అసమ్మతి సూచనగాని కాదనీ,

లోకమంతా కటిక చీకటిలో కప్పబడివున్నది గనుక దాన్ని పలుగూ పార అతో పైకి పెకలించాలని అర్థం చెప్పారు! వాళ్ల ఎన్నికలగుర్తు గూడా పలుగూ పారే!

ప్రచారం జోరుగా సాగుతున్నది. సర్కస్సులో కళ్ళకు గంతకట్టుకొని ఒకడు కత్తులను విసురుతూవుంటాడు. ఒక తలుపుచెక్కకు ఆనుకొని నిలబడిన స్త్రీకి పక్కగా దూసుకొని పోతుంటయ్ కత్తులుచూస్తుంటే ఏ నిమిషంలో ఆపిల్లమీద పడుతుందో కత్తి అని ప్రేక్షకుల గుండెలు పీచుపీచు మంటుంటాయి. అలాగే ఎన్నికలు దగ్గరపడుతున్నకొద్దీ ఇటు మా వాళ్లూ, అటులేబర్ పార్టీ వాళ్లూ చేరి ఏ నిముషంలో వీపులు చరుచుకుంటారోనని అనిపించేది.

నడిబజారులో గౌతమబుద్ధుడి బొమ్మ ఒకటి వున్నది. ఆ బొమ్మ ముందర ఒక సరివి వాసము పాతి దానికి నీలం జెండా తగిలించు దామని వెళ్లారు మా కుట్టివాళ్ళు. ఇదిచూచి అవతల మూతావాళ్లు ఇంకో రెండు గజాలుంటే బొంగొకటి తెచ్చి నల్లజెండా పాతాలని తయారైనారు. గౌతమబుద్ధుడు జనులకోసం పాటుపడిన వాడనీ, ఆయన బొమ్మదగ్గర జనతాపార్టీ జెండా పెట్టాలనీ మావాళ్ళన్నారు. గౌతమబుద్ధుణ్ణి ఎవరూ కొనుక్కోలేదనీ, ఆయనమీద కాపీరైటు హక్కులు ఎవరికీ లేవనీ, ఆయన ఎవరుపడితే వాళ్ళవాడేననీ లేబరుపార్టీవాళ్ళన్నారు. మా కుట్టివాళ్ళకు రోషంవచ్చి నాలుగు ఇచ్చుకుందామని చొక్కాలు పైకి మడిచారు. కాని ఈలోగా దేవుడల్లే మా వూరి హెడ్మాష్టరుగారు అక్కడికి వచ్చి "చచ్చిపోయిన గౌతమబుద్ధుడికోసం కొట్టుకోకండి. అహింసామూర్తి యొక్క విగ్రహంముందు నరబలి ఇవ్వబోకండి. బుద్ధుడి బొమ్మకు కుడి వైపున ఒకరు, ఎడమవైపున ఒకరు, జెండాలు పాతండి" అని సలహా ఇచ్చి పోయినారు. సరేనని విగ్రహానికి రెండుప్రక్కలా రెండు ధ్వజస్తంభాలు పాతి జెండాలు ఎగురవేశాం.

ఆదివారం ఆదివారం తిమ్మాపురంలోను, వెంగళాయపాలెంలోనూ ఊరేగింపులు జరిగేవి ఫిర్కాలో ఇవి రెండే పెద్దవూళ్ళు. ఊరేగింపులో పాల్గొనటానికి అప్పుడప్పుడు ఎద్దులజతలనుగూడ తోలుకొచ్చేవాళ్ళు. ఊరేగింపు ఎంతపొడుపుగా వుంటే అంత గొప్పగా పరిగణించుతారు.

ఒకనాడు పడుతుందనుకున్న పిడుగు పడకుండా నేపోయింది. ఆనాడు మా ఊరేగింపు ఇటునుంచి ఒక ఇరుకైన సందులోనుంచివస్తున్నది! అదే సందులోకుండా అటునుంచి లేబర్ పార్టీ వాళ్ళ ఊరేగింపువస్తున్నది. మనుషుల్లో హుషారెక్కువయింది రెండు ఖడ్గాలు ఒకదాన్నొకటి ఒరుసుకుంటూ పోయినట్లుగా రెండు వరుసల్లోనూ జనం చెంగు చెంగున నడుస్తున్నారు. ఆకాశం మారుమోగేటట్లు చేతులెత్తుతూ నినాదాలిస్తున్నారు. అవతలివాళ్ల కుడిచెయ్యీ ఇవతలివాళ్ల కుడిచెయ్యీ వెంట్రుక వాసిలో పోతున్నాయి. సందు దాటేలోగా ఎక్కడ చేతులు కలుస్తాయోనని భయంగా వున్నది.

ఇంతలో మాపార్టీలోని ఒక కుఱ్ఱవాడి భుజంమీద అవతలి పార్టీలోని మరొక యువకుడి చెయ్యి పడింది. ఇంకేముందీ! వాళ్లచుట్టూ నలుగురు చేరారు. ఆనలుగురిచుట్టూ పదిమంది చేరారు. గుంపు చూస్తూచూస్తుండగానే పెరిగిపోయింది. "పదండి-పట్టుకోండి-ఊ-చూస్తారేం- దెబ్బకు దెబ్బే" అని మాటలు వినవస్తున్నాయి. ఆనాడు తలకాయలు కొబ్బరి కాయలలాగ ఎగురుతాయని అభిజ్ఞులు భావించారు. అసలు సంగతేమిట్రా అని నేను గుంపులోకి దూసుకుంటూ పోయి ఆయిద్దరు కుఱ్ఱవాళ్ల రెండు రెక్కలూ పట్టుకొని అడిగాను మాపార్టీవాడూ అవతలి పార్టీవాడూ బావమరదులట! వాడిది మావూరుకాదుట. లేబర్ పార్టీ వూరేగింపు కోసం వచ్చాడట. మావాణ్ణి వాడుచూసి చటుక్కున బుజంమీద చెయ్యివేసి "అన్నానికి వస్తానురోయి బావా", అన్నాడట. "ఎక్కడైనా బావ కాని వంగతోటదగ్గర మాత్రం బావకాదురా" అన్నాడట మావాడు. "ఎన్నికలు వచ్చినంతమాత్రాన బావనుకాకపోతానుట్రా" అన్నాడట వాడు. "చుట్టరికం గిట్టరికం జాంతానై" అన్నాడట మావాడు. ఇంతలోకి మిగతా జనమంతా చుట్టూ చేరారు. ఇదీ సంగతి! భలేబాగుంది పదండి పదండి అని మళ్లీ ఎవరి ఊరేగింపులో వాళ్లు చేరి గొంతులు సవరించుకొని నినాదాలివ్వటం ఆరంభించారు.

మహిళాపార్టీవాళ్లు కళ్లు మిరుమిట్లు గొలిపే పని ఒకటి చేశారు. మహిళాపార్టీ రాష్ట్రకార్యాలయం వాళ్లు ఒక పాతికమంది నడివయస్సు స్త్రీలకు సైకలు త్రొక్కటం నేర్పించారట. ఒక నెలరోజులపాటు రాజకీయపాఠశాల ఒకటి నడిపి అందులో ఈకార్యక్రమం తీసుకున్నారు. ఆ 25 మందికీ మాంచి ర్యాలీసైకిళ్లు, కొనిఇచ్చారు. నాలుగురోజుల కొక

సారి ఒక్కొక్క నియోజకవర్గంలోని ముఖ్యగ్రామంలో ఆపాతిక మందీ దేవతాస్త్రీల మాదిరిగా అవతరించి వూరిలోని ముఖ్యవీధులలో గుండా సైకిల్ వూరేగింపు తీసుకుంటున్నారు. ఒకసారి తిమ్మాపురంలోగూడ ఈ కార్యక్రమం తీసుకున్నారు. ముందువైపున లేడీడాక్టరు సుభద్ర, తాయారమ్మగారలు ఒకసైకలు రిక్షాలో కూచున్నారు. వాళ్ల వెనుక ఈపాతిక మందీ బయలు దేరారు. "సైకిలు త్రొక్కుతున్న స్త్రీ" పెట్టెలోనే మీ వోటు అని నినాదాలిచ్చారు. ఆనాడు వూరు వూరూ వచ్చి ఆవిచిత్రాన్ని చూచి విస్తుపోయింది. ముసలమ్మలు ముక్కుమీద వేలువేసుకున్నారు. వయసు మళ్లినవాళ్లు బ్రహ్మంగారి సుద్దులు గుర్తు తెచ్చుకున్నారు. సైకిలు తొక్కగల స్త్రీలు వేధవ మంత్రిపదవి నిర్వహించ లేరా అని అభిజ్ఞులు అన్నారు. కాని తిమ్మాపురంలోని కుఱ్ఱవాళ్ల వోట్లు ఉమ్మడిగా పోయి మహిళాపార్టీ పెట్టెలో పడతాయని గూడ అనిపించింది.

వూళ్లో మనుషులు నానాటికి దొరక్కుండాపోవట మారంభించారు. యుద్ధంరోజుల్లో పాలడబ్బాలు కరువైనట్లు మావూళ్లో చేతిలోకి మనుషులు కరువైనారు. "బ్లాకు"లో దొరుకుతారేమోనని సుశీలారావు వాకబు చేస్తున్నాడు. రోజుకు రూపాయిచ్చి రెండుపూటలా కోమల విలాస్‌లో పావలా పావలా టిఫిన్ పెట్టిస్తామని మేం అన్నాం. పైపోటీకోసం రామిరెడ్డి లేబర్‌పార్టీ తరఫున ఒకపూట భోజనంగూడ పెట్టిస్తామన్నాడు. మేము వీడి అంతు తేల్చుదామని రెంపుపూటలా భోజనం అన్నాం. రామిరెడ్డిమటుకు సామాన్యుడా! కొన్నూర్వరు బెల్టుచెప్పులు కొనిస్తానన్నాడు. ఇట్లావుంది మనుషులధర! రోటిలో తలదూర్చి ఇక వెనుకాడకూడదని మేముగూడా ఒక్కొక్కరికి ఒక చిన్నచొక్కా కొని ఇస్తామన్నాం.... తరువాత మహాలింగం నన్ను దగరకు పిలచి చెప్పాడు. మన పార్టీకుఱ్ఱవాళ్ళలో ఒకడిదగ్గర రెండుపార్టీల బ్రాడ్జీలూ వున్నాయట. వాడు మన బాడ్జీపెట్టుకొని కోమలవిలాస్‌లోనూ తినివస్తాడట. ఒకగంటసేపు జీర్ణకోశానికి విశ్రాంతి ఇచ్చి వాళ్లబాడ్జీ పెట్టుకొనివెళ్ళి ఉడిపి హోటల్లోగూడ పట్టించుకొని వచ్చేవాడట! తరువాతవాణ్ణి దగ్గరకు పిలిచి అట్లా చేయకూడదని మందలించాంలెండి.

ఈ ఓటర్లకొరకు కాని నా తలప్రాణం తోకకువచ్చింది. ఇదివరకు మనుషుల్ని అదిరించీ బెదిరించీ పనులు జరుపుకొనిపోయాం. ఇపుడు అట్లా

పీలు కాకుండా వచ్చింది. 21 ఏళ్లుదాటిన ప్రతివాడూ సామీద తనకేదో అధికారం వున్నదనుకుంటాడు. ఎవరితోనైనా పల్లెత్తుమాట కటువుగా అంటే గుప్పున వూరంతా దుష్ప్రచారం జరిగి వాతావరణం కల్మషమయ్యే ప్రమాదం కనిపించింది. అందుచేత మేకకున్నంత సాధుత్వాన్ని, మహిషానికున్నంత ఓపికను అలవరుచుకున్నాను. కుండలో పెట్టబడి మూతవేయబడిన త్రాచుపాము మోస్తరుగా అహంకారాన్ని పైకుబకనీయకుండా అదిమిపట్టి లోపలే వుంచివేసుకున్నాను. రామలక్ష్మణుల నిద్దరినీ రెండు భుజాలమీదా కూర్చోబెట్టుకొని ఎగిరివెళ్ళిన హనుమంతుని మోస్తరుగా నేనీ వోటర్లను ఉపచారం చేయటానికే ఇక్కడ వున్నట్లు మెలిగాను. నిజానికి నా ప్రవర్తన నాకే ఆశ్చర్యంవేసింది!

---

# 20. ప్రసవ వేదన!

ఎన్నికలనేవి బ్రహ్మదేవుడు చేసిన సృష్టిలోకెల్ల అపూర్వమైన, అధునాతనమైన, అద్వితీయమైన తాజా సరుకు. దీనికిదేసాటి. సంగ్రామంలో మాదిరిగా రెండు పార్టీలుంటయ్. రక్తంమాత్రం కార్చరు. తిరణాలలో మాదిరిగా కారుమేఘాలు పరుగెత్తినట్లు జనం గుంపులు గుంపులుగా తిరుగాడుతుంటారు. నాటకాలూ, బుర్రకథలూ వుంటయ్. ఐతే తిరణాల్లో మాదిరిగా జనం ఒక గాడిలో నడవరు. ఎందరు అభ్యర్థులుంటే అన్నిగాళ్లు వుంటయ్. చేపల బజారులోమాదిరి గందరగోళం వుంటుంది. నీచువాసనమాత్రం రాదు. దీపావళి పండగలో మాదిరిగా తూటాల వంటి అపవాదులను ఒకరిమీది కొకరు గురిచేస్తుంటారు. కాని అగ్నిమాత్రం ప్రజ్వరిల్లదు. హోలీ పండగలో వసంతం చిలికినట్లు ఒకరిమీద ఒకరు పాత చెప్పులు, గులకరాళ్లూ, కోడిగుడ్లూ విసరుకొని ముచ్చట పడుతుంటారు గాని బెంచి మేజిస్ట్రీటుదగ్గరికొచ్చి చార్జి పెట్టుకోరు. ఐతే హోలీ పండగలో సరసం కనపడుతుంది; ఎన్నికలలో విరసం కనపడుతుంది. ఇదీ సంగతి.

అసలీఎన్నికల్లో కనపడే శత్రుత్వంగూడ అన్ని శత్రుత్వాల మాదిరిది గాదు. తండ్రీ కొడుకుల మధ్య, భార్యా భర్తల మధ్య,

అన్నా తమ్ముళమధ్య, నిప్పురాజుకుంటుంది. ప్రేమకూ వాత్సల్యానికీ ఆస్కారంలేదు. దొంగకూ దొంగకూ పరిచయం లేకపోయినా స్నేహితులే అవుతారని ఒక సామెత వున్నది. ఆ ఉపమానాన్ని ఇక్కడ వాడటం సమంజసం కాదేమో నని సందేహిస్తున్నాను. కాని ఒకే పార్టీవాళ్లు ముఖపరిచయం లేకపోయినా స్నేహితులే అవుతారు. "వూళ్లో వున్న కిల్లీకొట్లనుంచి కిరాణాకొట్లవరకు అన్నిటి మొహానా ఫలానాపార్టీ అని ఎట్టగీత గీయబడివుంటుంది! ఈ ఇంటి మీది కాకి ఆ కొంపమీద వాలదు. ఈపార్టీ కుఱ్ఱవాడు అవతలపార్టీ వాడి హోటలు నుంచి రికార్డులు వినపడుతున్నా సరే చెవులైనా మూసుకుంటాడు గాని చస్తేవినడు. ఇలాంటి వాతావరణంలో శాసనసభకు ఎన్నికలు ఆరంభం కాబోతున్నాయి.

భారతయుద్ధంలో శిఖండి ఎంత ప్రయోజకుడో మా ఎన్నికల్లో జైకరయ్య అంత ప్రయోజకుడైనాడు. అతను రాజకీయాలకు పనికి వచ్చే మనిషి కాడు. శాసనసభ్యత్వం నాకెందుకు నా మొహం. ఏదైనా బడి పంతులు పని ఇప్పింపరాదా బతుకుతానంటాడు. పోనీ నాలుగెకరాలు కౌలుకిప్పిస్తే సాగుచేసుకుంటానంటాడు. నోరు మూయించి నిలుచోపెట్టాం రిజర్వుసీటుకి. గాబరా పడవద్దన్నాం. పిల్లవాణ్ణి బుజ్జగించినట్లు బుజ్జగించాం. అతను ప్రచారం చేసుకొని గెలిచేమార్గం చూచుకోవద్దూ? ఊహూ! రోజుకొకసారి కనపడి "విత్ డ్రా" చేసుకుంటానంటాడు. ఈ గ్రహాన్ని వదిలించుకోవాలని నాకు వుండేదేగాని సుశీలారావు ఆమాట ఎత్తవద్దన్నాడు.

ఎన్నికలు ఎల్లుండి అనంగా రాత్రి ఒంటిగంటప్పుడు మహిళాపార్టీ అభ్యర్థులు శ్రీమతి సుభద్ర, శ్రీమతి తాయారమ్మలు ముసుగులు వేసుకొని రహస్యంగా మా యింటికి వచ్చారు. నాకు కళ్లు చెదిరినయ్. మాట తడబడ పడింది. ఆశ్చర్యం వేసింది. నాకళ్లు నేను నమ్మలేకపోయాను. గురకలు పెడుతున్న సుశీలారావుని తట్టిలేపాను. వాళ్లు వచ్చారని చెప్పాను. ఒక్క చిరునవ్వు చిలికాడు. వాళ్ళదగ్గరకు వచ్చాడు. నలుగురమూ నాలుగుకుర్చీలలో ఆసీనులమైనాం.

చాలాసేపు సంభాషణ నడచింది. ఎలాగైనా లేబర్‌పార్టీని గెలవకుండా చేయాలనే నిర్ణయానికి వచ్చాం. మహిళాపార్టీవారు జనరల్‌సీటున్నూ

మానుకు వదలివేయటానికీ, మేము రిజర్వుసీటును మహిళాపార్టీకి వదలివేయ టానికీ ఒప్పందం చేసుకున్నాం. సుభద్ర, శేకరయ్యలు ఇక ప్రచారం ఆపి వేయాలని నిశ్చయించాం. రెండుపార్టీలూ ఐక్యంగా లేబర్‌పార్టీని ఎదు ర్కొంటాయన్నమాట! అప్పటికప్పుడు సైకిళ్ళమీద నియోజకవర్గంలోని అన్ని గ్రామాలకూ కబుర్లు పంపించాం.

మేము తురుపుముక్కలు బయటకు తీసేసరికి రథంకుంగిన కర్ణుడిలాగ సోమసుందరం వర్గీయాలు ముఖాలు వేలాడవేశారు. ఇంతదూరం వచ్చిన తర్వాత పట్టువదలగూడదని ఏదో మొండిగా నిలబడుతున్నారు. సుశీలా రావు మనకు జయంఖాయమని బల్లగుద్ది చెపుతున్నాడు. నామటుకు నాకు ఇదంతా చిత్రంగా వున్నది. ఎన్నికలలో గెలవటంకోసం పోటీపడుతున్న ముగ్గురిలో ఇద్దరు సమాధాన పడడమేమిటి నా మొహాం? అలాగైతే ఇవన్నీ ఉత్తుత్తిపార్టీలూ ఉత్తుత్త విరోధాలేనా? కుస్తీపోటీలకు ముగ్గురు పైల్వాన్లువస్తే వారిలో ఇద్దరు సమాధాన పడటం మనం ఎన్నడూ వినలేదే!

తెల్లవారితే ఎన్నికలనంగా నాటి మిట్టమధ్యాహ్నం 12 గంటలకు మహాలింగం, కొండయ్యలిద్దరూ వచ్చి మూడు కఠోర సమస్యలు తెచ్చి పెట్టారు. మా నియోజకవర్గంలో మట్లూరు అనే గ్రామం ఒకటి వున్నది. ఆగ్రామంలో స్త్రీలకు ఉదయం లేచి బహిర్భూమికి వెళ్లాలంటే మరుగు లేకుండా వచ్చింది. నానాఅవస్థలు పడుతున్నారు. ఆవూళ్లో రెండు వందలు కర్చుచేసి నాలుగు పాకీ దొడ్లు గనుక కట్టించినట్లయితే అక్క డున్న నాలుగువందల ఓట్లు మనకు వస్తయ్. లేకపోతే రావు. ఇదీ సంగతి.

మురికిపూడి అని మరొకవూరు వున్నది. ఆవూళ్లో జనం మంచి కట్టుగా వుంటారు. వాళ్లందరికీ ఒక ముఠా నాయకుడున్నాడు. ఆయన ఎవరికి వెయ్యమంటే వాళ్లు ఓట్లు అతనికి వేస్తారు. ఆముఠా నాయకుడికి ఇక్కాలు పైనలు షుమారుగా ప్యాసైన సుబ్బారాయుడనే కుఱ్ఱవా డున్నాడు. ఆ సుపుత్రుడికి ఏ అభ్యర్థి ఉద్యోగం ఇప్పిస్తానని మాట ఇస్తే ఆవూరి ఓట్లన్నీ అతనికి వేయిస్తానని ఆవూరి ముఠానాయకుడంటు న్నాడు!

పిడుగుపాడు అని ఇంకొకవూరున్నది. ఆ వూరుదగ్గరే చవిటిపర్రు అని ఒక గ్రామమున్నది. ఒకసారి రెండు వూళ్ల కుఱ్ఱవాళ్లూ చెడుగుడు

పందాలాడారు. పిడుగుపాడు టీములో బాగా ఆడేవాడిని చవిటి పర్రువాళ్లు కూతకు వచ్చినపుడు పట్టుకొని కూత ఆపినప్పటికీ మీదపడి కీలు తొలగదీశారు. వాడు 'చచ్చాన్రోయ్' అని కేక వేశాడు. ఇహ ఇంకేముందీ. 'ఆడముండలల్లే ఆడలేక పోగా మావాడి చెయ్యి విరిచేశారా' అని పిడుగుపాడువాళ్లు ఎవరి చేతి కందిన కఱ్ఱలు వాళ్లు పుచ్చుకొని చవిటిపర్రువాళ్ల వీపులు చిల్లు టట్లు కొట్టి విజయోత్సాహంతో ఇళ్లకు చేరారు. చవిటిపర్రు వాళ్లు ఈ అవమానాన్ని భరించ లేకపోతున్నారు. ఇంకొక పదిరోజుల్లో లగ్గం పెట్టుకున్నారు. పిడుగుపాడువాళ్లను కొలవగట్టుమీదకు రానిచ్చి మోతమోగించాలని, కత్తులూ బరిసెలూ సిద్ధం చేస్తున్నారు. తరువాత ఏమి జరిగినా పోలీసులవల్ల ఎలాంటి ముప్పమూ రాకుండా మనం చూస్తామని హామీ ఇస్తే ఆవూరి ఓట్లు మనకువస్తయ్. ఇదీ చవిటిపర్రు పరిస్థితి.

నాకేమీ పాలు పోలేదు. ప్రసవకాలంలో నొప్పులు వచ్చినట్లు ఎన్నికలముందు ఇలాంటి బాధలు తప్పవు లెమ్మని భరించి వూరు కున్నాను. సుశీలారావు సవ్యసాచి మోస్తరుగా ఆజ్ఞలు జారీచేస్తున్నాడు. మట్లూరులో పాకీదొడ్లు కట్టించటానికి అడ్వాన్సుగా 50 రూపాయలు ఆవూరి పెద్దకిచ్చి రసీదు పుచ్చుకోమని ఒకరికి పురమాయించాడు. స్కూలుఫైనలు ప్యాసైన సుబ్బారాయుడు నిక్షేపంగా వచ్చి కంట్రాక్టర్ మహాలింగం దగ్గర తర్ఫీదుపొందవచ్చు; అదీ గాక తిమ్మాపురంలో వుండి టైపు, షార్టుహేండు నేర్చుకోవచ్చు, పంప మనండి అని మరికి పూడికి కబురు చేశాడు, ఇక పోతే పిడుగుపాడు, చవిటిపర్రులు ఒక దాని కొకటి శత్రుత్వంలో వున్నాయి గనుక ఒకవూరు మనపక్షం తిరి గితే రెండవవూరు మనకు వ్యతిరేకమవుతుంది. అందుచేత ఏ వూరిలో ఓటర్లు ఎక్కువమంది వున్నారాఅని సుశీలారావు ఆలోచించి చవిటిపర్రు పెద్దవూరని తెలుసుకొని "పోలీసులు మనంగీచిన గీటు దాటరు. తెలిసిందా?" అని చవిటిపర్రు గ్రామ పెద్దలకు కబురుచేశాడు.

ఎన్నికలంటే మజాగాదు! చాణుక్యుడికున్నంత బుర్ర కావాలి. చదరంగపు ఎత్తులు వేయాలి. "తెరచిరాజు" అని ఆటకట్టించాలి... మైనరును సింహాసన మెక్కించి మంత్రులు పాలించినట్లు నన్ను ఎన్నికలకు నుంచో పెట్టి అన్ని పన్లూ వాళ్లే చూసుకుంటున్నారు. ఎందుకో నామీద ఇంత

అభిమానంకి వీళ్లకు నేను గెలిస్తే ఏమి ఒరుగుతుందో!... మరి నెలరోజుల నుంచి నిద్రాహారాలు లేకుండా కాలికి బలపం కట్టుకొని తిరగటంవల్ల వళ్లంతా హూనం హూనం అయిపోయింది. కూచుంటేనూ నిద్రవస్తున్నది, నుంచుంటేనూ నిద్రవస్తున్నది, నడుస్తుంటేనూ నిద్రవస్తున్నది, మాట్లాడుతుంటే గూడా నిద్ర వస్తున్నది! ఆ రాత్రిగడిస్తే ఎన్నికలు ఆరంభమవుతయ్!... వెళ్ళి పడుకున్నాను.

---

# 21. ప్రశాంత సమరం

అది చూచి తీరవలసిన రోజు. జ్వరం వచ్చినవాడికి శరీరంలోని మూలమూలలా వేడెక్కినట్లుగా పోలింగురోజున నియోజకవర్గంలోని గ్రామ గ్రామంలోనూ కోలాహలంగా వున్నది. అంతటి ఆవేశం అందరికీ ఉమ్మడిగా ఎన్నడూ వచ్చివుండదు. దసరా పండక్కి విల్లంబులు పుచ్చుకొని తిరిగినట్లుగా బడిపిల్లలు జెండాలు పుచ్చుకొని తిరుగుతున్నారు... తిరణాల్లో బుట్టబొమ్మలు నిలబడ్డట్లుగా పోలీసులు అక్కడక్కడ నిలబడి లాఠీలను గాలిలో తిప్పుతున్నారు ... చీమలబారుల మోస్తరుగా ఓటర్లు "బూతు"ల ముందు వరుసల్లో నిలబడుతున్నారు ... యుద్ధరంగంమీద పర్యవేక్షక విమానాలు సంచారం చేసినట్లుగా అభ్యర్థులకార్లు నియోజకవర్గాన్ని అటునుంచి ఇటు, ఇటునుంచి అటూ చుట్టివస్తున్నాయి...తిరుపతి వెంకటేశ్వరస్వామి దిబ్బెన డబ్బులతో నిండినట్లు బ్యాలట్ పెట్టెలు ఓట్లతో నిండుతున్నాయి.

నేనూ, సుశీలారావూ, తాయారమ్మా కలసి చిన్నకారులో ఉదయం బయలుదేరాము. మా ఓట్లు ఓంప్రథమంలోనే పోలుచేశాం. జనతాపార్టీ జెండానూ మహిళా పార్టీ జెండానూ ఏటవాలుగా ఒకదానిమీద ఒకటి పెట్టి కారు ముందు భాగంలో కట్టివేశాం. నీలమూ, ఆకుపచ్చా మంచి కలయికేనని సుశీలారావు అన్నాడు నవ్వుతూ. తాయారమ్మ డిటో అన్నట్లు ఒక చిరునవ్వు పారేసింది. ఆమె ఎక్కువగా మాట్లాడదు. ఎక్కువగా ఏమిటి అసలు మాట్లాడదు. మౌనమే భూషణం అన్న లోకోక్తిని ఆమె చక్కగా వినియోగించుకుంటున్నది. ఆమెగనుక మాట్లా

డితే ఆమెమీద మనకున్న గౌరవం తగ్గే అవకాశాలున్నయ్ ! అందుకని అలాంటి ప్రమాదం ఆమె ఏర్పడనివ్వదు !

మావూరి హైస్కూలు ఉపాధ్యాయులు 50 మంది ఉన్నారు. వాళ్ళు చాలాచోట్లకు ప్రిసైడింగ్ ఆఫీసర్లుగా వెళ్ళారు. ఓటర్లలో నూటికి 80 మందిదాకా తూర్పు పడమరలు తెలియని అమాయకులైన పాటకపు జనం. వాళ్ళు "బూతు" లోకి వెళ్ళి ఆ చీకట్లో పెట్టెల్ని గుర్తుపట్టి వోటు వేయటం సులభమైన సంగతి కాదు. చాలామంది ఓట్లను కంతలో జార విడువకుండా ఆ పెట్టెలమీదనే వదలివేసి వచ్చేవాళ్ళు. మావూరి ఉపాధ్యాయులు నామీది గౌరవంవల్ల గంటకొకసారి బూతులో తనిఖీకోసం వెళ్ళినట్లు వెళ్ళి వెలుపలగా పడివున్న ఓట్లన్నీ మామిడికాయల మార్కుగల పెట్టెలో వేసివచ్చేవారు !

ప్రతి పోలింగుస్టేషను దగ్గరా మావాళ్ళూ, లేబర్‌పార్టీవాళ్ళూ గూడా ఎవరి పంచలోనో ఒకరి పంచలో చేరి నాలుగు కుర్చీలూ ఒక బల్లా వేసి చుట్టూ పార్టీజెండాలు కట్టి వచ్చే వోటర్లను మాదగ్గరకు రమ్మంటే మాదగ్గరకు రమ్మని పిలిచి, వాళ్ళ బాలట్ నెంబరు వ్రాసి చీటీ ఇచ్చేవాళ్ళు. ఒకరిదగ్గర చీటీ పుచ్చుకొని మరొకళ్ళకు ఓట్లు వేసేవారు లేకపోలేదు. కాని ఓటర్లుపదిమంది దగ్గరకు రావటమే ఒక ఘనకార్యంగా ఆ నిమిషంలో అనిపించింది.

ఆనాడు రిక్షాలకూ, ఎద్దుబండ్లకూ, గుఱ్ఱంబండ్లకూ తెగ గిరాకి తగిలింది. మొత్తం వంద రిక్షాబండ్లను మేము కంట్రాక్టు తీసుకున్నాం. ఇంటింటికీవెళ్ళి ఓటర్లను కాళ్ళూ గడ్డమూపట్టుకొని పెళ్ళికి పిలుచుకొచ్చినట్లుగా మా వాళ్ళు పిలుచుకొనివచ్చారు. మధ్యాహ్నం 12 గంటలయ్యేసరికి జనం పల్చబడ్డారు. వాలంటీర్లు తోటకూర కాడల్లాగ వాలిపోతున్నారు. అన్నాలు తినటానికీ, కాఫీలుత్రాగటానికీ ముఠానాయకులు వెళ్ళారు. ఇదేసమయమని లేబర్‌పార్టీ వాళ్ళు చచ్చిపోయిన వాళ్ళవోట్లూ, వూళ్ళోలేనివాళ్ళవోట్లూ వేయట మారంభించారు. మా పోలింగు ఏజంట్లు నాలుగైదుసార్లు ఛాలెంజిచేశారు. ఛాలెంజిచేసినపుడల్లా పదిరూపాయలు సమర్పించుకోవలసివున్నది. ఇది అసాధ్యమైన విషయంగా పరిణమించింది. ఇలాకాదని మా పార్టీవాళ్ళుగూడ ప్రిసైడింగుఆఫీసర్లు అనుకూలంగావున్న పోలింగ్ స్టేషన్లుగా చూచి ఒకవంద చచ్చిన వోట్లను పోలుచేశారు. అవును

మరి. రంగంలోకి దిగినతర్వాత న్యాయమేమిటి అన్యాయమేమిటి! అవతలి వాళ్ళు ఏ ఆయుధం పుచ్చుకుంటే మనమూ ఆ ఆయుధం తోటే ఎదుర్కోవాలి! రుద్రాక్షమాల పుచ్చుకుంటే రాలేదిబూడిదే! ఏమంటారు?

సాయంకాలం సూర్యాస్తమయం ఎంతో రమ్యంగావుంది. చాలా రోజులతర్వాత అస్తమిస్తున్న సూర్యుణ్ణి చూచాను. కారులో వెంగళాయ పాలెం నుంచి తిమ్మాపురం చేరుతుండగా సూర్యుడు అస్తమిస్తున్నాడు. గిలిగింతలు పెట్టే సూర్యకిరణాలు తాయారమ్మను రాచుకుంటూ వచ్చి నన్ను తాకుతున్నాయి. పగలల్లా ప్రభాకరుడు ప్రచండ ప్రతాపాన్ని ప్రదర్శించి లోకాన్ని గగ్గోలుపరిచాడు. ఇపుడే తాను విశ్రాంతి తీసుకుంటూ మానవాళికి విశ్రాంతి నిస్తున్నాడు ఎండిన నేలమీద వర్షం పడ్డట్లు ఆ సంధ్యాసమయంలో మా మనస్సులు అందోళనలనుంచి విముక్తిచెంది విరామంతీసుకుంటున్నాయి. తూర్పుదిశను హిమాంశుడు చల్లని కిరణాలతో సేద దీరుస్తున్నాడు. మా గమ్యస్థానం దగ్గరకు వచ్చింది. వీపుమీదనుంచి వడ్లబస్తా దించివేసినంత ఆనందంకలిగింది. ఇద్దరమూ చల్లని పానీయం పుచ్చుకున్నాం. తోడుపెట్టిన పెరుగుతో భోజనం చేశాం. పిండారబోసిన వెన్నెలలో విశ్రమించాం.

* * *

మూడురోజులు వాటంతటవి గడిచిపోయినయ్.

నాలుగవనాటి ఉదయం 8 గంటలకు తాలూకా కచ్చేరిలో ఓట్ల లెక్కింపు ఆరంభమయింది. నలుగురు అభ్యర్థులమూ నాలుగు చెట్లకింద జేరి నిముషాలూ, సెకండ్లూ లెక్కపెట్టుకుంటున్నాం. వడ్లకొలత కొలిచేటప్పుడు మనిషి దగ్గరున్నట్లు అభ్యర్థులతరఫు ఏజంట్లు ఓట్లు లెక్కింపు దగ్గరవుండి అన్యాయం జరక్కుండా చూస్తున్నారు. గంట కొకమనిషి బయటికివచ్చి ఓట్ల వివరాలు చెప్పి పోతుండేవాడు. మూడువంతుల పెట్టెలు ఐపోగానే నాకు 10 వేల ఓట్లు, సోమసుందరం (లేబర్) గారికి 5 వేల ఓట్లు వచ్చినయ్. మావాళ్ళు అప్పుడే సంతోషంతో పట్ట పగ్గాలు లేకుండా కుప్పిగంతులు వేస్తున్నారు. టీపార్టీ సిద్ధంచెయ్యమని మహాలింగం కోమల విలాస్‌కు కబురుచేశాడు. అపుడు సోమసుందరంగారి పరిస్థితి మరీ జాలి కరంగా వున్నది. లెక్కింపు పూర్తికాకమునుపే ఇల్లు చేరుకోవడం ఉచిత మని అనుకున్నట్లున్నాడు. వెళ్లటానికి ఏమీ కారణం చిక్కక ఆవేపచెట్టు

కిందనే గడ్డంకింద చేతులు పెట్టుకొని కూచున్నాడు. ఇంతలో ఏమను కున్నాడో ఏమోగాని పైగుడ్డ చెట్టుకిందనే పెట్టి పంచె పైకి ఎగగట్టి గోడ చాటుకు పోయినట్లు పోయి అక్కడనుంచి రిక్షా ఎక్కి గప్‌చిప్‌గా ఇంటికి చేరాడు! పైగుడ్డ పారేసుకొని పోయాడే పాపం అని నాకనిపించింది.

ఫలితం ప్రకటించారు. ఐదువేల మెజారిటీతో నేను గెలిచాను. తాయారమ్మ మూడువేల మెజారిటీతో నెగ్గింది. శంకరగిరి స్వాములువారి ఏనుగొకటి ఏదో వూరుపోతూ మా వూళ్ళో ఆగింది. పట్టు పట్టమని ఏను గును తోలుకొచ్చి నన్ను ఎక్కించారు. ముస్లిం పెండ్లికొడుకు మాదిరిగా ముఖం కనబడనంతగా పూలమాలలు వేశారు. ఏనుగువెనుక టాపులేని చిన్న కారులో తాయారమ్మను కూర్చోపెట్టి దండలు వేశారు. ఇలా గెల్చినవారిని ఎలాగూ వూరేగిస్తారని ముందుగా ఊహించుకొని వచ్చిన బ్యాండుమేళంతో ముఖ్యవీధులన్నీ వూరేగాం. బాణసంచా కాల్చారు. అక్కడక్కడ కుర్రవాళ్ళు పిప్పరమెంట్లూ రవ్వలడ్లూ ఏనుగుమీదికి విసి రారు. మొదట్లో ఆగ్రహం వచ్చింది. కాని తరువాత కొంత తమాయిం చాను. నామీద అభిమానంకొద్దీ అలా చేస్తున్నారుగదా అనుకొని చిక్కి నంతవరకూ అందుకున్నాను.

ఆనాటిరాత్రి పొద్దుపోయేవరకు వూళ్లోవున్న పెద్దమనుషు లొక్కొ క్కరే వచ్చి నన్ను అభినందించి వెళ్ళారు. సినిమాహాలు యజమాని స్వ యంగా కారువేసుకొనివచ్చి "ఆవారా" ఫిలిం ప్రత్యేకంగా తెప్పించాను. చూచిపోదురుగాని రండని ఆహ్వానించాడు. మరునాటి ఉదయం వీధిలోకి వెళ్లుదామని చెప్పులు తొడుక్కొని బయలుదేరుతుంటే సుశీలారావు నా దగ్గరకువచ్చి "ఇపుడు నీవు తిమ్మాపురం ఎం. ఎల్. ఏ. వు. అంటే ఇవా నుంచి రాష్ట్రపరిపాలనలో నీకొక స్థానం వున్నది. పూర్వం జాగీరుదార్లు ఎలాంటి వారో నీవలాంటివాడవు. కాలినడకన వీధిలో తిరగడం తప్పు. కాలినడకన బయలుదేరితే మనుషులు నిన్ను ముట్టడివేసి ఏదోఒకటి వెళ్ళ బోసుకుంటారు. వాళ్ళను తప్పించుకోవటం కష్టం. అదీగాక నీ ప్రత్యర్థులు నీకు ప్రమాదం కలిగించటానికి ప్రయత్నించనూవచ్చు." అని సూచనగా అన్నాడు. అతను చెప్పినప్రకారం అవుతే నేనిక "పరదా" చాటున వుండ వలసివచ్చేటట్లుంది. మొత్తానికి పెండ్లిఅయిన అమ్మాయి స్వేచ్ఛ కోల్పో యినట్లుగా నేనుగూడ స్వేచ్ఛను కొంతవరకు కోల్పోవలసివచ్చింది!

---

# 22. ఆర్థిక మాంద్యం

పెళ్ళిచేసిచూడు, ఇల్లుకట్టిచూడు అన్నట్లుగా, ఎన్నికల్లో నిలబడి చూడు అనిగూడ అనవలసి వస్తున్నది. ఇల్లుకడితేనూ పెండ్లిచేస్తేనూ బొంబాయి మిఠాయిలాగ డబ్బులు కరిగేమాట నిజమే. పర్వతం మాదిరిగా అప్పులు పెరిగేమాటగూడ నిజమే. కాని కళ్లముందర నికరంగా ఒక కొంప కనపడుతుంది. అమ్మాయిని ఒకరింటిదాన్ని చేశామనే తృప్తి అయినా వుంటుంది. ఎన్నికలో నిలబడితే అలాంటి నికర లాభ మేమీ కనిపించలేదు. గెలిచామనే నిష్ప్రయోజనమైన ప్రయోజనంమాత్రం ఒకటి వచ్చింది. ఎం. ఎల్. ఏ. అనే డిగ్రీకాని డిగ్రీ ఒకటి వచ్చి చేరింది!

మిత్రులందరమూ సమావేశమైనాం. ఎన్నికలకోసం ఎంత కర్చయిందో, ఎవరెవరి కెంతెంత బాకీపడ్డామో జాబితా తయారుచేసి నాదగ్గరకు తెచ్చారు. వాటి వివరాలు ఇవి:

| లోపలకు దారి! | | బయటకు దారి! | |
|---|---|---|---|
| మహాలింగం ఇచ్చినది | 9000 | కట్టిన డిపాజిట్ | 500 |
| మామగారు ఇచ్చినది | 5000 | "మహాలా" దినపత్రిక ఎడిటర్‌కు షష్ఠిపూర్తికానుక | 200 |
| | | సినిమాతారలకు ముడుపు | 6000 |
| కోమల్ విలాస్‌లో అరువు | 1000 | కొండయ్య అనుచరుల "రెడార్మీ"కోసం కర్చు | 2000 |
| చిల్లరమల్లర అప్పులు | 3000 | పోలీసు సర్కిల్ ఇన్‌స్పెక్టరుకు మోటారుసైకిలు కొని ఇచ్చినది | 1800 |
| తిరిగివచ్చిన డిపాజిట్ | 500 | | |
| | | ఊరేగింపుల్లో పాల్గొన్న ఎద్దులకు మేత | 300 |
| | | వాలంటీర్లకు రొఖ్ఖం | 5000 |
| | | వాలంటీర్లకు కుట్టించి ఇచ్చిన బెన్నీ చొక్కాలకు | 1000 |
| | | కరపత్రాలు, గోడకాగితాలు | 2000 |
| | | భజంత్రీలకు | 700 |
| జొరసి రు | 18,500 | | 18,500 |

ఎన్నికలు రేపనగా పోలీసు సర్కిల్ ఇన్‌స్పెక్టరు అల్లుడి పోజులో వచ్చి నుంచున్నాడట. ఎందుకైనా మంచిదిలెమ్మని సుశీలారావు ఒక మోటారుసైకిలు అతనికి కొని ఇచ్చాడట! ..భజంత్రీలకు అంటే అర్థం గాలిచినతర్వాత గజారోహణ జరిగిన సందర్భంలో ముందునడిచిన మేళగాళ్లన్నమాట.

ఇదీ పద్ధతి. నేను ఈ పళంగా 18000 రూపాయలు ఋణం చేశాను. దీన్ని తీర్చడం ఎలాగు? ఇది నాకు తీరని సమస్య అయింది.

అప్పుఅనేది మనిషిని క్రుంగదీసే ఒకరకపు పిశాచం. ఈ ప్రపంచంలో ఓటమిని భరించవచ్చు; అవమానాన్ని భరించవచ్చు; ఆప్తుల మరణాన్ని భరించవచ్చు; గుండెలమీద బండరాతిని పెట్టినా భరించవచ్చుగాని ఋణాన్ని మాత్రం అభిమానవంతుడెవడూ భరించలేడు. అది మనస్సును శిధిలంచేసివేస్తుంది. నిద్రలోగూడ గుర్తుకు వస్తుంది. సంతోషంగా సినిమాకు పోదామనుకుంటే అప్పు ఇంతవుందిగదా అని గుండుసూదితో గిల్లినట్లుంటుంది. అప్పులవాళ్ళు ఎక్కడ కనిపిస్తారోనని పెద్దబజారులోకుండ పోవటం మానివేసి సందులూ గొందులూ చూచుకోవలసి వస్తుంది. అప్పులవాళ్ళు యమకింకరుల్లాంటివాళ్ళు. వారంట్లు తెప్పించి అవమానంపాలు చేస్తారు. గుంటకుక్కల్లాగ పొంచి వుండి మనం ఎప్పుడు బజారులో కనిపిస్తే అప్పుడు మీదికురుకుతారు అప్పు తీర్చమని. అప్పుఅనేది మనిషిని చెడగొడుతుంది.

ఇవన్నీ ఊహించుకుంటే నా గుండెలు ఝల్లుమన్నయ్. భూమిని మోసే ఆదిశేషువుమాదిరిగా నామీద ఈ బరువు పడిందే అని చింతాగ్రస్తుడనైనాను. సుశీలారావు నావంకచూశాడు. "ఏదో శోకకార్యక్రమంలో వున్నావే!" అన్నాడు. నాకు చిన్ననవ్వొచ్చింది. తల వంచుకున్నాను.

రెండుమూడునిముషాలు గడిచినై. మృదంగంమీద వ్రేళ్లు వేసినట్లు పక్కనున్న ట్రంకుపెట్టెమీద వ్రేళ్ళతోశబ్దంచేస్తూ "శుభమా అంటూ ఎం. ఎల్. ఏ. వ అయితే ఏడుపెంగుకు వచ్చిందంట!" అన్నాడు సుశీలారావు. నిజమే. నాకే నవ్వొచ్చింది. పాము విడుస్తున్న కుబుసంమాదిరిగా నామనస్సును ఆవరించిన "మాయ" అంతర్థానమయేటట్లు కనపడింది అతను వేసిన ప్రశ్నతో. ఎం ఎల్. ఏ. అయినందుకు ఆనందించాలిగాని వెధవ అప్పుల్ని చూచి దిగులుపడుతామా?

"సుశీలారావ్! నెలనెలకూ మానాన్నగారు నామీది వాత్సల్యం కొద్దీ పంపే వందరూపాయలు తప్ప వేరే రాగిదమ్మిడీ వచ్చే ఇరువు లేదు గదా! మరి నా పేరుమీద గత రెండునెలల్లోనూ 18 వేలరూపాయలు అప్పులు తెస్తిమిగదా! ఇలా అప్పుచేశాను ఇమ్మంటే మానాన్న కాకికి విదిల్చినట్లు ఒక వెయ్యి అయినా విదులుస్తాడో ఆసలే లేదంటాడో. ఈ అప్పులిచ్చినవాళ్ళందరికీ ఇవ్వాళ కాకపోతే రేపయినా బాకీలు తీర్చాలి గదా! ఎక్కడనుంచి తెచ్చేది? ఎట్లాతెచ్చేది? నాకేమీ తోచకుండా వున్నది." అన్నాను.

"వెంకటప్పయ్యా! అప్పు తీసుకోడమనేది ఎన్నడూ దోషంకాదు. పదిమందిని ఎరుగున్నవాడికితప్ప ప్రతివాడికీ అప్పుపుట్టటం దుర్లభం. మననోరు మంచిదవుతేనూ, మనగుణం మంచిదవుతేనూ అవతలివాడికి సమయానికి వచ్చి ఆదుకోవాలనిపిస్తుంది. ఎవడికొంపా దోచుకొని మనం డబ్బు తేలేదు. ఎవరి పెళ్ళాల మెళ్లల్లోని గొలుసుల్ని మనం తెంపుకొని రాలేదు. ప్రజాస్వామికపద్ధతుల్లో ఎన్నికలు జరిగాయి. మనంగూడ కాస్తో కూస్తో ప్రజాసేవ చేద్దామనుకొన్నాం. ఎన్నికల్లో పాల్గొన్నాం. కాస్తో కూస్తో డబ్బు అవసరమయింది. మన మేలు కోరేవారూ, మనమీద నమ్మక మున్నవాళ్లూ మనల్ని పిలిచి డబ్బు ఇచ్చారు. పుచ్చుకొన్నాం. ఇందులో నేరమేమీ లేదే!"

నామనసుకు అతనిమాటలు టంకంలాగ నాటుకుంటున్నయ్. కళ్ళార్పకుండా అతనివంక చూస్తున్నాను. అతను చెప్పుకుపోతున్నాడు.

"ఇక అప్పు తీర్చడమంటావా? ఈ 18 వేలలో ఇప్పటికిపుడు తీర్చవలసిన వేమీలేవు. ఎం. ఎల్. ఏ. పదవి ఐదేళ్ళదాకా ఖాయం. ఈలోగా తీరికగా అప్పు తీర్చుకోవచ్చు. దీనికోసం ఏమీ దిగులుపడ నవసరంలేదు. ఇహ నీవు శాసనసభగురించీ, మంత్రివర్గ నిర్మాణంగురించీ, ప్రజాసమస్యలను గురించీ ఆలోచించుకో" అన్నాడు. నేను సరేనన్నాను.

అసలు మా మామగారు 5 వేల రూపాయలు బదులిచ్చారు. ఆయనకు ఒక్కగాను ఒక్కతే కుమార్తె. ఆ అపురూపసుందరిని నాకిచ్చి పెళ్లిచేశారుగదా! ఇకముందు ఆయనకు బిడ్డలు కలుగుతారని ఎవరికీ అనిపించటంలేదు. ఎలాగూ ఆయనకాస్తా గోవిందాఅంటే ఆయనకున్న 50

ఎకరాలూ నావేగదా ! అందుచేత ఆయనకు బాకీ తీర్చడమనేది ఏమంత ప్రశ్న కాదు. ఇస్త్రీవాయనం, పుచ్చుకుంటి వాయనం లాంటిది.

ఇక కంట్రాక్టర్ మహాలింగం గతనాలుగైదేండ్లలోనూ బాగా పుంజుకున్నాడు. ఒక చక్కని డాబా కట్టించాడు. బ్యాంకులో నిల్వవున్నది. కారు కొందామని చూస్తున్నాడు. అతను పైకి రావటానికి నా పంచాయతీ బోర్డు అధ్యక్షపదవి కారణం గనుక అతను 9 వేల రూపాయలు నాకోసం వ్యయపరచటం సహజమే ! తీరికగా అప్పు తీర్చుకోవచ్చు ననుకున్నాను.

కాని నాకుమాత్రం ఆర్థికమాంద్యం వచ్చి మీద పడింది. కాసీకి కరువుగా వున్నది. గుడ్డలు చినిగినయ్. క్రొత్తవి కొందామంటే పర్సు ప్రశ్నార్థకంతో కనపడింది !

---

## 23. మంత్రివర్గ నిర్మాణం.

ప్రాంతాన్నంతటినీ ఉడికింపజేసిన ఎన్నికలు పూర్తిఅయినయ్. అవు రావురుమని ప్రజలు రేడియోలచుట్టూ మూగారు. చాలారోజులతర్వాత వివిధ పార్టీలవాళ్లూ ఒకరినొకరు చూచుకున్నది రేడియో ముందరనే. ఎన్నికల ఫలితాలు ఒక్కొక్కటే వెలువడినయ్. పార్టీలలో అతిరథులు, మహారథులవంటివాళ్లు కొందరు ఆకులురాలినట్లు రాలిపోయినారు. రాష్ట్ర జనతా పార్టీ కార్యదర్శి అభిమన్యుడి మాదిరిగా పోరాడి పోరాడి చివరకు కేవలం 3 ఓట్ల తేడాతో ఓడిపోయినాడు. రాష్ట్ర జనతాపార్టీ ఉపాధ్యక్షుడికి నాట్యాచార్యుడనే బిరుదుగూడావున్నది. అనేకమంది సినిమా తారలను ఆయన తయారుచేసి లోకానికి వప్పగించాడు. అలాంటివాడు సోదిలోకి రాకుండా పోయినాడు. అలాగే లేబరుపార్టీ రాష్ట్ర అధ్యక్షుడు తాటిపండు రాలినట్లు రాలిపోయినాడు. మా జిల్లా లేబరుపార్టీ కార్యదర్శికి కార్మికవీర అనే బిరుదు నామధేయం వున్నది. ఆయన డిపాజిట్ కూడ కోల్పోయినాడు !

175 సీట్లలో 80 సీట్లు జనతాపార్టీకి వచ్చినయ్. 75 సీట్లు లేబర్ పార్టీకి వచ్చినయ్. 15 సీట్లు మహిళాపార్టీ గెల్చుకున్నది. 5 సీట్లలో స్వతం

త్రులు వచ్చారు. ఇదీ పరిస్థితి. ఏ ఒక్క పార్టీకీ పూర్తి మెజారిటీ రాలేదు. రెండు పార్టీల నాయకులూ తెల్లముఖాలువేశారు. రెండు నెలలనుంచి పడిన కష్టమంతా ఫలితానికి రాలేదు.

ఎన్నికల ఫలితాలు వెలువడిన రాత్రిపూటనే జనతాపార్టీ శాసన సభ్యులందరికీ అర్జంటు టెలిగ్రాములు వచ్చినయ్. మరునాడు కాకులు కూసే సమయానికల్లా అందరూ కుంభకోణంలో వచ్చివాలారు. సమావేశం ఐదు నిముషాలసేపు జరిగింది. ఉక్కుమనిషిలాంటివాణ్ణిగా చూచి రంగాచారిని పార్టీ నాయకుణ్ణిగా ఎన్నుకున్నాం. ముఖ్యమంత్రిపదవి సందేహాస్పదంగా వుండటంవల్ల పోటీకి నిలబడుదామని అంతకుముందునుంచీ ఉవ్విళ్లూరిన రమణారెడ్డి నీళ్ళుమింగి వూరుకున్నాడు. అధికారం వస్తుందా అనధికారం వస్తుందా అని అందరూ మీనమేషాలు లెఖ్ఖపెడుతున్నారు.

లేబర్‌పార్టీవాళ్లు వదలిన బాణం గురికి దగ్గరగా పడిందని ఆనందపడుతున్నారు. తమకు మెజారిటీ రాలేదని ఏడవకపోగా జనతాపార్టీకి రాలేదని సంతోషిస్తున్నారు! వాళ్లుగూడ నారాయణరెడ్డిని పార్టీ నాయకుడుగా ఎన్నుకున్నారు.

కృష్ణాష్టమినాడు ఉట్లు అందుకోటంకోసం పోటీపడినట్లు రెండు పార్టీల నాయకులూ మహిళాపార్టీ శాసనసభ్యుల కటాక్ష వీక్షణాలకోసం నానాఅవస్థలు పడుతున్నారు. వాళ్లు ఎటుమొగ్గితే అటు వాలుతుంది లక్ష్మి! రంగాచారి చాలా ప్రతిభావంతుడు. అవతలిమనిషియొక్క మానసిక పరిస్థితిని ముందుగా ఊహించుకొని తదనుగుణ్యంగా మాటలాడ నేర్చినవాడు. అతను అద్వితీయమైన పథకం ఒకటి సిద్ధంచేశాడు. దాన్ని వెంటనే రాష్ట్రవ్యాప్తంగా అచరింపచేశారు. దానిప్రకారం జనతాపార్టీ శాసనసభ్యుల భార్యలు మహిళాపార్టీ శాసనసభ్యులను కలుసుకొని, ముఖాన బొట్టుపెట్టి చేతిలో మామిడిపండూ తాంబూలమూ పెట్టి, బెనారెస్ సిల్కు రవిక గుడ్డను సమర్పించి "మీరు ఎన్నికల్లో గెల్చినందుకు ఇది మా చిన్న కానుక. ఉన్న పార్టీలలో పెద్దపార్టీ అయినటువంటి జనతాపార్టీతో మీరుచేతులు కలిపి, మీరు అధికారం చేపట్టాలని మా కోరిక." అనిచెప్పి వచ్చేశారు. నిజంగా స్త్రీలు అల్పసంతోషులు. రవికగుడ్డతో తృప్తిపడ్డారు. పండూ, పసుపూ కుంకంకంటె వారికి కావలసిందేదీ లేదు. అంతకంటె మేమిచ్చిందిలేదు ! ఉపరి మా రంగాచారిగారు శాసనసభా మహిళా

పార్టీ నాయకురాలు శ్రీమతి కమలాదేవిని కలుసుకొని ఆమెను ఆరోగ్యశాఖా మంత్రిణిగా నియమిస్తానని మాట ఇచ్చారు. అంతేగాక మా తాయారమ్మను డిప్యూటీ స్పీకరుగా ఎన్నుకుంటామనికూడ వాగ్దానం చేశారు. జనతా పార్టీకీ, మహిళాపార్టీకీ సఖ్యత కుదిరింది.

గవర్నర్ కేదారనాథ్ సహానీగారు రంగాచారిని ఆహ్వానించి మంత్రివర్గం ఏర్పరచమని కోరారు. లేబర్ పార్టీవాళ్లు స్వతంత్రుల్ని తమవైపు తిప్పుకోగలిగారు. ప్రతిపక్షబలం 85 అయింది. ప్రభుత్వబలం 95 అయింది. ఆరుగురు మనుషులు తల్చుకుంటే ఓడలు కొస్తా బండ్లుఅవుతయ్! ఇదీ పరిస్థితి.

ముందొచ్చిన చెవులకంటె వెనకొచ్చిన కొమ్ములు వాడి అన్నట్లు తిమ్మాపురంనుంచి జనతాపార్టీ తరఫున గెలిచిన నేను ఇట్లాగే మైలురాయిలాగ పడివున్నాను; గ్రహబలం అనుకూలంగా వుండి గెలుపొందిన తాయారమ్మ డిప్యూటీ స్పీకరు అయి కూచుంది మునిమునినవ్వులు నవ్వుకుంటూ! ఇదీ ఒకందుకు మంచిదే లెమ్మనుకున్నాను. మా నియోజకవర్గానికి సంబంధించిన పనులు జరిపించడంకోసం నేను నేరుగా ముఖ్యమంత్రి దగ్గరకు పోకుండా తాయారమ్మను ఆశ్రయిస్తే సరిపోతుందిగదా అని వూరుకున్నాను. ఊరుకోక నేను చేయగలిగిందేమీ కనపడలేదు. పూర్తి మెజారిటీ లేని జనతాపార్టీని ఆర్తరక్షా పరాయణులమోస్తరుగా రెక్కపుచ్చుకొని ఒడ్డుకు లాగిన వాళ్లు మహిళాపార్టీవాళ్లు. వారి కోరికలను తీర్చకపోతే మేమంతా సుడిగుండం పాలుకావలసి వచ్చేది. గోళ్ళు భుజిస్తూ ప్రతిపక్ష స్థానాల్లో కూచోవలసివచ్చేది!

లజ్జాకరమైన సంగతి ఒకటి చెప్పవలసి వున్నది. మాకు నెలకు 150 రూపాయల జీతమట! అవ్వ! నామర్దాచేటు! ఒక్కొక్క అభ్యర్థి ఇగవై ముప్పైవేల రూపాయలను కళాపిచల్లినట్లు విరజిమ్మి, మూడునెలలపాటు నిద్రాహారాలు మానుకొని ఆసులో దారం తిరిగినట్లు తిరిగి, అవతలివాళ్ళు నానా మాటలు అంటుంటే మనల్ని కాదనుకొని సహించి, తీరా ఎన్నికల్లో గెలిస్తే మాకిచ్చేది 150 రూపాయలా! ఎవరిముక్కులో పెట్టటానికీ అంట! అసలీ భరణం మటుకు దేనికీ అంట! ఏ అయ్యదగ్గరో చేరి పద్దులు రాసేవాడికిస్తున్నారే ఈమాత్రపు జీతం! బొంబాయిలో అడుక్కు

తినేవాడు సంపాదిస్తున్నాడే ఈ మాత్రపు సంపాదన! మాకేమో శాసనకర్తలని పేరు; మాకు విదిల్చేది నాలుగు రాగిపైసలు! ఛత్!

కుంభకోణంలో వున్న మొదటి పదిరోజులూ శాసనసభ నన్నంత ఆకర్షించలేదు. విచ్చలవిడిగా పట్నం చూచివద్దా మనిపించింది. ఒకనాడు హార్బరు చూచాను. మరొకనాడు మ్యూజియం చూచాను. ఇంకొకనాడు రేడియోస్టేషను చూచాను. ఒకనాడు ఇంగ్లీషు సినిమాకు వెళ్ళాను. ఛీ ఛీ! మరీ ఇంగ్లీషు సినిమాల్లో నటించేవాళ్లకు సిగ్గులేదేం?

శాసనసభలో మాట్లాడాలని నాకు కొద్దికొద్దిగా అభిలాష కలిగింది. ఒకనాడు రాష్ట్రంలోని పోలీసుశాఖ డిమాండునుగూర్చి చర్చ జరుగుతున్నది. చాలామంది చాలా సంగతులు చెపుతున్నారు. కాని నామనస్సులో వున్న సంగతి ఎవరూ చెప్పలేదు. సరేనని ధైర్యంచేసి నిటారుగా నిలబడి "అయ్యా! పోలీసులు నాలుగుబజార్లమధ్య నిలబడాలంటే చాలా పట్టణాల్లో సిమెంటు గొడుగులు లేవు. పోలీసులు ఎండలో ఎండి వానలో తడవవలసి వస్తున్నది. ఆగొడుగులు కాస్త కట్టించండి పుణ్యముంటుంది" అని కూచున్నాను. సభంతా గొల్లుమన్నది. అంతా హర్షధ్వానాలు చేశారు కాని ఒక ఖటోత్కచుడివంటి మనిషి మంత్రులపక్కన కూర్చొని నావంక పెద్దపులి చూచినట్లు చూచాడు. సమావేశం అయిన తర్వాత నాదగ్గరకు వచ్చాడు. ఆయన మా ఛీఫ్ విప్ ట! తనతో ముందుగా సంప్రతించకుండా ఇకనుంచి ఎన్నడూ శాసనసభలో మాట్లాడవద్దన్నాడు. అట్లాగా అని ఊరుకున్నాను. చేతులో పేముబెత్తం ఒకటి తక్కువగాని హైస్కూలు హెడ్మాస్టరు లాగ మమ్మల్ని ఆయన పర్యవేక్షిస్తుంటాడు!

నేనెప్పుడూ విని ఎరుగని విషయాలు అసంఖ్యాకంగా వున్నయ్. సేల్సుటాక్సు రెండుచోట్ల విధించటం, జి. సి. ఐ. ఎం. కోర్సును ఎం. బి. బి. యస్. కోర్సుతో సమానంగా చూడటం, రైతులకు మారటోరియం ఇప్పించటం, బేసిక్ విద్యావిధానం ప్రవేశపెట్టడం, డెఫిసిట్ ఫైనాన్సింగు, ఇత్యాది అనేక సంగతులున్నయ్. వీటిలో ఏ ఒక్కదాన్ని గురించీ సమగ్రంగా నాకు తెలియదు. నాకేమిటి! శాసనసభ్యుల్లో ఏ నలుగురు ముగ్గురుకో తప్ప అందరికీ ఇవి కొత్త సంగతులే. మరి వీటిని గురించి ఏమి మాట్లాడుతాం? క్షుణ్ణంగా తెలిసిన సంగతి గూర్చి అంతమందిలో మాట్లాడటమే కాస్త గుండెధైర్యంతో కూడిన పని. అదీగాక ఈ మహిళా

పార్టీ వాళ్లు పల్లేరుకాయల్లాంటి వాళ్లు. వాళ్లు మూగమొద్దుల్లాగ కూచుంటారు. నోట్లోనుంచి మాట పెగలదు. ఎవరైనా మాట్లాడుతుంటేమాత్రం అయినదానికీ కానిదానికీ పగలబడి నవ్వుతారు. దాంతో సంచున్న వాడు చెప్పదలచింది చెప్పకుండానే దొంగచాటుగా కూచోవలసి వస్తుంది. పోనీ ఇంటిదగ్గర వ్రాసుకొచ్చి శాసనసభలో గడగడా చదవచ్చునేమో నను కుంటే అట్లా వల్లకాదుట. రూల్సు వప్పుకోవట. అశువుగా అప్పటి కప్పుడు చెప్పాలట. మేమన్నా ముఖర్జీలమా బెనర్జీలమా అట్లా చెప్ప టానికి?

దీన్నిబట్టి చూస్తే నాకు చాల దిగులు వేసింది. ఏడుకొండలు కష్ట పడి ఎక్కిన పండుముసలికి వెంకటేశ్వరస్వామి దర్శనం దుర్లభమైతే ఎంత బాధపడుతాడో నాకంతటి విచారం వేసింది. అసలు శాసనసభలో ముచ్చటించే మహాద్భాగ్యం నాకు కలుగుతుందో లేదోనని భయంవేసిందికూడాను.

ఈ విషయంలో తోటి శాసనసభ్యులు ఏమిచేస్తారో వేచిచూచాను. అసలు మూడువంతుల మందిలో శాసనసభలో ఉపన్యసించాలనే కొంతు కూడ కనపడలేదు. ఎవరో ఐదారుగురు వక్తలున్నారు. సాధారణంగా వాళ్ళు తప్ప మరెవ్వరూ ఉపన్యసించాలని కూడ అనుకోరు. మాట్లాడ వలసిందిగా మమ్మల్ని ఛీఫ్ విప్ ప్రోత్సహించడు. ఎందుకంటే ఎంత కొద్దిమంది మాట్లాడితే కార్యకలాపం అంతత్వరగా అయిపోతుంది. మరి శాసనసభ్యుల పనేమిటంటూరా? వాళ్లసలు రోజూ శాసనసభకు రారు. సొంతవూళ్లో నీడపట్టున వుంటారు. ఒకవేళ వచ్చినా చెట్లకిందనో క్యాంటీన్‌లోనో కూచొని పల్లెటూళ్లనుంచి పనులు చేయించుకొని పోవటం కోసం వచ్చే మురాదారులతో సంప్రదిస్తూ వుంటారు. లేదా సెక్రెటేరియట్‌లోకి వెళ్లి బంట్రోతులను మంచి చేసుకొని ఏపని ఎవరి వల్ల ఎట్లా జరుగుతుందో వాకబు చేస్తుంటారు. తప్పితే పట్టణంలోవుండే వినోదశాలలకు వెళ్లి తురుపు, మణేలా, అంటుంటారు. చాలాసార్లు కోరంలేదని స్పీకరు చెవులు గింగురుమనేటట్లు గంటమోగించేవాడు. ఆసభ్యులకోసం ఛీఫ్ విప్ పంతులమ్మ మాదిరిగా తెగతిరిగేవాడు. ఇలాంటి పరిస్థితిలో నావంటి మర్యాదస్తుడు ఏం చేయాలో తోచకుండా వున్నది.

---

# 24. ప్రశ్నోత్తరాలు

శాసనసభా కార్యక్రమంలో కల్లా రసవత్తరమైన ఘట్టం ప్రశ్నోత్తరాల సమయం. ప్రజల సాధక బాధకాలను గురించి ప్రభుత్వం దృష్టికి తేవడంకోసం ఈ సమయాన్ని వినియోగిస్తారు. ఒకనాడు స్కూలుఫైనలు పరీక్షలలో కాపీలు జరగడం గూర్చి ప్రశ్నలు వర్షించబడ్డాయి. చాల ఉత్సాహకరంగా కార్యక్రమం నడిచింది. ఇప్పటికీ నాటి అనుభవం కళ్లకు కట్టినట్లు కనిపిస్తుంది. ఆనాటి కార్యకలాపాన్ని గుర్తున్నంతవరకు యధాతధంగా ఇక్కడ పేర్కొంటున్నాను.

శ్రీ నారాయణరెడ్డి (లేబర్) స్కూలు ఫైనలు పరీక్షలకు వాచర్లుగా పంపబడిన ఉపాధ్యాయుల మాన ప్రాణాలకు ప్రభుత్వం పూచీ పడుతుందా ?

విద్యామంత్రి: విద్యార్థుల చేతుల్లోనే ఉపాధ్యాయుల మాన ప్రాణాలకు ప్రమాదం వాటిల్లుతుందని నాకు అనిపించటం లేదు.

శ్రీ సోమలింగం: (స్వతంత్ర) వెల్లుల్లిపాలెంబోర్డు హైస్కూలులో స్కూలుఫైనలు పరీక్షల సందర్భంలో ఒక విద్యార్థి కిల్లీరూపంలో బుగ్గన పెట్టుకొని వచ్చిన కాగితాన్ని చేతులోకి తీసుకొని కాపీకొడుతుండగా పసికట్టి పట్టుకున్న వాచరు ఆనాటిరాత్రి ఆరుబయట మంచంమీద పడుకొని నిద్రపోతుండగా కొందరు యువకులు మంచం మంచం లేవనెత్తి ఏటిలో వదిలివేసిన సంగతి ప్రభుత్వానికి తెలుసా? ఆవాచరుకు ఈత చేతకాదనిగూడ తెలుసా ?

విద్యామంత్రి: పాపం! అట్లాగా! వివరాలు తెలిపితే విచారిస్తాం.

శ్రీ రామరాజు (లేబర్): గోదావరిజిల్లా నక్కలపాడు గ్రామానికి అకస్మాత్తుగా మార్చి 18 వ తేదీన నూరుమంది రిజర్వుపోలీసులు తెప్పించబడ్డారు. ఆ గ్రామంలో వున్న లేబర్ పార్టీవాళ్ల కొంపలమీద దాడి చేయించటానికే ఈబలగాన్ని పిలిపించారా? పోలీసులు వచ్చినప్పటినుంచి ఊళ్లో కోడిపిల్లలు మాయమవుతున్నాయి. కనుక ఆ పోలీసుల్ని వెంటనే ఆవూరినుంచి పంపివేస్తారా ?

ముఖ్యమంత్రి: కోడిపిల్లలు మాయమవటానికీ, పోలీసులు వుండటానికీ ఎలాంటి సంబంధమూలేదు. నక్కలపాడు బోర్డు హైస్కూలులో

స్కూలు ఫైనలు పరీక్షల వాచర్ల రక్షణార్థం పోలీసుల్ని పంపాం. పరీక్షలై పోగానే వాళ్లను పంపివేస్తాం.

శ్రీ భీమారావు (స్వతంత్ర) దీన్నిబట్టి వాచర్లుగా వెళ్లే ఉపాధ్యాయులు విధిగా ఈత నేర్చుకున్నవారై యుండాలనీ, కసరత్తుచేసి కండ పుష్టి కలిగివుండాలనీ, డ్రిల్లుమేష్టర్లకు ప్రిఫరెన్సు ఇవ్వాలనీ ప్రభుత్వం నిర్ణయిస్తుందా ?

విద్యామంత్రి : ప్రస్తుతం అలాంటి వాళ్లే పంపబడుతున్నారని నా విశ్వాసం.

శ్రీ సోమలింగం. (లేబరు) స్కూలుఫైనలు పరీక్షలపుడు ఔట్ అయిన ప్రశ్నపత్రాలు అనే పేరుతో కొన్ని ప్రచారమైన విషయమూ ఆ ప్రశ్నలకూ నిజంగా ఇవ్వబడ్డ ప్రశ్నలకూ ఏ మాత్రం సంబంధం లేక పోవడంవల్ల ఆ ప్రచారాన్ని వేలకొలది విద్యార్థులు ఆశాభంగం చెంది పరీక్ష చెడగొట్టుకున్న విషయమూ, ప్రభుత్వం గమనించిందా ? ఈ ప్రచారం చేసినవారిలో ఉపాధ్యాయులు గూడ వున్నట్లు తెలుసా ?

విద్యామంత్రి : తెలిసినా తెలియకపోయినా మేము చేయగలిగిందేమీ లేదు.

శ్రీ భీమారావు : (స్వతంత్ర) స్కూలు ఫైనలు పరీక్ష సమయంలో నిజంగా ఔట్ అయిన పేపర్లు విద్యామంత్రి గారి కొరు వెనుకభాగంలో అతికించబడిన సంగతి మంత్రిగారు గ్రహించారా ? పరీక్షలు తిరిగి జరిపిస్తారా ?

విద్యామంత్రి: "ఔట్" అయినవో "ఇన్" అయినవో నాకు తెలియదు. గౌరవసభ్యులలో ఈ విషయంలో ఏకాభిప్రాయం లేదుగనుక ప్రతిపక్షంవారు కోరితే ఓటింగు తీసుకొని నిర్ణయించవచ్చు. నాకేమీ అభ్యంతరం లేదు.

స్పీకరు : పరీక్ష పేపరు ఔట్ కావటాన్ని గురించి ఓటింగ్ తీసుకొని నిర్ణయాలు చేస్తే లోకం మనల్ని దద్దమ్మలకింద జమకడుతుంది. ఓటింగ్ తీసుకోగూడదని రూలింగ్ ఇస్తున్నాను. (ప్రతిపక్ష సభ్యుల హర్ష ధ్వానాలు.) మరొక ప్రశ్న వేయండి.

శ్రీ సోమలింగం. (లేబరు) కొన్ని హైస్కూళ్లలో ఉపాధ్యాయులే కాపీలు అందజేస్తున్నారని ప్రభుత్వానికి తెలుసా? దీన్ని అరికట్టడానికి ఏమిచర్యలు తీసుకున్నారు?

విద్యామంత్రి: ప్రధానంగా ఆత్మరక్షణ కొరకు, తరువాత తమ స్కూలు పిల్లలు అధికంగా ప్యాసుకావటం కొరకు, ప్రధానోపాధ్యాయులే అక్కడక్కడ కాపీలు ప్రోత్సహిస్తున్నారని మాకు తెలుసు. ఇలా కాపీలు కొట్టే అవసరం లేకుండా సులువుగా ప్యాసుకావటం కోసమే నూటికి నలభై మార్కులదాకా "టిక్ సిస్టమ్"లో జవాబులు వ్రాసే పద్ధతి ప్రవేశపెట్టాం. సభవారు కోరినట్లయితే నూటికి నూరు మార్కులూ "అవునా? కాదా?" అనే ప్రశ్నలతో పేపర్లు వుండేటట్లు నిర్ణయించడానికి నాకేమీ అభ్యంతరంలేదు. (వినుడు వినుడు అని కేకలు).

శ్రీమతి కామాక్షమ్మ: (మహిళాపార్టీ) దేశమంతటా విద్యార్థుల కాపీలు కొడుతున్నారనే సత్యాన్ని సభవారు అంగీకరించారు. ఆ కాపీలను ఎవరూ ఆపలేకపోతున్నారనే విషయం గూడ అంతా అంగీకరించారు. కనుక పుస్తకాలు దగ్గరపెట్టుకొని జవాబులు వ్రాసే పద్ధతిని ప్రవేశ పెడుతారా?

విద్యామంత్రి: పుస్తకాల్లో జవాబులు ఎక్కడున్నాయో విద్యార్థులు తెలుసుకోలేరని నానమ్మకం. అందుచేత "అవునా కాదా" అనే ప్రశ్నావళివల్లనే ఎక్కువ ఉపయోగముంటుందనుకుంటాను.

శ్రీమతి నాంచారమర్మ (మహిళా) రాష్ట్రంలో సుమారు 60 వేల మంది స్కూలుఫైనలు విద్యార్థులున్నారు. వీరిలో ఏటా 10 వేలమంది ప్యాసవుతారు. ప్యాసయే ప్రతివ్యక్తివాడిపై తలా పదిరూపాయలు చొప్పున పన్ను విధించినట్లయితే ప్రభుత్వరాబడి లక్షరూపాయల దాకా పెరుగుతుందనీ, ప్యాసయే సంతోషంలో విద్యార్థులు డబ్బు ఇస్తారు గనుక పన్నును భారంగా పరిగణించరనీ ప్రభుత్వం గమనించిందా?

శ్రీ భీమారావు: ప్యాసయే వారిసంఖ్య తక్కువ, తప్పేవారి సంఖ్య ఎక్కువ కనుక తప్పే వారందరి నుంచీ తలా పదిరూపాయల చొప్పున వసూలు చేస్తే ఆదాయం నాలుగురెట్లు అధికంగానూ వస్తుంది.

తప్పినందుకు విద్యార్థులను శిక్షించినట్లు అవుతుంది. ప్రభుత్వం ఈసూచనను అంగీకరిస్తుందా ?

ఆర్థికమంత్రి : గౌరవసభ్యులకు హృదయపూర్వకంగా కృతజ్ఞత తెలుపుచున్నాను. మీ రెండు సూచనలనూ సంతోషంగా పాటిస్తామని హామీ ఇస్తున్నాను. (సభలో నిర్విరామంగా చప్పట్లు).

ఈ సరళిలో ప్రశ్నోత్తరాలు నడిచేవి. శాసనసభా కార్యక్రమంలో కల్లా సజీవమైన భాగం ప్రశ్నోత్తరాలనే చెప్పాలి.

## 25. సందిగ్ధ పరిస్థితి

నన్ను కాకులు పొడిచినట్లు పొడిచి చంపుతున్నారు మావాళ్లు... చిన్నప్పుడు టీకాలువేసే వాళ్లు ఊళ్లోకి వస్తే వడ్లగాదెలోకి దిగి దాక్కునే వాణ్ణి. ఇపుడు అలా ముఖం చాటుచేసే వీలులేకుండా వచ్చింది.

కోటిరెడ్డిగారి కుట్టివాడు జంతుశాస్త్రం తీసుకొని ఇంటర్మీడియట్ ప్యాసవడంకూడ నామెడకే వచ్చి చుట్టుకొన్నది. అతనికి మార్కులు మాత్రం 40 కి తగ్గకుండా, 45 కు దాటకుండా వచ్చినయ్. సుతిమెత్తని కుట్టివాడు. పట్టుకుంటే కందిపోయేలా వుంటాడు. మరొకడి కాలికి రక్తం కారుతుంటే ఇతనికి చురుక్కుమంటుంది. అలాంటి సజ్జనుడికి ఎం. బి. బి. ఎస్. లో సీటు ఇప్పించాలట ! దానికోసం ఆరోగ్యశాఖా మంత్రిణిగారిని కలుసుకోమని నన్ను మోచేతితో పొడుస్తున్నాడు కోటిరెడ్డి.

మురికిపూడి గ్రామవాసులు కత్తులూ కటార్లూ పుచ్చుకొని అర్ధరాత్రివేళ గుడిపూడి గ్రామంమీద విరుచుకుపడ్డారు. వూరివెలుపల కాలువ గట్టుమీద రెండు పక్షాలవాళ్లూ తారసిల్లారు. భారతదేశ చరిత్రలో మూడవ పానిపట్టుయుద్ధం ఎంత ప్రఖ్యాతి చెందిందో గుడిపూడి గ్రామ చరిత్రలో ఈ దొమ్మీ అంత ప్రఖ్యాతి చెందింది. ఇరవై కట్టెలు అప్పడాల మాదిరిగా విరిగి పోయినయ్. నలభైమంది వీపులు జల్లెడ పొడిచినట్లు పొడిచి వదిలిపెట్టారు. డెభ్భైమంది కట్లు కట్టించుకొని ఆసుపత్రిలో పడి

వున్నారు. వారిలో ముగ్గురికి ఈలోకంతో ఋణంతీరిందని అంతా అను కున్న సంగతే. రక్తం ఎక్కించీ, ఆక్సిజన్ ఎక్కించీ డాక్టర్లు వాళ్లను చావ కుండా చూచారు. ఇంత భీభత్సం జరిగినతర్వాత పోలీసులు వూళ్లమీద పడి దొమ్మితో ఏమాత్రం సంబంధం లేనటువంటి, ఆచాయలకే పోనటు వంటి ఇద్దరు పెద్దమనుషులకు బేడీలువేసి సబ్ జైలులో పెట్టి ముంతకూడు వేశారు నాలుగురోజులపాటు. ఇపుడు వాళ్లను వదిలించి, కేసు కొట్టి వేయించ వలసిన భారం నామీద పడింది!

వెంగళాయపాలెంలో పురాతన కాలంనుంచీ ఒక చెరువున్నది. ఆచెరువు క్రమంగా పూడిపోయి నేలమట్టంతో సమానమయింది. దాన్ని ఎవరూ త్రవ్వించనూలేదు. బాగుచేయించనూలేదు. మా మిత్రకోటిలోని వాడైన పుల్లయ్య కళ్లు ఆ చెరువుమీద ప్రసరించినయ్. ఆచెరువు 15 ఎక రాల విస్తీర్ణం వుంటుంది. దాన్ని కొస్తా పోరంబోకుకింద భుక్తం చేసు కుంటాను; పైనుంచి మాటరాకుండా చూడమంటాడు పుల్లయ్య.

ఆ నిర్భాగ్య దామోదరుడు సుబ్బారాయుడు నాపాలిట నక్షత్ర కుడిలాగ అయి కూచున్నాడు. స్కూలుఫైనలు బొటా బొటీగా ప్యాసై నాడు. సర్వీసు కమిషన్ మార్కులైనా లేవు. పైగా పుట్టెడు నత్తి. ఇంగ్లీషులో హంసపాదులు లేకుండా ఒక్క వాక్యం రాయలేడు. అతనికి ఉద్యోగం నేనుచూపించి పెట్టాలి. ఉద్యోగం వచ్చేవరకు నాగదిలోనే మకాం పెట్టాడు. అతన్ని వదిలించుకోవటం అత్యంత అవసరంగా వున్నది.

ఇవన్నీ ఇలావుండగా మా మామగారు ఉండుండి ఒక పనిచేశారు. కలెక్టరాఫీసు చుట్టూ ఒకటికి పదిసార్లు తిరిగి, రికార్డు గుమాస్తాను మంచి చేసుకొని తాను వందే మాతరం ఉద్యమంలో పాల్గొని ఒకటిన్నర రోజులు సబ్ జైలులో వున్నట్లు సర్టిఫికెట్ పుట్టించుకొని వచ్చాడు. దానిని కవ చంగా పెట్టుకొని అవూరిలోని 15 ఎకరాల పోరంబోకును దత్తం చేసుకో వాలని పకడ్బందీగా ప్లాను వేశాడు. ఎవరైనా అడ్డంవస్తే ఫలానా ఎం. ఎల్. ఏ. మావాడున్నాడు జాగ్రత్త అని అనడం ఆరంభించాడు! 50 ఎక రాలు ఉన్నవిగదా చాలవూ? ఈ పాడుపనికి పాల్పడటం ఎందుకూ?

కంట్రాక్టరు మహాలింగం పెద్ద వ్యవహారవేత్త అయినాడు. వేలు గుంపాయిస్తున్నాడు; లక్షలు అప్పులు చేస్తున్నాడు. సంపాదన చేసేవాడికి

అప్పులెందుకు చేయవలసి వస్తుందో నాకు అర్థం కావడంలేదు. అసలు ఆ ఇచ్చేవాళ్లుగూడ ఇతని రాబడిని మించి ఎట్లా అప్పులిస్తారో గూడ నాకు తెలియటంలేదు. ఒకరికి తెలియకుండా ఒకరు చొప్పున వూళ్ళో దాదాపు అందరూ అతనికి కొద్దో గొప్పో అప్పులిచ్చారు. ఇన్ని అప్పులు చేశాను గదాఅని అతనేమీ దిగులుపడడు. అడవిలోని వేటగాడు ఏనిముషంలో పులివాత పడుతాడో ననే భయమైనా లేకుండా నిర్విరామంగా వేటాడుతున్నట్లు మహాలింగం అప్పుల వాళ్ళ వలన చీమ కుట్టి నంత బాధనైనా పొందకుండా ఇంకా ఇంకా అప్పులు చేసి కొత్త కొత్త పథకాలు వేస్తున్నాడు. తిమ్మాపురంనుంచి ముట్లూరు, వెంగళాయపాలెం, టంగుటూరు మీదుగా కుంభకోణానికి 80 మైళ్ళదూరం, ఇంతదూరమూ ఒక బస్సు వేస్తాను. లైసెన్సు ఇప్పించమంటాడు. మన ఫిర్కాలో మనం బస్సు వేయించినట్లూ అవుతుంది; అది ప్రజాసేవకిందికీ వస్తుంది; తాను అప్పుల్లోనుంచి బయటపడనూ పడుతాడు: కనుక ఈపని చేయించి పెట్ట మంటాడు. తనకు లైసెన్సు గనుక ఇప్పించకపోతే "ఇక నీవు బతకటం నిష్ఫలం" అన్నట్లుగా మాట్లాడాడు!

ఈ పరిస్థితులన్నీ సింహావలోకనం చేసి ఆలోచిస్తే నాకు చాల ఆశ్చర్యమూ, విచారమూ కలిగింది. నేనొక్కడినే కుంభకోణంలో వుంటు న్నాను. సుశీలారావు తిమ్మాపురంలోనే వుంటున్నాడు. అతను వెంబడి లేకపోవటంవలన నాకు దారీ తెన్నూ తోచటంలేదు. నేను నిజంగా ప్రజాసేవ చేస్తున్నానా? అని నాలో నేను అనేకసార్లు ప్రశ్నించుకొని వూరుకున్నాను.

నేను ఒక్క పనిమాత్రం చేసిపెట్టాను. డిప్యూటీ స్పీకరు తాయా రమ్మకు ఇంగ్లీషులో వచ్చే వుత్తరాలను చదివి తెలుగులో అర్థం చెప్ప టానికి నమ్మదగిన కుర్రవాడు ఒకడు కావాలని అడిగింది. సరేనని సుబ్బా రాయుణ్ణి ఆమెకు వప్ప ంచి వూరుకున్నాను. ఆమెకితను ఇంగ్లీషులో పాఠాలు గూడ చెప్పటం ఆరంభించాడట! అతని పనికాస్త బాగానే వున్నది.

# 26. ఏడుగుపాటు

రెండుసంవత్సరాల ఆరునెలలపాటు మహిళాపార్టీ, జనతాపార్టీలు చిలకాగోరింకల్లాగ కలసి మెలసి పని చేసినయ్. పడుగూ పేకల మాదిరిగా ఒకదాని నొకటి అదుకున్నయ్. దేశంలోని స్త్రీ పురుషు లందరూ ముచ్చటపడ్డారు, సంక్రాంతి పండుగను నవనవోత్సాహంతో జరుపుకున్నారు. ఈ అపూర్వమైన సామరస్యం వలన దేశం సస్యశ్యామ లమై పోతుందని అభిజ్ఞులు భావించారు. ఈ రెండుపార్టీల నెయ్యమూ ఒకరకమైన వియ్యమేనని లోకం ఆశించింది.

ఇంతలో ఒక విచిత్రమైన పరిస్థితి ఏర్పడింది. అలాంటి పరిస్థితి ప్రపంచచరిత్రలో ఏ దేశంలోనూ సంభవించి వుండదు. ఏ రాజకీయవేత్తా ఇలాంటి అనుభవాన్ని పొంది యుండడు. ఎటువంటి చాణుక్యులకూ గూడ అందనటువంటి, ఎటువంటి డిప్లమసీ వలనా ప్రయోజనం లేనటు వంటి పరిస్థితి ఏర్పడింది.

మహిళా లెజిస్లేచర్ పార్టీనాయకురాలు కమలాదేవి మా ఆరోగ్య శాఖా మంత్రిణి అని ఇంతకు పూర్వమే మనవి చేశాను. ఆమె భర్త ఒక ప్రముఖ హైకోర్టు న్యాయవాది. 25 సంవత్సరాలనుంచి వాళ్లు అన్యో న్యంగానే కాపురం చేస్తున్నారు. ఇలాంటి వాళ్ల నడుమ ఎందువల్లనోగాని వ్యవహారం బెడిసింది. అనుమానం పెద్దరోగం అంటారు. ఒకరిపై ఒకరికి అనుమానం క్రమంగా ఆరంభమయింది. అది నిదానంగా పెరిగి, చిగిర్చి, పూతపూసింది. ఇద్దరూ ఏవో సందేహాలు పెట్టుకున్నారు. వాళ్లవాళ్ల సందే హాలే అబద్ధమేమోనని వాళ్లు సందేహించలేదు. వాళ్ల సందేహాలు నిజమని ఋజువుచేసే దాఖలాల కోసం అన్వేషించడం ఆరంభించారు. ఇద్దరికీ నమ్మకం కుదిరింది— వాళ్ళనడుమ ప్రేమకాస్తా అవసాన దశలోకి వచ్చిం దని! ఇద్దరూ ఇక సహజీవనం గడపజాలమనుకున్నారు. ఒకనాటి ఉదయం మేజస్ట్రేట్ కోర్టులోకి వెళ్ళి మంగళసూత్రాన్ని తెంచివేసి ఇక ఒకరి ముఖం ఒకరు చూచుకోమని ప్రకటించారు. 'లా' వప్పుకున్నది, విడాకు లిచ్చుకున్నారు. ఆయన అటు బార్ రూములోకి వెళ్ళాడు. ఈమె ఇటు సెక్రటేరియట్ లోకి రివ్వున కారువేసుకొని వచ్చేసింది!

ఇది వాళ్ళ కుటుంబ వ్యవహారం. దీనివల్ల రాష్ట్ర రాజకీయాలు తలక్రిందు లవుతాయని ఎవరమూ అనుకోలేదు. అసలా ఆలోచనే ఎవరి మనస్సులోనూ లేదు. ఒక్క అయిదంటే అయిదురోజులు గడిచినయ్. వూళ్ళో గుసగుసలారంభమైనయ్. క్లబ్బుల్లోనూ కాఫీ హోటళ్ళలోనూ ఒకటేగోల. పక్షులు కిచకిచ మంటున్నాయి. కోయిలలు నిముషానికొకటి చొప్పున గానం చేస్తున్నాయి. వీధుల్లో వదంతులు వ్యాపిస్తున్నాయి. అకస్మాత్తుగా ఆరవనాటి ఉదయం 8-30 గంటలకు టౌను హాల్లో ఆరోగ్య శాఖామంత్రిణి కమలాదేవిని లేబర్ లెజిస్లేచర్ పార్టీ ఉపనాయకుడు రజనీకాంతరావు వివాహం చేసేసుకున్నాడు! మా అందరికళ్ళూ చీకట్లు కమ్మినై. మా కందరికీ ఒక్క గంట ముందుగా పెండ్లిపిలుపు లంద జేశారు. మేము ముస్తాబు చేసుకొని టౌను హాలుదగ్గరకు పోయేసరికి 28 సంవత్సరాల పెళ్లికొడుకు 36 సంవత్సరాల పెళ్లికూతురు మీద తలం బ్రాలు పోస్తున్నాడు!! చూడదగిన దృశ్యమది. మామిడి పళ్ళభారంవలన చెట్టు పాంధులకోసం వంగి వున్నట్లు కమలాదేవి రజనీ కాంతారావుకు అందుబాటులో వుండటం కోసం ప్రయత్నిస్తున్నదా అని అనిపించింది!

రేడియోల్లో విని ప్రజలంతా తెలుసుకున్నారు. రేడియో అందు బాటులో లేనివాళ్లు మరునాడు పత్రికల్లో చదివి తెలుసుకున్నారు. ఇలస్ట్రేటెడ్ వీక్లీలో దంపతుల ఫొటోలు స్పష్టంగా ప్రకటించబడ్డాయి. వీరి వివాహవార్త రాజకీయ రంగంలో పిడుగు పడ్డంత ఆశ్చర్యం కలిగిం చింది. లాబీవర్గాలవారు తల్లడిల్లి పోతున్నారు. వివాహమనేది వ్యక్తిగత విషయమే కావచ్చు. కాని ప్రతిపక్షం లోని ఒక ప్రముఖనాయకుణ్ణి ప్రభుత్వపక్షంలోని ఒక మంత్రిణి, అందులోనూ మహిళా లెజిస్లేచర్ పార్టీ నాయకురాలు వివాహం చేసుకున్నదీ అంటే జనతా పార్టీ సభ్యులకు వంటిమీద గొంగళి పురుగులు పాకుతున్నట్లనిపించింది. ఎవరికీ ఏమి చేయ డానికీ తోచటంలేదు. ముఖ్యమంత్రి రంగాచారికి ఆనాడు అన్నంసయించ లేదట. జనతాపార్టీ మంత్రివర్గం వుంటుందా వూడుతుందాఅని అభిజ్ఞ వర్గాలవారు ఆందోళన చెందుతున్నారు.

స్త్రీబుద్ధి ప్రళయాంతకమని మనవాళ్ళు చెప్పనే చెప్పారు. లేడి కన్నులు ఎంత చంచలములో యువతుల బుద్ధులు అంత చంచలములు. పాముపడగ క్రిందనైనా వుండవచ్చునుగాని పడతుల పనిటెలకింద వుండ

లేను. ఆడవాళ్ళమాటకూ నీటిర్రాతకూ అర్థం తేడాలేదు. పురుషులు నిర్మిస్తుంటే స్త్రీలు నిర్మూలిస్తారు. స్త్రీలు ఎంత నవనీత శరీరులో అంతటి క్రూరమనస్కులు. రాజకీయాలలో మహిళల ప్రవేశం ప్రభుత్వాలకు స్మశాన ప్రవేశం! ఛీ !! ఛీ !!!

అనుకున్నంతపనీ జరిగింది. స్పీకరుకు ప్రతిపక్ష నాయకుడు నారాయణరెడ్డి అవిశ్వాస తీర్మానం అందజేశాడు. మంత్రివర్గంమీదకు అది నారాయణాస్త్రంలాగ వస్తున్నది. ఆహారశాఖామంత్రిణి కమలాదేవి తన పదవికి రాజీనామా చేసింది. డిప్యూటీ స్పీకరు తాయారమ్మను మాత్రం ఈ పెనుతుఫానులో కొట్టుకుపోకుండా పట్టుకొని వుంచాం. మహిళా పార్టీలో చీలిక ఏర్పడింది. కమలాదేవి అనుయాయులు ప్రతిపక్షాన్నీ, తాయారమ్మ అనుయాయులు ప్రభుత్వాన్నీ సమర్థిస్తున్నారు.

ఇంకో రెండు రోజుల్లో అవిశ్వాస తీర్మానం చర్చకు వస్తుంది. బలాబలాలు ప్రదర్శించటంకోసం అటు వాళ్లూ, ఇటు మేము గూడా సతమతమైనాం .....మా విద్యాశాఖామంత్రిగారు బాలబాలికలకు ఓన మాలక్లాసులో ఎలాంటి ఆటలాడిస్తారో స్టడీచేసి రావటంకోసం టర్కీ దేశం వెళ్ళాడు. ఈ విశ్వాసరాహిత్య తీర్మానం స్పీకరుకు అందివ్వబడ గానే 'నీవు చేసిన స్టడీ ఇకచాలులే, ఇక్కడ జీవన్మరణ సమస్య ఏర్పడింది, ఇక వున్నవాడివి వున్నట్లు వెంటనే దొరికిన విమానంలో ఎక్కి చక్కా రమ్మ'ని ఆయనకు వైర్‌లెస్ ద్వారా కబురుచేశాం... ఆయన విమానాశ్రయం నుంచి బెడ్డింగు పుచ్చుకొని సరిగ్గా ఓటింగు వేళకు నేరుగా శాసనసభలో ప్రవేశించాడు... మహిళాపార్టీలో ఇందిరాదేవి అని ఒక శాసనసభ్యురాలున్నది. సినిమా తెరమీద ఒక్క సారి కనిపించాలని ఆమెకు పెద్ద అభిలాష వున్నది. రంగాచారి మాట చెలామణి అయ్యేటువంటి గిరిజా స్టూడియోస్ వారు తీయబోయే తదు పరిచిత్రం "కొంటిపిల్ల"లో హీరోయిన్ పాత్ర ఇప్పిస్తానని రంగాచారి ఇందిరాదేవికి వ్రాత పూర్వకంగా మాట ఇచ్చాడు. ఆమె మాపక్షం తిరిగింది... ఇది ఇలా వుండగా ఒక్కవారం రోజుల క్రిందట మాజనతా పార్టీలో రామానాయుడనే సభ్యుడు గోదావరినదిలో స్నానం చేయటం కోసం పోయి కాలుజారి కొట్టుకుపోయినాడు. శవం గూడ పత్తాలేదు. చచ్చినవాడి కోసం మేమేడుస్తుంటే, అతను ఎన్నికలపుడు చేసిన 30

వేలరూపాయల అప్పు తీర్చలేక నదిలో దూకాడని లేబర్‌పార్టీ వాళ్లు ప్రచారం చేస్తున్నారు! చూడండి తమాషా...... ఓటింగు నాటికి లేబర్ పార్టీలో ఒకసభ్యుడికి క్షయరోగం వచ్చి బెంగుళూరు శానిటోరియంలో చేరాడు. అతను కదిలేస్థితిలో లేడని డాక్టర్లు చెప్పారు. అలాంటి వాడిని డిశ్చార్జి చేయించుకొని చిన్నకారులో కుంభకోణం తీసుకొచ్చి ఓటింగులో పాల్గొనజేశారు! ఓటింగు అయిన తర్వాత అతను స్పృహతప్పి పడిపోతే, నిద్రవచ్చి పడుకున్నాడు లెమ్మని లేబర్‌పార్టీవాళ్లన్నారు!

ఓటింగు జరిగినంతసేపూ మా గుండెల్లో రైళ్లు పరుగెత్తినయ్. ఐదేళ్లు వుండవలసిన ఉద్యోగాలు అర్ధాయుస్సుతో అంతరిస్తాయని భయం వేసింది. అందరికళ్లూ స్పీకర్ పెదిమలమీద నిల్చివున్నయ్. మేమేకాదు; గ్యాలరీల్లో కిక్కిరిసిన వందలాది జనులూ, శాసనసభకు వెలుపల మూగిన వేలకొలది ప్రజాసామాన్యమూ ఆస్పీకరు ఏమి వెల్లడిస్తాడోనని చెవులప్పగించి చూస్తున్నారు.

పిడుగుపడింది! రెండు ఓట్ల తేడాతో మంత్రివర్గం పతనమయింది. వెధవ రెండుఓట్లు! ఎవరిని అని ఏమి ప్రయోజనం? కమలాదేవి బండిని బోల్తాకొట్టించింది. పెండ్లి చేసుకున్నంత మాత్రాన తాను ఉన్న కొంపకే నిప్పుపెట్టాలా? మొగుడు ముఖ్యమా, దేశం ముఖ్యమా? ఛీ! ఛీ! జనతా పార్టీ సభ్యులు యావన్మందిమీ వంచిన తలకాయలు ఎత్తకుండా హాస్టలు చేరాము దారీ తెన్నూ తెలియక ప్రశ్నార్థకంగా కూచున్నాము.

కమలాదేవి మాపాలిట శాంభవి అయింది. ఆమె వీధిలో దొరికితే అప్పడంలాగ నమిలి మింగుదా మనిపించింది. ఎముకల్లో సున్నంలేకుండ శాస్తిచేద్దా మనిపించింది. కాకులకూ గద్దలకూ విందు చేద్దామనిపించింది. కాకపోతే మానోటికింది కూడు తీసివేస్తుందా? పరువు ప్రతిష్ఠలను మంటగలుపుతుందా? రేపు శాసనసభ రద్దవుతే ఆవీధుల్లో తిరుగాడే సుబ్బారాయుళ్లు ఎంతో ఇక మేమూ అంతేగా?

మరునాటి ఉదయం గవర్నర్ కేదారనాథ్ సహానీగారు శాసనసభను రద్దుచేశారు. ఆరునెలలపాటు తానే సలహాదారుల సహాయంతో పరిపాలిస్తాననీ, ఆ తరువాత ఎన్నికలు జరిపిస్తాననీ ప్రకటించాడు.

లాభంలేదు. పట్నంలో వుంటే తిండి దండగ. రాత్రి మెయిు లెక్కి తిమ్మాపురం చేరుకోవటం శ్రేయస్కరమనిపించింది. పాపుకెళ్ళి ఇస్త్రీగుడ్డలు తెచ్చుకున్నాను. బెడ్డింగు చుట్టిపెట్టి సర్దాను. పగిలిపోయిన అద్దాలు, చినిగిపోయిన పత్రికలు, విరిగిపోయిన దువ్వెనలు, పాతబ్లేడులు అక్కడే వదిలాను.

నేను వెళుతానని హోటలు వెధవ పసిగట్టాడు. గడపకు అడ్డంగా పొట్టవేసుకొని నిలబడ్డాడు. వాడికి మనం 125 రూపాయలుబాకీ. ఇంతకు పూర్వం మర్యాదగానైనా మాట్లాడేవాడు. ఇప్పుడదేమీ లేదు. "అయ్య గారు వూరికి పోతున్నట్లున్నారు. మానోట మట్టికొట్టకండి. డబ్బులిచ్చి దయచేయండి" అన్నాడు. "ఉన్నవాణ్ణి ఉన్నట్లు ఈ పళంగా నీకు డబ్బెక్కడ తెచ్చి ఇస్తాను ? నోటు రాసిస్తాను తీసుకో" మన్నాను. "ఎందుకూ ! నాలికగీచుకోడానికా ?" అన్నాడు వాడు.

ఇక ఏమి చేసేది ? వెధవ 125 రూపాయలకోసం మాటలుపడ వలసి వస్తున్నదే అనిపించింది. ఒక్క నిముషమాలోచించి బజారుకు వెళ్ళి రిస్టువాచీ, రాళ్ల ఉంగరమూ తెగనమ్మి వాడిడబ్బువాడి మొహాన పారే శాను. అదీగాక "వైధవ్యం" వచ్చిన తర్వాత ఆభరణాలతో పనే ముందీ ? ! !

---

# 27. వైరాగ్య లక్షణాలు!

చేతులూపుకుంటూ తోటి శాసనసభ్యులంతా ఎవరి ఇళ్లకువాళ్లు వెళ్లిపోయినారు. పొలమూగట్రా వున్నవాళ్లు ములుకట్టి పుచ్చుకొని బయలు దేరారు. డొక్కశుద్ధి గలవాళ్లు ట్యుటోరియల్ కాలేజీల్లో ఉద్యోగం కోసం బయలు దేరారు. డబ్బువెనుకేసినవాళ్లు పరాయి ప్రాంతాలకు వెళ్లి సిమెంటు వ్యాపారమొకరూ, కాగితం వ్యాపార మొకరూ ఆరంభించారు. రాజకీయాలే కులవృత్తిగా పెట్టుకున్నవాళ్లు పార్టీ కార్యాలయాలకు బూజుదులిపి కొత్తబోర్డులు చేయించి బయట కట్టి, కొవ్వొత్తి వెలిగించుకొని కూచున్నారు. ఆరునెలల్లో ఎన్నికలు

నికరంగా ఆరంభమవుతాయి గనుక ఈతడవ మాంచి మెజారిటీతో గెల వాలని ఊపులోవున్నారు.

నాతలకాయ బొప్పికట్టింది. నాకళ్ళు బరువులెక్కినయ్. నాచెవులు దిబ్బెళ్ళు పడిపోయినయ్. నాచర్మం మొద్దుబారింది. నాకాళ్ళు లాగు తున్నయ్. నామనస్సు దోవా తెన్నూ తెలియక తల్లడిల్లి పోతున్నది. నా హృదయం నామీద "సమ్మె" చేస్తున్నది!

అవును. నా హృదయం నామీద సమ్మెచేస్తున్నది. నీతో మాట్లా డను పో అన్నది. ఇవ్వాళ నీకు గుర్తువచ్చానా అన్నది. ఇన్నాళ్లనుంచి నీవు నా ముఖంచూడ లేదు గదా అని నిలదీసి అడుగుతున్నది. ఇప్పుడు మటుకు నీవు నామాట వింటావని నమ్మకం ఏమిటి అని ఎదురు ప్రశ్న వేసింది అవును. నిజమే. ఇప్పుడు మటుకు నాహృదయం ఇచ్చే ఆదేశాలను పాటిస్తానా? ఏమో నాకే నమ్మకంలేదు?

మిత్రులంతా నన్ను పరామర్శ చేసిపోదామని వచ్చారు. లాట రీలో డబ్బు పోయినవాళ్లె మోస్తరుగా మొహాలు పెట్టారు. రెండు సంవ త్సరాలనుంచి నామకాం కుంభకోణం కావటంవల్ల తీరుబాటుగా వాళ్లతో మాట్లాడి చాలా కాలమయింది. మహాలింగానికి బస్సురూటు ఇప్పించలేక పోయినానని గుర్రుగా వున్నది. నన్ను పనులు సాధించలేని మనిషికింద జమకట్టాడు. కొండయ్యమాత్రం ఆప్యాయంగా మాట్లాడాడు. ఇంత వరకు జీవితంలో ఒక వృత్తి అనేది లేకుండా తిరుగుతున్నాననీ, ఇక ఏదైనా ఒక వృత్తిని నమ్ముకొని వుంటాననీ, ఏదైనా దోవ చూపించిపెట్ట మనీ అన్నాడు. సుశీలారావుగూడ వచ్చాడు. వూళ్లు దూరం కావటం వల్ల హృదయాలుగూడ దూరమైనా యనిపించింది. తాను నన్ను తీసుకెళ్లి శిఖరంమీద కూర్చోపెడితే నేను దొర్లుకుంటూ వచ్చాననే అర్థం వచ్చే టట్లు మాట్లాడాడు. కాలఖర్మవశాత్తూ మంత్రివర్గం పతనమైతే దానికి నేనెట్లా అడ్డుపడేదీ? తాను ఆశించిన ఆశలు అడియాసలైనట్లు మాట్లా డాడు. కాని ఇంతలోనే నేనేమైనా నొచ్చుకుంటానేమోనని మాట మార్చివేసి "పోనీలేగాని మనం కలుసుకొని చాలాకాలమయింది. రాత్రి మా యింట్లో భోజనం చేద్దాం ర"మ్మన్నాడు.

ఊహ తెలిసినప్పటినుంచీ నేనూ సుశీలారావూ కృష్ణార్జునులమాదిరిగా మెలిగాం. గోలీలు ఆడుకున్నాం. దాగుడుమూతలాడుకున్నాం. మామిడి పండుగాని జామపండుగాని తెచ్చుకుంటే ఒకవైపునుంచి నేనూ, మరొకవైపు నుంచిఅతనూ కొరికి తినేవాళ్ళం. ఒళ్ళోపంతులు నన్ను ప్రశ్నలడుగుతుంటే సుశీలారావు నాకు పొడిఅక్షరాల్లో జవాబు లందించేవాడు. హైస్కూలు పరీక్షలు జరుగుతుండేవి; సుశీలారావు రెండుగంటల పేపరును ముప్పావు గంటలో అన్సరు చేసి, మిగతా టైములో నాకు కాపీరాసి అందించేవాడు. సుశీలారావూ నేనూ, వానానికి తీగె అల్లుకొన్నట్లు పెనవేసుకొని వుండే వాళ్ళం. ఆరాత్రి అతనిఇంట్లో కబుర్లు చెప్పుకుంటూ విందారగించాను. అతను నాతో మాట్లాడుతూ "మసాలా" దిన పత్రికలో సహాయ సంపాదక ఉద్యోగం ఒకటివచ్చింది; వారం రోజుల్లో వెళుతున్నానన్నాడు.

నా కళ్ళవెంట గిర్రున నీళ్లు తిరిగినై. సుశీలారావు ఉచ్ఛదశలోకి పోవటం మంచిదే; కాని అతను దాదాపు శాశ్వతంగా దూరమవుతాడనే దుఃఖం కలిగింది. దుఃఖం అణచుకోలేక పోయాను. అతని చేతిని నా చేతుల్లోకి తీసుకొని గట్టిగా పట్టుకున్నాను. "ఎందుకు మమ్మందరికి వదిలేసి పోతున్నావ్?" అని అడిగాను.

"వెంకటప్పయ్యా! దేశసేవ చేయాలనే కోరిక నాలో చిన్నతనం నుంచీ వున్నదని నీకుగూడా తెలుసు. ఆ దేశసేవ చెయ్యటానికి అధికారం లోకి పోవడం తప్ప వేరే గత్యంతరం లేదని నేను విశ్వసించాను. వయోజన ఓటింగు హక్కువలన దేశం చాలా ప్రయోజనం పొందగలదని అనుకున్నాను. కాని నేను అనుకున్నది తప్పని ఇపుడు తోస్తున్నది.

పూర్వం రాజరికాలు వున్న రోజులలో యథారాజా తథా ప్రజా అన్నారు. రాజుఎలావుంటే ప్రజలలావుంటారని అర్థం. ఇది ప్రజాస్వామ్య యుగం. ఇప్పుడు యథాప్రజా తథారాజా అనటం సబబుగా వుంటుంది. ఇపుడు ప్రజలు ఎలాంటి వాళ్ళవుతే, వాళ్ళచే ఎన్నుకోబడే పరిపాలకులు అలాంటి వాళ్ళవుతారు. నిజానికి శాసనసభలోకి వెళ్ళినంతమాత్రాన

సాధించగలిగిందేమీ కనిపించటంలేదు. పూర్వం రాజు ఒక్కడు బుద్ధిమంతు డవుతే, రాజ్యం బాగుంటేది. ఇపుడు ప్రజలందరూ బుద్ధిమంతులైతే తప్ప వాళ్ళు ఎన్నుకొనే శాసన సభ్యులు బుద్ధిమంతులై రాజ్యం బాగుండదు! అందుచేత నేను ప్రజలకు సంస్కారాలనిచ్చి బాగుచేయవలసి వున్నది. ప్రజలను బాగుచేయటానికి పత్రికలు ఒక ఉపకరణం. అందుచేత ఇకనుంచి నేను దినపత్రిక సహాయ సంపాదకుడుగా పనిచేయటం ద్వారా ఏమైనా సాధించగలనేమో ననుకుంటూ"నన్నాడు సుశీలారావు.

నేను దీర్ఘమైన ఆలోచనలో పడ్డాను. మా అమ్మగారు ఎన్నడో చెప్పిన విషయాన్ని సుశీలారావు ఇప్పటికి గుర్తించాడనిపించింది. "ప్రజ లను బాగుచేయాలి" అని అతను అన్నటువంటి మాట నాచెవుల్లో పునరా వృత్తమవుతూ వున్నది.

ఇతరత్రా నా పరిస్థితి అంత సుముఖంగాలేదు. మహాలింగం తనకివ్వ వలసిన 9 వేల రూపాయలబాకీ తక్షణం తీర్చవలసిందిగా మొఖాన చెప్పి వేశాడు. అతనికి నేనేమీ నోటు వ్రాయలేదు. తీర్చకపోయినా అతను కోర్టుద్వారా నాకాలుగూడ కదల్చలేడు. కాని నామనసు ఒప్పలేదు. నాజన్మలో ఒకరికి అప్పు ఎందుకుండాలి? నావలన ఒకడు బాధ ఎందుకు చెందాలి? అనిపించింది.

ఇది ఇలా వుండగా మా ఆవిడ ఉగాదిపండగకు పుట్టింటికి వెళ్ళి వచ్చింది. వచ్చింతర్వాత ఖేదం కలిగించే ఒకవార్త తెచ్చింది. మా మామ గారు తన అన్నకొడుకుల్లో చివరి వాడిని దత్తుచేసుకుంటాడంట. ఇది నాకు చాలా విషాదాన్ని కలిగించింది. ఇకనుంచి మా మామగారిద్వారా చిల్లిగవ్వగూడా మనకు చేరదన్నమాట! అదీగాక తనకు నేనివ్వవలసిన 5000 రూపాయలూ సాధ్యమైనంత త్వరగా పంపమనిగూడ కబురు చేశాడు.

వీధిలోకి వెళ్లితే మనుషుల్లో ఆప్యాయత కనిపించలేదు. శాసనసభ రద్దవటంతో శాసన సభ్యులమీద ప్రజలకున్న గౌరవంగూడ రద్దయినట్లు

కనిపించింది. "మళ్ళీ నుంచుంటారా?" అని కొందరు మాత్రం అడిగారు. రామిరెడ్డి మఠావాళ్ళు నక్కను తొక్కినట్లు ఆనందపడుతున్నారు. నేను బాకీవున్నవాళ్లు మాత్రం "స్వగ్రామం పోయివస్తారా" అని అడిగారు!

తెల్లవారుజామున నిద్రలేచి స్వగ్రామం పోయి డబ్బు తీసుకొచ్చి అప్పులు తీర్చాలని నిశ్చయం చేసుకున్నాను. నాటిరాత్రి కొండయ్యతో చాలసేపు హృదయమిచ్చి మాట్లాడుకొని నిద్రపోయాను.

---

# 28. స్వప్నం

"తెరచాప ఎత్తారు. గాలి హోరున వీస్తున్నది. ఒడ్డునున్న చెట్లన్నీ తలలు తిప్పుతూ మమ్మల్ని పిలుస్తున్నవా అనిపిస్తున్నది. కొండమీది నుంచి క్రిందికి వచ్చే సైకిలు మోస్తరుగా పడవ పరుగులుతీస్తున్నది. పసుపూ, కుంకుమా, అరటిపళ్లూ, జామపళ్లూ, రవికగుడ్డలూ నదిలోకి విసరివేస్తున్నారు. నీలి ఆకాశం నీటిలో ప్రతిబింబిస్తున్నది. ప్రభాకరుడు నదిలో దగ్గరకు వచ్చినట్లు కనబడుతున్నాడు; కళ్ళు మిరుమిట్లు గొలిపేటట్లు ప్రకాశిస్తున్నాడు. వీటిని కోసుకుంటూ పడవపోతున్నది.

చాలాదూరం పోయాం. "యశోద సదనం" దిగేవాళ్ళున్నారా అని సరంగు కేకవేశాడు. పడవ ఆగింది. నలుగురు మొగవాళ్ళు ఏడావి వెళ్లని పసికూనలను పాత్రిగుడ్డలతో సహా ఎత్తుకొని పడవ దిగారు. నేను వాళ్లను వెంబడించాను. దోవ పొడవునా చెట్లూ చేమలూ దట్టంగా పెరిగి వున్నాయి. ఒకవందగజాలు నడిచాము. ఆకుపచ్చని ఆకుల మధ్య పసుపుపచ్చని పళ్లతో కళ్ళకు పండువగానున్న నారింజతోట కనిపించింది. అభవనం వాకిలి ముందు నాలుగైదేళ్ళ వయస్సుగల చాలామంది బాలబాలికలు బాసిపట్లు వేసుకొని గుండ్రంగా కూచున్నారు. రూపాయంత బొట్టు

పెట్టుకొని దొండపండురంగు చీరకట్టుకొని ఒక పండుముత్తైదు వాళ్ళకొకకథ చెపుతున్నది. పిల్లలంతా కథలో నిమగ్నులై వింటున్నారు.

"అప్పుడేమయిందనుకుంటున్నారూ? ... రాజుగారి చేత ఏపాప మెరుగని చంద్రమతికి ఉరిశిక్ష వేయబడింది. కాళ్ళూ చేతులూ తాళ్ళతో కట్టివేసి ఆమెను ఉరిస్థంభం దగ్గరకు తెచ్చారు. కాటికాపరియైన వీర బాహుడు ఆమెను నరికివేయాలి. చంద్రమతి తన భార్యేగదా అని వీర బాహుడు వెనుకాడలేదు. తనకర్తవ్యం తను నెరవేర్చదలిచాడు. చంద్ర మతిని చంపటానికి ఖడ్గం ఎత్తాడు" అనంగానే వింటున్న పిల్లలంతా వల వల ఏడ్చారు. చొక్కాలతోటీ గౌనులతోటీ కన్నీళ్లు తుడుచుకుంటు న్నారు. ఆమె పరమ సంతోషంతో మళ్లీ చెపుతున్నది. "కాని చంపలేదు. ఇంతలోకి ఆక్షణంలో విశ్వామిత్రుడు వచ్చి హరిశ్చంద్రుడి సత్య సంధతకు మెచ్చుకొని చంద్రమతిని విడిపించి, పాముకరచి చచ్చిపోయిన లోహితా శ్యుని బతికించి, హరిశ్చంద్రుడి రాజ్యం హరిశ్చంద్రుడి కిచ్చాడు" అనం గానే భలేభలే అని పిల్లలు కేకలు వేశారు. 'మాతా! ఇంకోకథచెప్పు మాతా ఇంకోకథచెప్పు' అని అడిగారు.

మమ్మల్ని చూచి ఆమె మాదగ్గరకు వచ్చింది. కాళ్లుకడుక్కో డానికి నీళ్ళు తెప్పించింది. తల్లీతండ్రీ లేని అనాథలు వీళ్లు అని ఆ నలుగురు పిల్లన్నీ ఆమెకు వప్పగించారు. ఆమె వాళ్ళను స్వయంగా తీసుకొని వెళ్లి ఉయ్యాలలో పడుకోబెట్టి, పాలుపట్టి ముద్దుపెట్టుకున్నది.

సాయంకాలమయింది. ప్రభాకరుడు లేత గులాబిరంగులోకి వస్తు న్నాడు. మాత పిల్లలను పిలిచింది. ఒక పిల్లను చంకెత్తుకొని నన్ను చూపిస్తూ ఇలా అన్నది. "అబ్బాయిలూ! ఇవ్వాళ మీఅన్నయ్య వచ్చాడు. ఇక ఇవ్వాళనుంచీ మీ అన్నయ్యే మిమ్మల్ని ఆడిస్తూ, లాలిస్తూ వుంటాడు. ఇవ్వాళ మీచేత ఆటలాడిస్తాడు ఆడుకోండి" అని అన్నది. "అమ్మాయిలూ! రండి వేపచెట్టుకిందికి పోయి దాగుడుమూత లాడుకుం దాము రండి" అన్నది!

పది పన్నెండుమంది బాలుర పాలుకారే బుగ్గలతో నాచుట్టూ చేరారు. అన్నయ్యా! ఆడించు! అని అమాయకంగా అన్నారు. ఇంత మంది తమ్ముళ్లను చూస్తే నామీద నాకే ఈర్ష్య కలిగింది. మఱ్ఱిచెట్టు కిందికి వెళ్లి చెడుగుడు ఆడించాను. నేనుగూడ ఐదారేళ్ల బాలుణ్ణి అవుతే బాగుండు ననిపించింది.

భాస్కరుడు పారిజాత పుష్పపు వన్నెలోకి వచ్చాడు. మరొక ఖండంలో వున్న మానవాళికి క్రాంతి నివ్వటంకోసం వెళుతున్నాడు. యశోద సదనం ప్రాంగణంలోకి వచ్చాం. మాత పిల్లలందరినీ కూర్చో పెట్టింది. నేనుగూడ ఒక పక్కన ఒదిగి కూచున్నాను. మాత శ్లోకం చెపు తున్నది. ఒక్కొక్కమాటే విడదీసి చిన్నచిన్న భాగాలుగా చెపుతున్నది. అందరూ గొంతులు కలిపి అంటున్నారు.

శ్లో॥ యోన హృష్యతి నద్వేష్టి న శోచతి న కాంక్షతి
శుభా శుభ పరిత్యాగీ భక్తిమాన్యః సమేప్రియః॥
సమః శత్రౌచ మిత్రేచ తథా మానావ మానయోః
శీతోష్ణ సుఖదుఃఖేషు సమః సంగ వివర్జితః॥
తుల్య నిందా స్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్
అనికేతః స్థిరమతిః భక్తిమాన్మే ప్రియోనరః॥

నేనుగూడ వాళ్లతో కలిసి శ్లోకాలు పలుకుతున్నాను. ఆ శ్లోకాలు అంటుంటే నావళ్లు పులకరిస్తున్నది. ఆ పదాలను అంటూనే పిల్లలు ఏదో ఉత్సాహాన్ని, ఆనందాన్ని అనుభవిస్తున్నారు.

సాయంకాలం భోజనం వేళ అయింది. ఇరవైమంది పిల్లలూ నలు గురు నలుగురు చొప్పున ఒక్కొక్క విస్తరిచుట్టూ కూర్చున్నారు. మాత, నేనూ, మరి ముగ్గురు దాదులూ ఒక్కొక్క విస్తరిదగ్గరే కూర్చొని అన్నం కలిపి, నెయ్యివేసి ముద్దలు చేసి ఒక్కొక్క పిల్లకే చేతుల్లో పెట్టాం. వాళ్లు

మహాదానంతో వాటిని తింటున్నారు. చిరునవ్వులు చిలుకుతున్న వాళ్ళ ముఖాలుచూస్తే నాకే ఆనందం కలిగింది.

ఆమాత దగ్గర, ఆపిల్లలతో అక్కడే వుండిపోదామను కున్నాను. ఆ పిల్లలకు ఏమేమిటో చెప్పాలనీ, వాళ్ళను ఒక్కొక్క రత్నంలాగ తయారు చేయాలనీ అనుకున్నాను. ఈ కాంక్ష నామనస్సులో ప్రవేశించగానే ఒక పెద్దశంఖనాదం వినబడింది.”

కళ్ళు తెరచి చూశాను. గదిలో మిణుకు మిణుకుమంటూ దీపం కనపడింది. తలుపుతీశాను. ప్రక్కవీధిలో పెండ్లి జరుగుతున్నది. తాషా మర్భా వినపస్తున్నది. గడియారం చూస్తే 4 గంటలయింది. వెంటనే లేచి కాలకృత్యాలు తీర్చుకొని స్నానంచేసి గుడ్డలు వేసుకొని స్వగ్రామం బయలుదేరాను.

కలలో చూచిన మాతను ఇంకొక్క గంటలో కలుసుకోవ బోతున్నాను. బస్సు బయలు దేరబోతున్నది. వెళ్లివస్తాను !



